# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

# రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటే : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమ్ము ఎన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేవతనమైన మరుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పౌడరు కావాలంటె, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలరు వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DCE 3107 TEL

# పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్

## మిమ్మల్ని హిమబిందువు వంటి తాజాదనముతో స్నానానంతరపు హాయితో రోజంతా ఉంచుతుంది!




నవోత్సాహము చేకూర్చే మరియు మనసుకు ఉల్లాసము కలిగించే పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను ఒంటిమీద జల్లుకోండి. అది ఎంతో త్వరగా చెమటను పీల్చి మండుతున్న ఎండ రోజున కూడ మీకు స్నానానంతరపు తాజాదనమును మరియు సువాసనను కలిగిస్తుంది. చాలసేపు తాజాదనముతో ఉండుటకు ఎల్లప్పుడూ పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కం పౌడరును వాడండి.

చీస్‌బ్రో- పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపింపబడినది)

# ఉత్తరాలు

## మనరాష్ట్రం

"అల్లోపతీ వైద్యంమీద ఆయుర్వేద విద్యార్థుల వ్యామోహం" అన్న వ్యాసాన్ని చదివిన ప్రతివారికీ శ్రీ కౌండిన్యగార్కి హైదరాబాదులోఉన్న ఆయుర్వేద కళాశాల గురించి ఏమీ తెలీదని ఇట్టే అర్థం అవుతుంది ఆ కళాశాలలోఉన్న పాఠ్య ప్రణాళికలో ఆయుర్వేదానికి ఎంతస్థానండుందో అల్లోపతికి కూడా అంత స్థానం ఉంది. ఆ ప్రణాళిక ప్రకారం అల్లోపతీ వైద్యం చేయటానికి పరిజ్ఞానంవాలని పక్షంలో ఆయుర్వేదవైద్యం చేయటానికి కూడా పరిజ్ఞానం చాలదు ఇన్ని కారణాలవల్లనే ప్రభుత్వం కూడా ఆ విద్యార్థులకు జి సి ఐ యం ఇవ్వబోతోంది శ్రీ కౌండిన్యగారు కోరినట్లుగా ఆ కళాశాల రెండు సంవత్సరాలక్రితమే శుద్ధ ఆయుర్వేద కళాశాలగామారి, పూర్తి ఆయుర్వేద విద్యార్థులనే తయారుజేసి పల్లెలలో ఔషధశాలలు, చికిత్సాలయాలు నెలకొల్పబోతోంది.

ద్వి సూ మూర్తి (హైదరాబాదు)

## హమేషా – తమాషా

"హమేషా — తమాషా" చూ చే ట ప్ప టి కి "నిషాలో" ముంచి "ఖుషీ"లో తేల్చింది రచయితలకు నా ధన్యవాదాలు

దోనెపూడి వెంకటనర్సయ్య (మురికిపూడి)

*　　　*　　　*

"హమేషా — తమాషా"లోని " నోరు మూసుకుని తింటారాలేదా!" అన్న కార్టూను బలే నవ్వు పుట్టించింది చిత్రకారుని పేరు సరిగా తెలియలేదు

నిర్మల (మద్రాసు)

జ య దే వ.

## రేలంగి–పూలంగి

ఉప్పులోకి పప్పులాగ, "తప్పు తప్పు"పప్పులోకి ఉప్పులాగ, కాఫీకి కప్పులాగ, మనకంటికి రెప్పలాగ, నేడు చిత్రరంగానికి శ్రీ రేలంగిగారు యెంతో అవసరం వారు లేని చిత్రం రసంలేని రసగుల్లాలా భావిస్తోంది ప్రేక్షకలోకం అంటే అతిశయోక్తి కాదు

రేలంగి నేడు సినిమా ప్రపంచంలో ఓ విశిష్ట స్థానం అందుకున్నారు అంచేత ఇకముందు వారు కేవలం సంస్థల పేరునుచూసి, నటించడానికి సమ్మతించక, పాత్రలను ఎంచి నటించడానికి సమ్మతిస్తారనీ, రంగూన్ రాజాలాంటి విసుగుపాత్రలను నటించడానికి అంగీకరించరనీ ఆశిస్తున్నా!

తల్పూర్ శ్రీపాద్ (అనంతపురము)

*　　　*　　　*

రేలంగిగారు 'ఆడువారు' అనటములో సందేహమేమీలేదు. 'పాడువారు' అనటములో సందేహముంది అంచేతనే మాధవపెద్దిగారు ప్రక్కనే కన్పించారు రేలంగిగారు పాడిన "చిరునవ్వే చాలే చిత్తయి పోతానే" పాట గుండెపెర జేస్తుందా!?

మోటూరు సన్యాసిరావు (మామిడివాడ) ★

# 1961
# ఫిలిప్స్
# నోవోసోనిక్
# రేడియోలు

నాదములో ఒక
నూతన ప్రపంచము


ఫిలిప్స్ పాపులరు B2CA09U
ఎసి/డిసి. ధర రు. **129/-**


ఫిలిప్స్ ఫిలిటా B3CA07U
3 బ్యాండులు, 5 వాల్వు
ధర రు. **308/-**


ఫిలిప్స్ మయినరు B4CA07A
4 బ్యాండులు–6 వాల్వు
ధర రు. **405/-**

**9** ట్రాన్‌సిస్టరు రేడియో B4CA**07T**
రు. **510/-**





ఫిలిప్స్ ఇంటర్నేషనల్
B4CA97A–6 వాల్వులు–4 బ్యాండ్లు
ధర రు **551/-**


ఫిలిప్స్ మేజరు డబుల్ స్పీకర్సు
B5CA86A – 7 వాల్వు
ధర రు. **695/-**


ఫిలిప్స్ మాస్ట్రో B6CA86A
8 వాల్వు – డబుల్ స్పీకర్సు
ధర రు. **957/-**


ఫిలిప్స్ ట్రాన్‌సిస్టరు రేడియో
ఫిలిప్స్ B4CA96T
ధర రు **595/-**

పన్నులు అదనము

అనుమతి పొందిన ఫిలిప్స్ రేడియో డీలర్లు - విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు :

టెలిగ్రాం "సౌండ్" } **వైజాగు రేడియో కో.,** { ఫోన్ 120 / బ్రాంచి : 42

**మెయిన్ రోడ్డు, విశాఖపట్నం-1.**

బుధవారం: 18-10-61

ప్లవ సం॥ ఆశ్వయుజ శుద్ధ నవమి

సంపుటము: 54 సంచిక: 6

స్థాపితము:

1908

*

ముఖ్యసంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:

శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి: 25 న. పై

సంవత్సర చందా: 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీథి, మద్రాసు-1

★

## లోకంపోకడ



మద్రాసులో శ్రీ కామరాజనాడార్ విగ్రహం ప్రతిష్ఠిస్తున్నారు—వార్త.

'చాలాబాగుంది! మరి మనమూ మన విగ్రహాలు ప్రతిష్ఠించుకోవద్దూ.'

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: బొమ్మలకొలువు



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి అక్టోబరు 7 వ తేదీనాటికి రు. 56,348-54 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి, ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

ఏ, లేదు! ఇక్కడ మనిషికొక్క భార్య మాత్రమే.
'ఆయుర్వేద విద్యార్థి
ఆయుర్వేదం
పాకిస్తాన్‌లో రాజకీయ పక్షాలకు లైసెన్సులు! ఇవి అయూబ్ చెప్పుచేతల్లో ఉంటాయి.
లైసెన్స్
కష్టాలు!
ఈరోజుల్లో అభ్యర్థులు ఎన్నిక అవటం కన్నా ఒంటెలు సూది బెజ్జంలో దూరటం సులభం!



'స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు పురుషులకున్న హక్కే స్త్రీలకీ ఉన్నది'
మహాత్మాగాంధీ (1918)



రాజా రామమోహనరాయ్

## స్త్రీ జనోద్ధరణ ఉద్యమం

ప్రాచీన భారతదేశంలో స్త్రీలకు అన్నిరంగాలలోను పురుషులతో సమానమైన ప్రతిపత్తి, గౌరవం ఉండేవనటానికి ఎన్నో నిదర్శనాలు కనిపిస్తాయి భార్య 'భర్తతో సమాన ప్రతిపత్తిగల భాగస్వామి'అని ఋగ్వేదంలో పలుచోట్ల పేర్కొన బడింది దేవహూతి, లోపాముద్ర మొదలైన స్త్రీలు ఋగ్వేదంలో కొన్ని సూక్తములు రచించారని కూడా తెలుస్తున్నది ఉపనిషత్కాలంలో గార్గి, మైత్రేయి వంటి బ్రహ్మవాదినులు కనిపిస్తారు అటు తరువాత కాలంలో విదుషీమణులు, పరిపాలకు రాండ్రు, వీర వనితలు, లలితకళా నిపుణులు, శాస్త్ర వేత్తలు ఎందరెందరో మనకు ఎదురవుతారు

స్మృతికర్త మనువు మొత్తంమీద స్త్రీలయందు విరాధరణ చూపినా, పిల్లల పెంపకంలోను, గృహ నిర్వహణంలోను వారికి ప్రాముఖ్యం ఉన్నట్లు గుర్తించాడు అందుకే "వెయ్యిమంది తండ్రుల కంటే తల్లిని అధికంగా గౌరవించాలి" అని ఆయన పేర్కొన్నాడు. స్త్రీలు సర్వ సద్గుణాలకు నిలయములని మరొక స్మృతికర్త ప్రశంసించాడు పురాణకాలంనాటి స్త్రీలు సమాజంలో ప్రముఖపాత్ర నిర్వహించేవా రనడానికి భారతంలో అనేక ఉపపత్తులు లభిస్తున్నవి.

కాలక్రమేణా భారతనారి సమాజంలో తన ఉన్నతస్థానం కోల్పోయింది ఈ పరిణామం ఎప్పుడు ఎలావచ్చిందో ఖచ్చితంగా చెప్పడానికి వీలుకాదు. పురుషులను అధోగతిపాలు చెయ్యడానికే స్త్రీలు జన్మించారన్నభావం ప్రబలింది మనువు కూడా దీనిని ఆమోదించినట్లు కన్పిస్తుంది బౌద్ధమతం వ్యాప్తిలోకి వచ్చిన తరువాత స్త్రీల గౌరవ మర్యాదలు కొంతవరకు మెరుగయ్యాయి కాని, ఆ మతం క్షీణించటంతో పరిస్థితి మళ్ళీ దిగజారింది. మహమ్మదీయయుగంలోను, అటు తరువాత, స్త్రీల స్థితిగతులు మరీ దుర్భరమయ్యాయి ప్రజలలో మూఢనమ్మకాలు వ్యాపించాయి. సతీ సహగమనం, బాల్య వివాహాలు, పడుపువృత్తి, వరకట్నం మొదలైన దురాచారాలకు లోనై స్త్రీజాతి నరకయాతనలు అనుభవించింది. వారసత్వపు హక్కు లేకపోవటంతో పురుషుల దయాధర్మాలపై ఆధారపడి జీవితాలు వెళ్ళబుచ్చుకోవలసి వచ్చింది. విద్యావిహీనతవల్ల, వంటఇల్లే ప్రపంచం అయింది రాను రాను వనితకు విద్య అనవసరం అన్న ధోరణి పురుషులలోనేకాక, స్త్రీలలో కూడా వ్యాపించింది.

హిందూమతం, సంప్రదాయం పేరుతో, నారి

లోకానికి జరుగుతున్న అన్యాయాలను, దురాచారాలను, తొలగించడానికి ప్రప్రథమంగా కృషి సాగించిన మహనీయుడు రాజా రామమోహనరాయ్. 'బ్రహ్మసమాజం' నెలకొల్పి ఈ కశ్మలాన్ని పోగొట్టేందుకు ఆయన తన జీవితం ధారపోశాడు. క్రమంగా బ్రహ్మసమాజంశాఖలు దేశవ్యాప్తంగా ఏర్పడ్డాయి. రామమోహనరాయ్ ఆందోళన ఫలితంగానే నాటి పరిపాలకులు 1829 లో సతీ సహగమనం నిషేధిస్తూ, చట్టం ప్రవేశపెట్టారు. అటు తరువాత 1856 లో హిందూ వితంతువుల పునర్వివాహ చట్టం వచ్చింది. ఈ రెండు చట్టాలవల్లా స్త్రీజాతికి కొంతలో కొంత మేలు కలిగింది.

దేశ స్వాతంత్ర్యోద్యమంతోపాటు స్త్రీజనోద్ధరణ ఉద్యమం కూడా బలపడింది స్త్రీల దుస్థితికి విద్యావిహీనతే ప్రధానకారణం అని గుర్తించి దాదాభాయ్ నౌరోజీ, గోపాలకృష్ణ గోఖలే, అనిబిసెంట్ వంటి నాయకులు స్త్రీ విద్యావ్యాప్తికి పాటు బడ్డారు. మహిళల అభ్యున్నతికి మహాత్ముని సేవ

(62-వ పేజీ చూడండి)



కందుకూరి వీరేశలింగం పంతులుగారు

# అమ్మాయిలూ

పెద్ద హాలు. హాలునిండా ఆడవాళ్ళు. హాలుకి మధ్యగా రంగురంగు దీపాలతో పూలగుత్తిలా అమర్చబడ్డ దీపతోరణం. ఆ తోరణంనుంచి ప్రసరిస్తున్న రంగు రంగు కాంతులు హాలుని యింద్ర ధనుస్సులో వున్నట్లు చూపుతున్నాయి. హాలునిండా వరసల ప్రకారం అమర్చివేసిన కుర్చీలు, వాటికి దూరంగా కుడివైపు గోడవారగా కొన్ని బెంచీలు కలిపివేసి వాటిమీద తివాసీలు పరిచి తాత్కాలికంగా యేర్పరిచిన చిన్న స్టేజీ, ఆ స్టేజీమీద ప్రపంచంఅంతా ముంచుకుపోయినట్లు మొహంముడుచుకుని కూర్చున్న ఓ పసిమొహం. స్టేజిమీద, హాలులో హడావుడిగా అటు యిటు తిరుగుతున్న ఆడవాళ్ళల్లో ఆ చిన్న పాపని యెవరూ పట్టించుకున్నట్లు లేరు. చాలా మంది వరసగా వేసిన కుర్చీలని వదిలేసి చిన్న చిన్న గుంపులుగా చేరి యేవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దరు, ముగ్గురు ఆంగ్లోయిండియన్స్ కాబోలు, భుజాలులేని గౌన్లతో ఓ ప్రక్కగా కుర్చీలో కూర్చుని వచ్చేపోయేవారిని, హాలుని, స్టేజిమీదున్న పాపని కలియచూస్తున్నారు. కొంత మంది ఫలహారాలు వాటికి కాబోలు యెడంవైపుగా వున్న గది గుమ్మంలోనుంచి లోపలకువెళ్ళి తిరిగి వస్తున్నారు. ఆ తిరిగివస్తున్నవారికి గుమ్మందగ్గర రక్షకభటుల్లా నిటారుగా నిలబడ్డ ఇద్దరు పొడుగాటి సన్నటి అమ్మాయిలు కిళ్ళీలు, యేవో పేపరు పొట్లాలు అందిస్తున్నారు. అంతా ఆడవాళ్ళే! ఒక్క మగపురుగులేదు కొంతమంది చిన్నపిల్లల్ని తప్పిస్తే. మొత్తానికి హైద్రాబాదులో అన్ని రకాల జాతులకు, కోవలకు చెందిన ఆడవాళ్ళందరూ దాదాపుగా యిక్కడ కన్పిస్తూనేవున్నారు. ఇంతమంది ఆడవాళ్ళని ఒక్కచోట తన 20 యేళ్ళ జీవితంలో ప్రప్రథమంగా చూస్తున్న వాసంతి ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తోంది. ఒక్కతలలే చూస్తే యెన్ని రకాలో! బుట్టంత చుట్టలు చుట్టి వాటిమీద బుట్టెడు పూలు పెట్టినవాళ్ళు కొంతమంది అయితే, కొంతమంది అసలే జడే వేసుకోనట్లు భుజాల సగంభాగందాక వదిలేసి అక్కడ్నుంచి రెండళ్ళులు అల్లినట్లున్నారు. ఇంకా కొంత మంది పీచుల్లావున్నా రెండు జడలు వేసుకున్నారు.

కొంతమంది చక్కగా పొడుగాటి జడలు వేసుకుని వాటిపైన నాగరం, చంద్రవంకలాటివి పెట్టుకుని చివర కుప్పెలు వేసుకున్నారు, ఇంకా కొంత మంది నడినెత్తిమీదకి రిబ్బన్‌పువ్వులా వచ్చేట్లు అదేదో అజంతా బొమ్మల్లా ముడేసుకున్నారు. జుట్టుని యెన్ని రకాల అలంకరించుకోవచ్చో వాసంతికి తెలిసిపోయింది ఒక్క జుట్టేగాదు. బట్టలు, బొట్లు, గాజులు యెంత నాజూకుగా, యెంత సహజంగా అలంకరించుకోవచ్చో వాసంతికి మొదటిసారిగా అర్థమైంది. జుట్టు, కట్టు, బొట్టు యీ మూడిం



యద్దనపూడి సులోచనారాణి

టికోసం ఆడవాళ్ళు యెన్ని రకాలు కావాలనుకుంటారో—యెంత తాపత్రయపడ్తారో అన్పిస్తుంది వీళ్ళని చూస్తుంటే యెంతయినా పుట్టిన రోజు పేరుతో యింత హడావుడా! చిన్న పెళ్ళి చేసినంత పుట్టినరోజే యింత వైభవంగా చేస్తుంటే యిహ పెళ్ళికి యెంత హడావుడి పడ్తారో! బందరు దగ్గర ఓ పక్కా పల్లెటూరులో పుట్టిన వాసంతికి యిదంతా కొంచెం విచిత్రంగానే వుంది. స్టేజీ మీదవున్న పాపకి అందరూ యేవో బహుమతులు తీసుకెళ్ళి యిస్తున్నారు ఆ పాపకి ప్రక్కగా, వంటి నిండా ధగధగమెరిసే రాళ్ళ నెక్లెస్‌తో పట్టెడు వెడల్పుగల జరీఅంచు పట్టుచీరతో గట్టిగాబిగించినట్లున్న ఓ స్థూలపాటి వయసు మళ్ళిన సువాసిని బహుమతులు తెస్తున్నవాళ్ళని వాడి చూపులు చూస్తూ నఖశిఖపర్యంతరం పరిశీలిస్తోంది. ఆవిడ ప్రక్కగా నిలబడ్డ ఓ ఖద్దరుచీర ఆవిడ తెచ్చిన వాళ్ళు యిచ్చిన బహుమతులన్నీ జాగ్రత్తగా ఓ ప్రక్కగా పెట్తోంది ఆలస్యంగావచ్చి, హాలులో వున్న ఆడవాళ్ళనిచూసి అలాగే గుమ్మందగ్గర నిలబడిపోయిన వాసంతి చేతిలోవున్న వెండి సోప్‌బాక్సు ఒకసారి తడిమి చూసుకుంది ఎలా యీ మహాసముద్రంలో ప్రవేశించి డాక్టరుగారి భార్య సుకన్యాదేవి యెక్కడుందో వెతికిపట్టుకోవటం? అసలిలా వెలుగురిలోకి రావటంఅంటేనే వాసంతికి భయం. యేదో వ్యక్తిత్వం పోగొట్టుకున్నట్లు, తనకేం లేనట్లు జాలిగా దీనంగా అన్పిస్తుంది. అందులోనూ యిలా వంటరిగా ప్రక్కన శేఖరం లేకుండా రావటం వాసంతికి యిదే మొదటిసారి అతను ప్రక్కనవుంటే ఫర్వాలేదు. తనవి, అతనివి అన్ని జవాబులూ అతనే చెప్పుకుంటాడు తనుమటుకు అన్నిటికీ సమాధానంగా చిన్నగానవ్వుతూ వుంటుంది. అందుకే అసలు యిక్కడికి గూడ వెళ్లనంటే కాదు గూడదు, వెళ్ళితీరాలి అన్నాడు రెండు రోజుల క్రితం కాంప్‌వెళ్తూ జీప్‌లో కూర్చుని బైలుదేరబోతూ కూడా మరోసారి డాక్టర్‌గారింటికి పుట్టిన రోజుకి తప్పకుండావెళ్ళిరమ్మనమని హెచ్చరించాడు. అక్కడికి తను చాలా ఆలస్యంగానే వచ్చింది. ఇప్పటికి చాలా హడావుడి తగ్గిపోయి వుంటుంది, సుకన్యాదేవి వెంటనే కన్పిస్తుందేమోనని అయినా అసలు యింతమంది వస్తారని తనకేం తెలుసు లోపలికి వెళ్లాలంటే యేదో భయం వేస్తోంది. యెలా—యేవో ఆలోచన్లతో పరధ్యానగా నిలబడ్డ వాసంతి "అదేమిటి అలా గుమ్మందగ్గర నిలబడిపోయావేం? లోపలికి రా యెంతసేపయింది వచ్చి—శేఖరం క్యాంప్‌నుంచి రాలేదూ?" అంటూ సుకన్యాదేవి భుజంతట్టి పలకరించటంతో వులిక్కిపడింది ఆ వెంటనే తన్ని తను తమాయించుకుంటూ 'అబ్బేలేదండీ యిప్పుడే వచ్చాను మీ కోసమే చూస్తున్నాను' అంది చప్పున కళ్ళు చేతిలో వున్న సోప్‌బాక్సుమీద వాల్చుకుంటూ, ఛీ—ఛీ—యిలా గుమ్మందగ్గర నిలబడి వుండకూడదు. కాస్తంత ధైర్యం చేసుకుని లోపలికివెళ్ళి కూర్చుంటే బాగుండేది అనుకుంటూ. 'మంచిదానివే! నయం. నే వెంటనే చూశాను కాబట్టి సరిపోయింది అసలు చూడకనేపోదును మా అక్కయ్య కూతురువచ్చి గుమ్మందగ్గర పాలరాతిబొమ్మలా నిలబడ్డ ఆ అమ్మాయి యెవరు పిన్నీ అంటే తిరిగి చూశాను సుకన్యాదేవి నవ్వుతూ వాసంతిని చేయి పట్టి తీసుకొచ్చి ముందువరసలోవున్న ఓ కుర్చీలో కూర్చోబెట్టింది ఆవిడింకా యేదో చెప్తుండగా వెళుతున్నానండీ అంటూ యెవరో రావటంవల్ల వాసంతిని కూర్చో వస్తానని వెళ్ళిపోయింది

క్షణంలో వచ్చిన వ్యక్తిత్వం మళ్లీ పోయినట్లనిపించింది వాసంతికి యెవరూ మాట్లాడేవాళ్ల లేరు. పైపెచ్చు దూరంగా కూర్చున్న యిద్దరు ముగ్గురు నైలాన్‌చీరలమ్మాయిలు ఒకళ్ల తర్వాత ఒకళ్ళు వాసంతిని తిరిగి తిరిగిచూసి వాళ్లలో వాళ్లు యేమిటో చెప్పుకుంటున్నారు వాళ్లు చెప్పుకునేదేమిటో వాసంతికి విన్పించటంలేదు ఒకవేళ తనిలా కళ్లు పెద్దవి చేసుకుని చూస్తోందని వెర్రిమొహంలావుంది, తెలుసూ నేవుంది అనుకుంటున్నారేమో. లేకపోతే తనబట్టల్ని గురించి చెప్పుకుంటున్నారేమో! వాసంతి కళ్లు వాల్చుకుని చీర వంక చూసుకుంది. తెల్లటి పాలనురుగులాటి చీర. యీ చీరంటే శేఖరానికి చాలా యిష్టం. శేఖరం గుర్తుకొచ్చేసరికి వాసంతి మొహంలో భయం, బెరుకుదనం పోయి వుల్లాసం వచ్చింది క్యాంప్‌లో యీపాటికి యేంచేస్తున్నాడో! ఆఫీసులో అతను చాలా గంభీరంగా వుంటాడని అందరూ భయపడ్తారని మళ్లీ యెవరో యేసో [illegible] చెప్పాడు రాజా. శేఖరం

ఎక్కడి తమ, ఎక్కడ శేఖరం. అదృష్టంఅంటె యిదేకాబోలు. "మీ ఆయనంటే సామాన్యం కాదమ్మాయోయి. పెళ్లికాని ఆడపిల్లల గుండెల్లో మెరుపు పెళ్ళయిన ఆడపిల్లల గుండెలో నిట్టూర్పు" శేఖరంతో తన పెళ్ళి స్థిరపడింతర్వాత తనని పెళ్లి కూతుర్ని చేసినప్పుడు కొత్తబట్టలతో ఆశీర్వాదం కోసం నమస్కరించటానికి వెళ్ళినప్పుడు అన్న మామయ్య మాటలు తనెలా మర్చిపోతుంది! అప్పుడే అక్కడే నిలబడ్డ అక్కయ్య—'యిహ అందరి గుండెల్లోనూ నిట్టూర్పే మామయ్యా. ఒక్క వాసంతి మొహంలోనే మెరుపు అతను' అన్నది. ఆరోజు అవేవో తమాషా మాటలనుకుంది కానీ యెంత నిజం! కానీ చిత్రం. అన్నివిధాల వున్న, అతను తనలో యేం చూశాడో—చూసేందుకు యేముంది. అదృష్టం దయతలిచి తన ప్రక్కన నిలబడింది అంతే యివే మాటలు తను వోసారి అంటే అతను 'లేదు వాసంతీ నీలో నేను చాలా చూసాను యేం చూసానో చెప్పమని అడక్కు ఒకప్పుడు నాలోవుండి ప్రస్తుతం పోగొట్టుకున్నదంతా నీలో చూశాను' అన్నాడు తనకారోజు ఆక్షణం చాలా బాగా గుర్తుంది. ఆరోజు ఆదివారం రాజేంద్రనగర్‌లో కిద్వాయి గార్డెన్ కాటేజ్ రిజర్వ్ చేయించుకున్నారు. యెప్పుడోగాని శేఖరానికి అంత తీరిక దొరకదు. ఆరాత్రి యెంత బాగుంది. కాటేజ్ ప్రక్కనున్న పచ్చగడ్డి మంచుతో తడిసి కొద్దిగా చల్లగావుంది. తెల్లటి వెన్నెల, స్వచ్ఛమైన మనసులా చుట్టు ప్రక్కల శబ్దమేలేదు, కొంచెందూరంలోవున్న చెవులపిల్లులు గుస గుస తప్ప కాటేజ్ మధ్యగా శబ్దంచేస్తూ దొర్లే నీళ్ళు, వెన్నెట్లో పచ్చగడ్డిమీద శేఖరం జేబురుమాలు వేసుకుని కూర్చున్న తను, తన ఒళ్లో శేఖరం తల యెన్ని యుగాల అనుభవం కలిగింది తనకి అలా యెన్నికోట్ల సంవత్సరాలు బ్రతుకితేమటుకు విసుగొస్తుందా? కాలంనిల్చిపోతే బాగుండు ననిపిస్తుంది యెలా నిలుస్తుంది కాలం. తనకు చాతనైతే సూర్యుడ్ని, చంద్రుడ్ని యే లోయలమధ్యకైనా విసిరేసేది అవును వాటినుంచేగా యీ రాత్రింబవళ్ళు అవి చెయ్యలేని తను శేఖరం చేతిగడియారంతీసి దూరంగా దాచేసింది. అతన్ని గురించి తను యింతగా ఆలోచిస్తున్న యీ క్షణంలో అతనేం చేస్తుంటాడు యెందుకోమరి. తను వున్నప్పుడు వో విధంగా, లేనప్పుడు యింకో విధంగా వుంటాడు బహుశా గంభీరంగా వుండటం అలవాటయిపోవటమే కారణం కావచ్చు. రేపు సాయంత్రంగాని రాడు క్యాంప్‌నుంచి రేపుసాయంత్రం యెప్పటికి రాను మళ్ళీ గడియారంమీద కోపం. తన యీ ఆలోచన్లన్నీ శేఖరంకి తమాషా చెప్పించుకు చెప్పించుకుని నవ్వుతాడు అతనికి తెలియదుగా—అతని కోసం వో మంచివార్త వుందని. పాపం! అన్నం సరిగ్గా సయించకపోతే వాంతులు చేసుకుంటూంటే యెంత ఖంగారుపడ్డాడో. అసలు ప్రతి నిమిషం ప్రతిమాట అతను విలువ చేకూరుస్తాడా లేక తను వూహించుకుంటుందా? మొన్న మటుకు మొన్న క్యాంప్ వెళ్ళబోతూంటే తనని దగ్గరికి తీసుకుని తొందరగా వచ్చేస్తానని భయపడొద్దని చెప్తూ, "నేను వచ్చేలోగా నువ్వు కొంచం సన్నపడాలి' అన్నాడు అది నిజమే అంత అన్నం సయించకపోయినా, యేం తినకపోయినా తను బాగానేవుంది. ఒంటిరంగుకి కూడ యేదో మెరుపువచ్చింది తను లావుఅవటం శేఖరానికి యిష్టంలేదని తనకు తెలియదు అందుకే అంది 'యేం లావయితే—అసలు నేను కొంచం లావుగావుంటేనే బాగుంటానని అందరూ అంటారు' అంది 'అబ్బెబ్బె అదేంకాదమ్మాయి లావు అయ్యేరోజులు ముందున్నాయి. యిప్పుడొద్దు నువ్వులావయిపోయి కూర్చున్న చోటునుంచి కదలలేకపోతే.' 'మీది మరీ విచిత్రం. అంత లావెందుకు అవుతాను'

'యెంతయినావద్దు నేను క్యాంప్‌నుంచి వచ్చేసరికి చేతులు చాచుకుని పరుగెత్తుకొస్తావు చూడు. బంగారు తీగెలావుంటావు. లావయితే బాగుండదు. నువ్వసలు పరుగెత్తలేవు. పరుగెత్తినా నేను చూడలేను' ఇద్దరూ నవ్వుకున్నారు అంత బాగా మాట్లాడి అంత హుషారుగా మాట్లాడిన తన్ను దగ్గరికి తీసుకోవటంలో ఒళ్ళు వేడిగావుందని 'వద్దు నీకు ఒంట్లోబాగాలేదు నేను క్యాంప్ కాన్సిల్ చేసుకుంటా'నని కూర్చున్నారు ఆరోజు అసలు వుదయంనుంచే వంట్లో బాగలేదు ఆక్రితం రోజే లేడీ డాక్టర్ సుశీలకి ఫోన్‌చేస్తే ఆవిడలేదు. యెక్కడికో వెళ్ళిందన్నారు క్యాంప్ వెళ్లే హడావుడిలో వున్న శేఖరం గూడ పట్టించుకోలేదు తనూ అంత అనుకోలేదు ప్రయాణంఅయి జీప్‌లో సామానంతా పెట్టించి బట్టలు వేసుకుని టై కట్టుకుంటూన్న శేఖరం తను లోపలకువెళ్ళి కాఫీతో తిరిగి వచ్చేసరికి టై విప్పి టేబిల్‌మీద పారేసి

(51—వ పేజీ చూడండి)



మహిషాసురమర్దని

18-10-61

# మన ప్రాచీన ఆయుధాలు

## ఆమంచర్ల గోపాలరావు

[ఆయుధపూజ సందర్భంలో ఈ ప్రత్యేకవ్యాసం ప్రచురిస్తున్నాము.]

ప్రాచీనమందు ఒక జాతియొక్క నాగరికత ఔన్నత్యమును గణించడానికి వారు వినియోగించు ఆయుధాలు ఎంతో లెక్కకు వస్తాయి ప్రాచీన భారతము ఆయుధాలకు పేరెక్కినది ప్రాచీనమందు విదేశాలలో కూడా మన ఆయుధాలు ప్రసిద్ధములైన మాట వాస్తవం ప్రాచీన పర్షియా వాఙ్మయంలో భారతదేశమందు తయారయిన ఉక్కు ఆయుధాల ప్రసక్తి ఉంది అవి సాటిలేని పదునైనవట అంత పదునైనవి ఆడువారి నాలుకలే నట మధ్యయుగంలోకూడ, మంచి ఉక్కు ఆయుధాలను మన భారతీయులు చేయుచుండెడివారు పేరెక్కిన డెమాస్కసు ఉక్కు, మన హిందూదేశంలోనే తయారయ్యెడిదనీ, ఐరోపావారు దానిని డెమాస్కసులో మొదట ఎరుగుట జరిగెననీ, అందుచేత దానికి డెమాస్కసు ఉక్కు అనుపేరు కలిగినదనీ పండితాభిప్రాయము. అంతేకాదు మొగలు పాదుషా అయిన ఔరంగజేబు, గోల్కొండ సాధించవలసిన కారణాలలో డెమాస్కసు ఉక్కు గోల్కొండ ప్రాంతమందే తయారగుననియు, అందుచేత గోల్కొండను తప్పకజయించి తన రాజ్యభాగంగా చేయ నవసరమనియు వ్రాసుకొన్నాడు

కాబట్టి ప్రాచీనంనుంచి మనదేశంలో ఉత్తమ ఆయుధాలను చేయు నలవాటు ఉండెనని మనము నిస్సందేహముగా అనుకొనవచ్చును మన ప్రాచీన గ్రంథములందు కూడ ఆయుధాల ప్రసక్తి కలదు వేదాలలో ఇంద్రుడు మొదలయిన దేవతలకు కూడ ఆయుధము లుండెడివి తర్వాత భారత రామాయణాది ఇతిహాసములందును, పురాణములందును కూడ, అనేక ఆయుధములన కవులు వర్ణించిరి

ఆ ఆయుధములన్ని రెండు విధములైనవిగా కనుపిస్తాయి అస్త్రములు, శస్త్రములు దూరమునున్న శత్రువుపై విసిరి ప్రయోగించెడిది అస్త్రము చేతధరించి యుద్ధమున వినియోగించెడిది శస్త్రము అస్త్రములు కూడ రెండు విధములు. యంత్ర సహాయమున విసరబడునవి ఒక రకము మంత్రశక్తిచే ప్రయోగము చేయబడునవి రెండవరకము పురాణేతిహాసములందు మంత్రాస్త్రములకే ఎక్కువ ప్రాముఖ్యము కనబడును ఆగ్నేయాస్త్రము, వారుణాస్త్రము, వాయవ్యాస్త్రము, బ్రహ్మాస్త్రము, పాశుపతాస్త్రము మొదలగునవన్నియు దేవతలు ప్రసాదించెడివే వీటన్నిటికిని మంత్రములే మూలములు

కాని రాజులకొరకు ప్రత్యేకముగా రచనలయిన నీతిశాస్త్రములందును, అర్థశాస్త్రములందును కూడ ఆయుధ ప్రసక్తి ఒక ముఖ్యభాగము. వీటిలోకూడ అస్త్ర, శస్త్ర ప్రసక్తులున్నవి. కాని వీటియందు యంత్రసహాయమున ప్రయోగింపబడు అస్త్రములకే ఎక్కువ ప్రాధాన్యము కనిపించును

శుక్రనీతిసారమందు అస్త్రములను వర్ణించుచు, విల్లంబులనేకాక, నాళికాస్త్రమును కూడ వర్ణించాడు * నాళికాస్త్రములనగా తుపాకులని మన మర్థముచేసికొనవచ్చును కాని అవి ఈనాడు వాడుకలోఉన్న తూటాల తుపాకులు కావు మందు, గుండు దట్టించి జానకి త్రాడుతో నిప్పంటించి ప్రేల్చునవి. నాళికాస్త్రములందు పెద్దవి, చిన్నవి కూడ ఆ గ్రంథమందు వర్ణింపబడియున్నవి నాళికాగ్రభాగమందున ఇనుపగొట్టమో, అవసరమయిన కొయ్యపిడి, నిప్పు పెట్టుటకు కన్ను, ఎక్కుపెట్టుటకు అస్త్రము చివరయుండవలసిన మెట్టు, అన్నీ ఈ గ్రంథమందు సంపూర్ణముగా వర్ణింపబడియున్నవి ఇంతేకాదు దీనికి కావలసిన గుండ్లు మందు చేయు విధములు కూడ ఇందు వర్ణింపబడియున్నవి అయిదు ఫలముల సురేకారము, ఒక ఫలము గంధకము, ఒక ఫలము జిల్లేడుబొగ్గు ఈ మందు భాగములట ఈ మందును వెల్లుల్లిరసముతో శుద్ధిచేసిన మరింత మంచిదట తుపాకులు, తుపాకిమందు వర్ణించిన ఈ గ్రంథము ఆరవ శతాబ్దమునాటిదని కొందరి పండితుల అభిప్రాయము ఏది ఎట్లయినను అతిపూర్వమే మన దేశమందు తుపాకులుచేసి ప్రయోగించు అలవాటు ఉండియుండెడిదని ఈ గ్రంథాధారముగా మనము ఊహించవచ్చును

ఈ గ్రంథమందు వర్ణించిన శస్త్రములమాత్రము స్వల్పమే గద, పట్టిస, ఏకధార, క్షురప్రాంత, కటారి, కుంత, పాశము, కవచము, కరజము మొదలయినవి ఇందు వర్ణింపబడిన చక్రము ఆరు మూరల వ్యాసము గలది మిక్కిలి వాడిఅయిన ధార కలది బహుశా ఇది యంత్రము చేతనే ప్రయోగింపబడు అస్త్రమయి ఉండవచ్చును

క్రీస్తుకు మూడు శతాబ్దములకు పూర్వము రచన అయిన కౌటిల్యార్థశాస్త్రమందు, అనేక అస్త్ర శస్త్రములు వర్ణింపబడియున్నవి కాని మంత్ర సంబంధమయిన ఆయుధములమాట ఈ గ్రంథమందు అంతగా కన్పడదు

సర్వతోభద్ర, జామదగ్న్య, బహుముఖ, విశ్వాసఘాతకి, సంఘాటి, యానక, అర్ధబాహు, ఊర్ధ్వబాహు మొదలయినవి స్థిరయంత్రములు ఇవన్నీ కోటల గోడలమీదనో, లేక ద్వారముల చెంతనో యుండి, శత్రువులను వినాశము చేయగల్గు పరికరములు

పంచాలిక, దేవదండ, సూకారిక, ముసల, యష్టి, హస్తివారక, తాలవృన్త, ముద్గర, గదా, స్పృక్తాల, కుద్దాల, ఆస్ఫోటిమ, ఔద్ఘాత్మ, శతఘ్ని, త్రిశూల, చక్ర మొదలయినవి చలన యంత్రములు.

శతఘ్ని ఒక పెద్ద స్తంభంలాంటిది దానికి అనేక ఉక్కు ముళ్ళు ఉండును. కోటగోడపైనుండి శత్రుసమూహముమీదకు, దీనిని విసరివేసెడివారు. కాని నేడు భాషలో పరిపాటి అయినట్లు ఇది ఫిరంగి కాదు

కౌటిల్యార్థశాస్త్రమందు వివిధ రకములైన అంబులను కూడ వర్ణించారు వేణు, శరం, శలాకం, దండాసనం, నారాచం, అని వీటి పేర్లు

ఈ గ్రంథమందు అనేక శాస్త్రములు కూడ వర్ణించడమయినది. నిస్త్రింశ, మండలాగ్ర, అసియష్టి మొదలయినవి వివిధ ఖడ్గములు పరశు, పట్టశము, ఖనిత్రము, కుద్దాలము మొదలయినవి వివిధ గండ్రగొడ్డళ్లు ఇవిగాక శక్తి, ప్రాశం,కుంతం, హాటకం, బిందువాలం, శూలం, తోమరం, వరాహకర్ణం, కణయం, కర్పణం, త్రసికం మొదలయిన శస్త్రములన్నీ నాగలిక్రరుఅంత పదునైనవట ఇవన్నీ హాలముఖాని అని కౌటిల్యుని నిర్వచనం

ఇవిగాక, రాళ్ళతోకూడ కొన్ని రకములైన ఆయుధములను నాడు మనదేశమందు తయారుచేసెడివారని ఈ గ్రంథంనుంచి తెలుస్తుంది యంత్ర పాషాణము, గోష్పణ పాషాణము, ముష్టిపాషాణము మొదలయినవి శిలాయుధములు

( 50—వ పేజీ చూడండి )

## వాగ్దేవీస్తుతి

చతురాస్యదర్పణ ప్రతిబింబ సుందరీ
చారు సౌవర్ణభాసిని శారదాంబ!!
కమలాసనాకౌశకమనీయ కౌముదీ!
సామగానానంద సరసవాణి!
ధాతృనందనవనోద్యానకల్ప ద్రుమా!
విద్వత్కళామూర్తి విమలకీర్తి
సర్వజగత్సృష్టి చతురసరోవిహార
వినోద సుకుమార రాజహంసి!
అఖిల సురముని గేయ దివ్యాప్రమేయ
శ్రావ్యసుశ్లోకవర్ణిత! కావ్యవనిత!
అమిత సంగీతసదన! శశాంకవదన!
దివ్యతేజ స్వరూపిణీ! తేనమామి;

శ్రీమతి కమలా దేవి, అడవిపాలెం

# చదువుల్రావు


ఈవేళ నాటకం హోరెత్తించేయాలి.
తప్పక చూడండి డ్రామా— (నాటకం) నటీనటులు బంగారుబాబు, రవి కృష్ణ, ఏవీరావ్, రావ్ ప కే రావు, సుందర్ రావు. - మొ॥
దబ్బాం భోం భోయ్ దబ్బాం


మనం నాటకం వేస్తున్న హాలు ప్రక్కనే ఇన్నిరాళ్ళు ఇటుకలు వేస్తున్నారేమిటి?
బాబాయ్ మీరు రక్షించాలి ఈవేళ సాయంకాలం ఈ హాల్లో మేం నాటకం వేస్తున్నాం


మీరు ఇన్నేసి కంకరరాళ్ళు ఇటుకలు ఇక్కడ వేయించుకుంటే రేపటికి మేము బ్రతికుంటామనే ఆశ లేదు బాబ్బాబ్బా. ఈ రాళ్ళు అవరేపు వేయించుకోండి
హాలులోకి దారి
సత్యమూర్తి

# సరదాల పండగ దసరా

సర్వలోక భయంకరుడైన మహిషాసురు డనివార్య వరసంపన్నుడై ప్రజాకంటకుడుగా పరిణమించగా త్రిలోక నాథుల శక్తి స్వరూపాలతో ఆవిర్భవించిన దుర్గ ఆ రాక్షసుని యుద్ధంలో వధించి లోకపీడ నివారించి నందువల్ల ఆమె మహిషాసురమర్దని ఐందని పౌరాణికోక్తి. అందుకే ఆ దేవి ప్రీత్యర్థం ఈ నవరాత్రాలూ కాళీ, దుర్గా, చండికా, కాత్యాయనీ, భైరవీ, రాజరాజేశ్వరీ అని వివిధావతారాలలో పూజించి పునీతు లవుతారు.

దశమినాడు శమీపూజ చేస్తారు. ఈ దశమినే విజయదశమి అంటారు. ఏదైనా మహత్కార్యం ఈరోజున ప్రారంభించినట్లయితే జయప్రద మౌతుందనే భావనవుంది. శమీపూజ చేసే శ్రీరాముడు రావణ సంహారం చేశాడట అజ్ఞాతవాసం పూర్తిఅయిన తర్వాత శమీపూజ చేసి, ఆయుధాలుధరించి, అర్జునుడు విరటుని గోవులను కౌరవుల బారి




బొమ్మల కొలువు

నుండి రక్షించాడని భారతంలో కన్పిస్తున్నది. శత్రురాజుల పైకి దండయాత్రకు వెళ్లే కార్యక్రమాన్ని, ఈ విజయదశమి నాడు ఆయుధపూజతో ప్రారంభం చేసి విజయాన్ని పొందుతుండేవారు. ఆ విజయాలను కీర్తించి వంది మాగధులు, భట్టులు ధనం చేకూర్చుకునేవారు. ఒకనాడు క్షత్ర ధర్మావలంబకులు చేసిన ఈ ఆయుధపూజ, శమీపూజ, ఈరోజు సర్వసాధారణ సంప్రదాయాలుగా మారిపోయాయి.

తెలుగునాట ఈ దశరాత్రి ఉత్సవాలు సరదాగల దసరా పండగగా మారిపోయాయి. ఒకనాటి మన వీరత్వానికి చిహ్నంగా ఈరోజులలో బాల బాలికలు విల్లంబులు, కోతులు వగైరా పట్టుకుని ఊరంతా తిరుగుతారు.

"అయ్యవారికి చాలు ఐదు వరహాలు పిల్లవాళ్ళకు చాలు పప్పు బెల్లాలు" అంటూ ఇంటింటా అయ్యవారికి అప్పనంగా లప్పలు సంపాదించి పెట్టేందుకు వకాల్తా పుచ్చుకుంటారు. నిజానికి ఈ బాలబ్రహ్మలు అర్థించేతీరుకూడా వింతగావుంటుంది. మీసాల కొనలపై రోసాలు నిలప గల్గినదిగదా మన తెనుగుజాతి. అడగటంలోకూడా ఎంతో దర్పం! వారి సమ్మానపు తీరు చూడండి!

"పూయవలె గంధంబు పునుగు జవ్వాది!

రేపురా మాపురా, మళ్ళిరమ్మనక!"

అడగటంలో కూడా హుందాతనం ప్రదర్శిస్తారు.

ఓనమాలు తెలియకపోయేమాన, తెలిసినవాళ్లను దగ్గరికికూడా రానీని వ్యక్తి ఈపదిరోజులూ సంగీత విద్యా నారదుడు, సాహిత్య విద్యాచతుర్ముఖుడు. పిల్లికి కూడా బిచ్చం వెయ్యని పరమ లుబ్ధావధానులంతా ఆశ్రిత విద్వజ్జనాధారులు, అర్థిజన కుముద చంద్రోదయులు, దాన రాధేయులు. పిల్లినిచూస్తే పరుగెత్తే వీరశిఖామణులంతా, సంగ్రామ ధనంజయులు, సాహస విక్రమార్కులూను. ఇలా ఎన్నోవిధాల పెద్దలను పొగిడి అయ్యవారికి తమకూ కావలసినవి సమకూర్చుకుంటారు.

దక్షిణ దేశంలో ఈ దసరాకు బొమ్మల కొలువు ఏర్పాటు చేసుకుంటారు. ఇలా ఈ పండుగ అన్ని విధాలామన దేశంలో నలుమూలలూ అందరికీ ఆనందదాయకమైంది. సర్వలోక భయంకరుడైన మహిషుని సంహరించి ఆ సర్వయంత్రాత్మిక, సర్వతంత్రాత్మిక సర్వశక్త్యాత్మిక, దుర్గరూపంలో లోకత్రాణమొనర్చిన పవిత్రదినాలే ఈ దసరా. అఖిల చరాచర సృష్టి స్థితి లయాది సర్వవ్యాపార హేతుభూతమహాదేవి దివ్యవిలాసవర్ణనమే ఈ దశరాత్ర్యుత్సవాలు.

"చతుర్భుజే, చంద్రకళా వతంసే
కుచోన్నతే కుంకుమ రాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్ప
బాణహస్తే
నమస్తే, జగదేకమాతా." ★

# మెక్లీన్స్

## పళ్లను అతితెల్లగా జేయును అని ఋజువు చూచుకోండి

**1 దానిని తడమండి:**

జిగటగా అంటుచున్న పొర తగులు చున్నదా? సహజ తెలుపును అది దాచివేయుచున్నది. ఇప్పుడు బ్రష్‌తో తోమండి మెక్లీన్స్ ఆపొరను ఎట్లు పూర్తిగా తొలగించి వేయుచున్నదో చూడండి.



**2 దానిని రుచి చూడండి:**

మీరు సరిగ్గా చవిచూచునట్టి జలదరించే పరిశుభ్రత గల రుచి, మెక్లీన్స్‌లో వున్న మూడు చురుకైన పదార్థములు పని చేయుచున్న వనుటకు నిదర్శనం ... మీ పళ్లను భద్ర పరచు చున్నవి, కాపాడుచున్నవి, తెల్లగా జేయుచున్నవి.





**3 దానిని చూడండి:**

మీ చిరునవ్వుల తెలుపును చూచుటలో మీ కళ్లే మిరిమిట్లు గొలుపును! మెక్లీన్స్ టూత్‌పేస్టు మీ పళ్లను ఇంతకు ముందుకంటె ఎక్కువ అతి తెల్లగా జేయును. దీనిని మీరే ఋజువు చూచు కోండి!




తెల్లదైనా లేక క్లోరోఫిల్‌తో గూడినదైనా నేడే మెక్లీన్స్‌ను వాడనారంభించండి, ఇప్పుడు ధారాళంగా లభించుచున్నది

MTP/1/P/4/61-TEL




# సాందీపనిపర్వం - 31

సాందీపని మరియు ఇట్లు చెప్పెను "ఇప్పుడు మనము ఏ జగత్తును చూచుచున్నామో, ఆ జగత్తు సృష్టికి పూర్వము ఉదకములుగా నుండెను ఆ ఉదకములు అవ్యాకృతభూతసముదాయమును సృజించెను ఆ అవ్యాకృతభూతసముదాయమునే ఋషుల సత్యమునుగా గ్రహించిరి మరి ఆ సత్యము లేక అవ్యాకృతభూతసముదాయము హిరణ్యగర్భుని సృజించెను ఆ హిరణ్యగర్భుడు చతుర్ముఖుడు బ్రహ్మనామవాచ్యుడు అతడు ప్రజాపతిని, విరాజపురుషుని సృజించెను ఈ విరాజపురుషుడే విరాట్పురుషుడు సూర్యాదులకధికరణమైనవాడు ఇతనిని ప్రజాపతి అనిగూడ ఋషులనిరి ఇతడు దేవతలనుసృజించెను ఆ దేవతలు తమ్మును పుట్టించిన తండ్రియగు విరాట్పురుషుని ధ్యానించలేదు అంతకన్నను మొదటిది యగు సత్యమును ధ్యానించిరి. ఈ విషయమును వేద మిట్టులు చెప్పుచున్నది "ఆప ఏవేద మిద మగ్ర ఆసుః. తా ఆపః సత్య మసృజన్త ః సత్యం బ్రహ్మ బ్రహ్మ ప్రజాపతిం ప్రజాపతి ర్దేవాగ్ం తేదేవా స్సత్యమే వోపాసతే"

ఇప్పుడు ఈ సత్యము మూడు అక్షరములు కలది ఆ అక్షరములు ఏమి?' 'స' ఇత్యేకమక్షరం 'స' ఒక అక్షరము 'తీ'త్యేకమక్షరం 'తీ' అనునది మరియొక్క అక్షరము యమిత్యేకమక్షరం యు అనునది ఇంకొక అక్షరము. ఈ మూడుఅక్షరములును కూడి సత్యమైనది. ఇప్పుడు ఈ మూడు అక్షరములలో ప్రథమోత్తమములయిన అక్షరములు మృత్యువు లేకపోవుటవలన సత్యములైనవి. ప్రథమోత్తములయిన అక్షరము లన నేమి? మొదటిదియు, కడపటిదియును అనగా 'స' యునదియు, 'య' అనునదియును ఇవి నశించనివి గనుక సత్యములయినవి వేదము వీనిని గూర్చి ఇట్లు చెప్పినది "ప్రథమోత్తమే అక్షరే సత్యం"

మరి ప్రథమోత్తమాక్షరములకు మధ్యమున నున్న అక్షరము సంగతి యేమి ? వేదము దానిని అనృత మన్నది మధ్యతోఽనృతం అనగా ప్రథమోత్తమాక్షరముల మధ్యముననున్న తకారము అనృతమైనది అనృతమైన దనగా నేమి? అది మృత్యురూపమైనదని అర్థము మరి ఈ అనృతము, ఈ మృత్యుస్వరూపము, సకారయకారములే లక్షణముగా గల సత్యస్వరూపముచేత పరిగ్రహింపబడినదై, సత్యాధిక్యముగలదిగానే యగుచున్నది. అనగా మృత్యువు స్వల్పమైన దగుచున్నది ఈ విషయమును వేద మిట్టులు చెప్పుచున్నది. ఏత దనృతం ఉభయత స్సత్యేన పరిగృహీతగ్ం సత్యభూయ మేవ భవతి దీనిని ఇట్టులుగా తెలిసికొనిన వానిని మృత్యువు హింసించుటలేదు న ఏనం విద్వాంసం అనృతం హినస్తి

ఇచ్చట్ చెప్పబడిన ఏ సత్యము ఉన్నదో, ఆ సత్యము ఏది ? ఆ సత్యము ఎవరు ? అవ్యక్తమగు పృథివ్యాది పంచభూతములయొక్క సారాంశము గదా ఈ సత్యము. మరి ఈ సత్యమును ఏమినిగా వేదము చెప్పుచున్నది ! తద్యస్సత్య మసౌ స ఆదిత్యో యః ఆ సత్య స్వరూపము ప్రసిద్ధుడగు ఆదిత్యుడు. ఆదిత్య మండలమునందలి పురుషుడు ఆదిత్యమండలమునందలి పురుషుడును, ఈ దేహమునందలి కుడినేత్రమునందలి పురుషుడును ఒకరియందు ఒకరు ఉంచబడియున్నారు ఏష ఏతస్మిన్ మండలే పురుషో యశ్చాయం దక్షిణేక్ష న్పురుష స్తౌ వేతా వన్యోన్యస్మి న్ప్రతిష్ఠితౌ ఇది యెట్లు? రశ్మిభిరేషోస్మి న్ప్రతిష్ఠితః. కిరణములచేత సూర్యుడు అధ్యాత్మస్వరూపమగు నేత్రమునందు ఉంచబడియున్నాడు ప్రాణై రయమముష్మిన్ ప్రతిష్ఠితః ప్రాణములచేత చాక్షుషపురుషుడు అధిదైవస్వరూపమగు సూర్యునియందు ఉంచబడియున్నాడు అందువలన ఋషులు ఆదిత్య అక్షిపురుషులను ఒక్కరుగా నెరిగి, అట్టిరుగా నుపాసించినారు

ఇప్పుడు ఈ చెప్పబడిన ఆదిత్యమండలాందర్గతి పురుషుని యొక్క రూపమెట్టిది? లక్షణమెట్టిది? ఆ పురుషునిగురించివేదములేమనిచెప్పినవి? య ఏష ఏతస్మిన్మండలే పురుషస్తస్య భూరితి శిరః ఏకగ్ం శిరః ఏకమే త దక్షరం ఆదిత్య మండలాంతర్గత పురుషుడెవ్వరో, అతనికి 'భూః' అనునది శిరస్సు ఒక్కటియగు ఆ శిరస్సు 'భూః' అను అక్షరము. భువ ఇతి బాహూ ద్వౌబాహూద్వేఏతే అక్షరే భువఃఅను అక్షరములు ఆ పురుషుని బాహువులు రెండు బాహువులను భువఃఅను అక్షరములు సువరితి ప్రతిష్ఠా ద్వే ఏతే అక్షరే తస్యోపనిష దహరితి సువః అను అక్షరములు ఆ పురుషుని పాదములు. రెండైన ఈ అక్షరములు భూరాది అక్షరములు అవయవములుగా గల పురుషునకు, సూర్యమండలాంతర్గత పురుషునకు, సత్యస్వరూపమైనవానికి 'అహః' అనునది రహస్యమైన నామము సర్వ పాపములను హనము చేయుటయందు శక్తిగలవాడు గనుక, ఆ పురుషునకు ఆ పేరు కల్గెను. ఈ ప్రకారము దీనిని తెలిసినవాడు పాపములను నాశనము చేయుచున్నాడు పాపములను విడిచిపెట్టుచున్నాడు. అందువలననే ఆ పురుషునకు అహః అనుపేరు వచ్చినది.

ఇప్పుడు ఇచ్చట 'భూః' భువః' 'సువః' అనునవి వున్నవి. వీనిని ఋషులు వ్యాహృతు లనినారు. ఈ వ్యాహృతులను ఆదిలో దర్శించినవాడు విశ్వామిత్రుడు అందువలననే గాయత్రికి ఆయన ఋషి అయినాడు ఈ మూడు వ్యాహృతులు అధిదైవపురుషునకు ఎట్లు వరుసగా శిరస్సు, బాహువులు, పాదములు అయినవో, అట్టులే దక్షిణ నేత్రమునందువున్న సత్యాత్మక పురుషునకును వరుసగా శిరస్సు, బాహువులు, పాదములు అయినవి సూర్య మండలాంతర్గత పురుషుడు ఎట్టులు భూరాదివ్యాహృతులే అవయవములుగాగల వాడగుచున్నాడో, అట్టులే దక్షిణ నేత్రస్థ పురుషుడు గూడ భూరాది వ్యాహృతులే అవయవములుగాగలవాడగుచున్నాడు ఆదిత్య మండలాంతర్గత పురుషుడు ఎట్లు సమస్త పాపములను హననము చెందించుచున్నాడో,ఎట్టులు వదిలిపెట్టగల్గుచున్నాడో,అట్టులే దక్షిణ నేత్రస్థ పురుషుడు గూడ సమస్త పాపములను హననము చెందించుచున్నాడు త్యాగము చేయుచున్నాడు అందువలననే సూర్యమండలాంతర్గత పురుషునకు 'అహః' అను రహస్యనామము కల్గినట్లే, దక్షిణ నేత్రాంతర పురుషునకు గూడ అహమను నామము రహస్యమైనది ఏర్పడినది

మరియు నీ వ్యాహృతులలో భూః అను దానిని ఋషులు భూలోక మనిరి భువః అను వ్యాహృతిని భువర్లోక మనిరి సువః అను వ్యాహృతిని సువర్లోక మనిరి వారు చూచిన దానిని, విన్నదానిని, చెప్పిన దానిని వేద మిట్టులు చెప్పుచున్నది 'భూరితి వా అయం లోకః భువ ఇత్యంతరిక్షం సువ రిత్య సౌలోకః భూమియే భూః అను వ్యాహృతి ఆకాశమే భువర్లోకము స్వర్గలోకమే సువర్లోకము మరి ఈ భూరాదివ్యాహృతులు అవయవములుగా గల ఆదిత్యమండలాంతర్గ పురుషుడు ఎవ్వరు? ఈ విషయమును మాహాచమసుడను ఋషి చూచెను ఆయన మహాచమసుని పుత్రుడు విశ్వామిత్రుని యంతటివాడు ఆయన సూర్యమండలాంతర్గ పురుషుని పూర్ణముగా చెప్పు వ్యాహృతిని చూచెను వినెను ఆ వ్యాహృతిని ఆయన 'మహః' అనెను అది బ్రహ్మశబ్ద వాచ్యము అనెను అదియే ఆత్మయని గూడ ఆయన చెప్పెను సర్వదేవతలును 'మహః' శబ్దవాచ్యుడగు పరమాత్మకు అంగభూతములనియు ఆయన ప్రవచించెను 'భూర్భువస్సు వరితి వా ఏతాస్తిస్రోవ్యాహృతయః.తాసా ముహాస్మై తాం చతుర్థీం. మాహాచ మస్యః ప్రవేదయతే మహ ఇతి తద్బ్రహ్మ సఆత్మా అంగాన్యన్యాఃదేవతా మరియు ఆ మహము ఆదిత్యుడనిగదా చెప్పబడినది మహ ఇత్యాదిత్యః ఎందుచేత చెప్పబడినది? ఆదిత్యేనవావ

( 49-వ పేజీ చూడండి )





నేను కాలేజీలో చేరినప్పటి ... ఎ స్టె
లులో ఉన్న ఆడపిల్లల్ని చూసినప్పుడల్లా నా హృదయం బాధతో మూలిగేది ఇంట్లో నన్ను ఎంత గారం చేసినా నాకు పొద్దు పోవడం కష్టంగా ఉండేది హాస్టలులో ఉండే ఆడపిల్లలు ఎంత ఆనందంగా ఉంటారు వాళ్ళకి రోజుకి 48 గంటలు ఉన్నా చాలవనిపించేది మా నిర్మల, నళిని నన్ను ఎప్పుడూ బలవంతం చేసేవారు వాళ్ళకి అతిథిగా ఉండమని. అమ్మ మాత్రం ఒప్పుకో లేదు నా చిరకాల వాంఛ తీరుతుందని అనుకో లేదు నేను. ఆఖరికి ఒకరోజున అమ్మ బలవంతాన నాన్న అమ్మని ఏదో ఊరు తీసుకెళ్ళడానికి ఒప్పుకున్నారు ఆఫీసుకి మూడు రోజులు సెలవు పెట్టారు నన్ను రమ్మంటే నాకు అప్పుడు క్లాసులో ముఖ్యమైన ప్రాక్టికల్సు ఉండబట్టి రానేరానన్నాను అమ్మకి నన్ను అంత బ్రహ్మాండమైన ఇంట్లో ఒంటరిగా వదలి వెళ్ళడం ఇష్టం లేదు. నాన్నగారు ప్రిన్సిపాలుగారి అనుమతి తీసుకుని మూడు రోజులు నన్ను నళినికి అతిథిగా ఉంచుకోవాల్సిసదని అడిగారు. ఆవిడ ఒప్పుకుంది నా ఆనందం ఏమని చెప్పను ?

ఆరోజు ఆదివారం నాన్న అమ్మ బయల్దేరుతూ నన్ను హాస్టల్లో దిగబెట్టి వెళ్ళిపోయారు నళిని నన్ను తన గదికి తీసుకువెళ్ళింది ఆ గదిలో నళిని, నిర్మల ఇద్దరే ఉంటున్నారు గదిని వాళ్ళిద్దరు కూడా చాలా శుభ్రంగా ఉంచుకున్నారు ఒక చెస్ట్ ఆఫ్ డ్రాయర్స్ ఉంది అందులోనే వాళ్ళ బట్టలు, పుస్తకాలు పెట్టుకున్నారు ఒక రాసుకునే బల్ల, రెండు కుర్చీలు, కిటికీ తెరలు అతి శుభ్రంగా ఉన్నాయి బయట వరండాలో మంచాలు. వార్డను నాకోసమని ప్రత్యేకంగా ఒక మంచం అమర్చింది నేను హాస్టలుకు వచ్చిన హడావుడిలో ఆరోజు రాత్రి చాలాసేపు తెలివిగా ఉన్నాను నాతో చాలాసేపు కబుర్లు చెప్పి నళిని నిర్మల కూడా తెలివిగా ఉన్నారు

ప్రొద్దున్న చాలాసేపటివరకూ నాకు తెలివి రాలేదు నిర్మల అప్పటికే లేచి స్నానంచేసి పుస్తకాలు ముందర వేసుకుని రాసుకుంటోంది నేనూ లేచి పళ్ళు శుభ్రం చేసుకుని వచ్చేసరికి నిర్మల నన్నుచూసి "కాఫీ తాగి వద్దామా" అంది

"ఇంతకీ నళిని లేవందే" అన్నాను

"నళిని లేచేసరికి ఏడు కొట్టుతుంది నువ్వు అంతవరకూ కాఫీ త్రాగకుండా ఉండగలవా" అంది నిర్మల.

"అబ్బే మనం వెళ్ళి తాగి వద్దాం" అన్నాను

మెట్లన్నీ దిగివెళ్ళి మెస్సు చేరుకునేసరికి నాకు కాఫీ త్రాగాలన్న ఉత్సాహం ఎక్కడికో వెళ్ళిపోయింది ఇంట్లో అయితే అమ్మ అయిదున్నరకల్లా లేపేస్తుంది వంటవాడు కాఫీ తీసుకొచ్చి మేడమీదే యిస్తాడు ఇక్కడ అది ఎల్లా కుదురుతుంది ? మేం మెస్సులోకెళ్ళి కాఫీ త్రాగుతున్నాం అక్కడ ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క విధంగా ఉన్నారు మా నిర్మల లాగా కొందరు, నాలాగా కొందరు కొంచెంమందికి బెడ్‌కాఫీ అలవాటులాగా వుంది నిర్మల నడిగితే అవునంది

మేం కాఫీ త్రాగి మేడమీదికి వెళ్ళాక నేను స్నానాల గదికి వెళ్ళాను అప్పటికే యిద్దరు కాచుకు మన్నారు ఇంట్లో నా గదికే ప్రత్యేకంగా స్నానాలగది ఉంది భుజాలమీద తువ్వాళ్ళు, చేతులో సోపు పెట్టెలు సరేసరి చీర, రవికె తెచ్చుకొన్నారు నాలాగే అందులో ఒకమ్మాయి మా సీనియరు ఆ అమ్మాయి చేతిలో హౌవున్ కోటు తెచ్చుకుంది స్నానాలగది ముందర నిల్చొని కబుర్లు వేస్తున్నారు నేను వెళ్ళి నిల్చున్నాను లోపల అమ్మాయి ఎంతకీ రాదు మా క్లాసులోనే హిందీ తీసుకున్న శశిరేఖ స్నానాలగది బయట నుంచుని ఉన్నవాళ్లలో ఒకర్తె. శశిరేఖ గట్టిగా "అమ్మాయ్. పద్మా, త్వరగా తెమిలి రావమ్మా ! అవతల మీవారు కాచుక్కూచున్నారు" అని తొందర చేస్తోంది. పద్మకి క్రొత్తగా పెళ్ళయింది. వాళ్ల ఆయన అమెరికాకి వెళ్తూ బియేస్సీ అన్నా పూర్తి చెయ్యమన్నారట అది ఆయనగార్ని తల్చుకుంటూ నామమాత్రంగా చదువుతోంది.

"పద్మ స్నానాల గదిలో కూర్చుని మీవార్ని గూర్చి తల్చుకోక మళ్ళీ క్లాసులన్నీ అయ్యాక గాని రావు బయటికి" అని మళ్ళీ అంది శశిరేఖ.

మా పద్మ యివన్నీ లక్ష్యపెట్టినట్లు లేదు. ఇంతమందినీ కాచుకోమని, సావకాశంగా ముగించుకుని బయటికి ఎలా అయితేనే వచ్చింది మా నిర్మలతో స్నానానంతరం దీన్ని గూర్చిఅడగుతే అందికదా, "మరి ఇంతమంది ఆడపిల్లలికి మరీ అన్ని తక్కువ స్నానాలగదులుంటే ఎలా ? అందుకు నేను అయిదున్నరకే లేచి స్నానం ముగిస్తాను" అంది నేను బట్టలు కట్టుకుని రికార్డు పూర్తి చేసుకుంటుంటే నళిని లేచి ఆదరా బాదరా పళ్ళు తోముకుని మెస్సుకెళ్ళి కాఫీ ముగించి వచ్చింది. వస్తూనే సొరుగు తెరిచి బట్టలు వెతక నారంభించింది

"అబ్బబ్బ ఈ మోవురంగు చీర మ్యాచింగు రవిక ఇస్త్రీ చేసుకోడం మర్చిపోయాను దీనితో వేరే ఏ బ్లౌజు వెళ్ళదు" అని ప్రారంభించింది

నిర్మల నవ్వుతూ "అలవాటేగా పరిగెట్టు ఇస్త్రీపెట్టె దగ్గరికి" అంది. నళిని నన్నూ రమ్మంది నేను రికార్డు మూసిపెట్టి వెళ్ళాను. అక్కడ ఇస్త్రీపెట్టెని ఎవరో అమ్మాయి వాడుకుంటోంది ఇంకో అమ్మాయి చేతిలో నలిగిన చీర పట్టుకూర్చుంది నళిని విసుక్కుందిట. ఆ అమ్మాయిని ప్రాధేయపడి రవికని ఇస్త్రీ చేయించుకుని వచ్చింది స్నానాలగది ముందర చాలామంది ఉన్నారని వచ్చి గబగబా పౌడరు ముఖానికి అద్దుకుని బట్టలు మార్చేసుకుంది

సరి అనుకుని బ్రేక్‌ఫాస్టుకి మెస్సుకి ముగ్గురం బయల్దేరాం ఉప్మా పెట్టాడు అయ్యరు. అది తిని బయటికి వచ్చి నళిని "మిత్రో నాకు కడుపులో ఎలుకలు గంతులేస్తున్నాయి నాకు అయ్యరు పెట్టిన ఉప్మా చాలలేదు" అంది సరి అని ముగ్గురం కాంటీనువేపు నడిచాం వేడివేడిగా బరాణీబాత్ తిన్నది నళిని. ముగ్గురం బయటికి వస్తుంటే మా కాలేజీ ప్రెసిడెంటు ఎదురయి "హల్లో నళినీ నీ బాత్ (స్నానం) అయిందా"

అంది. మా నళిని నవ్వుతూ "ఓ ఇప్పుడే అయింది" అంది నే నాశ్చర్యపోయి చూశాను "ఇప్పుడేగా బఠాణీబాత్ తింట" అంది నేను నవ్వు ఆపుకోలేకపోయాను.

క్లాసులన్నీ అయ్యాక మధ్యాహ్నం మళ్ళా మెస్సులో భోజనం శాఖాహారులకి, మాంసాహారులకి ప్రత్యేకంగా ఉన్నాయి అన్నీ. మా నళిని భోజనం ముందర కూర్చుని "నిర్మలా ప్రొద్దున షేక్స్పియర్ క్లాసులో నుంచి చూచాను మన అయ్యరు, గూండారావు గరిటతోటే పులుసు కలియబెట్టాడు" అంది మా ప్రక్కనే కూర్చున్న పిల్ల వాంతి చేసుకున్నంత పని చేసుకుని చెయ్యి కడుక్కుని వెళ్లిపోయింది. నిర్మల కోపంగా 'నళినీ నీకు ఎన్నిమార్లు చెప్పాలి భోంచేస్తుంటే ఇలాంటివి చెప్పొద్దని' అంది. గూండారావు అని మాంసాహారాలు తయారుచేసే నాయరుకి ముద్దుపేరు చిన్న గున్న ఏనుగులా ఉంటాడు వా డెప్పుడు తోమిన గరిటలన్నీ తీసుకెళ్లిపోతే శాఖాహారాలు తయారుచేసే అయ్యరు వెతికి తన గరిటెలు తెచ్చుకుంటాడుట దీన్నే మా నళిని అలా చెప్పింది నాకు ఆ భోజనం వదిలిపెట్టిన అమ్మాయి మీదే దృష్టి ఉండింది "నిర్మలా ఆ అమ్మాయి ఏం చేస్తుందే భోజనానికి" అని అడిగాను నళిని నవ్వుతూ "మరేం ఫర్వాలేదులే. డబ్బున్నదే. ఇక్కడ నుంచి కాంటీనుకి వెళ్లి సుష్టుగా తింటుంది" అంది అయితే మెస్సు బిల్లుకి మెస్సు బిల్లూ, కాంటీను బిల్లుకి కాంటీను బిల్లు పెరుగుతున్నాయన్నమాట. నళిని ఇంకా చెప్పుకుపోతోంది "లేకపోతే ఈ భోజనంచేసే నే యింతలావు అయ్యా నను కుంటున్నావా దీని తర్వాత కాంటీనుని దర్శించి అందులో ఒక్క అయిసుక్రీమన్నా తినకపోతే నాకు తోచదు అంది బీన్సుకూరట. ఉడకలేదు. పులుసు సుమారుగా ఉంది అన్నం మేకులు నాకేం సహించలేదు ఇంతకీ అందరూ అనడం మా హాస్టలు భోజనంలాగా ఇంక ఏ హాస్టలులోనూ ఉండదని ఇదే యిలా ఉంటే మిగతా కాలేజీల్లో భోజనం ఎలా ఉంటుందా అని అనుకుంటూ భోజనం ముగించి గ్లాసు, ప్లేటు కడుక్కుని అలమారులో పెట్టి మేడపైకి వెళ్లాం రూములో ప్రొద్దున పుస్తకాలు పడేసి మంచాలమీద కూర్చుని కబుర్లు చెప్పుకున్నాం ఆ రోజు షేక్స్పియర్ మిస్ ఎలా పేర్లు పిలిచింది అవన్నీ చెప్పుకుంటూ పగలబడి నవ్వుకున్నాం గదికి తాళంపెట్టి తాళం చెవుల్ని రింగులో పెట్టేసి ఆ గొలుసుని వేళ్లకి తిప్పుకుంటూ విసురుగా నడుస్తోంది నళిని ఎదురుగా వస్తున్న మనిషిని చూసి చప్పబడి వెనక్కి వచ్చి "వామనమూర్తి ఎందుకో మధ్యాహ్నం మేడల్ని పావనం చేస్తోంది" అని మెల్లగా అంది అసిస్టెంటు వార్డన్ సరోజిని మెట్లెక్కుతూ కనపడింది ఆవిడ పొట్టిగా, సన్నగా ఉంటుంది నేను నవ్వుకుంటూ మెట్లు దిగుతూ విష్ చేశాను మా నళినికీ తప్పలేదు ఆవిడ వెళ్లగానే నన్ను చూసి "నీ మూలంగా ఆవిడకి నేను ఒక నమస్కారం వేస్కు చేశా" నంది నేనేం మాట్లాడలేదు

క్రొత్త రూల్సు ప్రకారంగా మా కాలేజీ ఉదయం 9 నుంచి సాయంత్రం మూడు దాకానే ఉంటుంది మూడింటికి క్లాసులనుంచి నేరుగా మెస్సు మీదికి దాడిచేశాం మైసూరుపాకు, ఒక అరటిపండు, టీ యిచ్చారు మా మెస్సు మైసూరుపాకు తింటానికి కూడా సుత్తి పట్టుకెళ్లాలేమో అని అనుమాన మేసింది అరటిపండు తిని టీ త్రాగాం గది చేరుకోగానే అలసట ఆవరించింది కాస్సేపు కూర్చున్నాం నళిని ప్రొద్దున్న చెయ్యాలి స్నానం ముగించడానికి వెళ్ళింది బయట వరాండా లోంచి చూస్తున్నాను విజిటర్సు వస్తున్నారు. మా నిర్మల చెప్పింది మొదటనే ఈ పూర్లో ఫలానా వాళ్లున్నారూ అని వాళ్లు చూడ్డానికి వస్తారని వార్డనుకి చెప్పాలిట ఆవిడ అనుమతి తీసుకోవాలి వీళ్లనే ఆథరైజుడు విజిటర్సు అంటారు. వాళ్లేగాని వేరెవ్వరూ రాకూడదట. అదైనా విజిటర్సు హాలులోనే కూర్చోవాలి హాస్టలు ఆడపిల్లలు అక్కడకే వెళ్లి వాళ్లతో మాట్లాడి పంపెయ్యాలి ఆరు కొట్టాక అతిథులు ఉండకూడదట సాయంత్రం హాస్టలు పిల్లలు తప్పకుండా బాట్మింటన్, టెన్నికాయిటో, నెట్బాలో ఏదో ఒకటి ఒకగంటసేపు ఆడాలి

ఆటలయ్యాక నాకు విసుగుగా ఉండింది మా నిర్మలతో "అలా షికారుగా నడచి వెళ్ళదామా" అన్నాను నళిని అప్పుడే స్నానం ముగించుకు వచ్చింది నామాట విందిలా వుంది, "వెళ్లేమాటయితే కూడా ఆ పెద్దదిక్కుని వెంటేసుకుని నే రాను బాబూ" అంది నేను ఆశ్చర్యపోయి 'పెద్ద దిక్కేవిటి నిర్మలా !" అన్నాను "మరేం లేదు. మనం సాయంత్రంపూట షికారుకెళ్తే కూడా షెపరాన్ (తోడుగా పెద్దవారు ఉంటే వార్ని షెపరాన్ అంటారు) లేందే వెళ్లకూడదు మనం ఒంటరిగా వెళ్లగానే లేడీస్ కాలేజీ హాస్టలువాళ్లం అని తెలియగానే రోడ్లో వెళ్లే ముసలితొక్కు కూడా ఎంత స్వీటుగా ఉన్నావు అనో, ఎంత అందంగా ఉన్నావు అనో అంటాడు అలాంటివాటినుంచి తప్పించుకోడానికి ఈ షెపరానులు" అని అంది

( 47–వ పేజీ చూడండి )








# వనితావాణి

## నాగరకులు

కొంతమందికి కొన్ని చెడు అలవాట్లు ఉంటవి. వారికి కూడా తెలియకుండా అలవాటు ప్రకారం ఆ అవయవాలు వాటిపనిని అవే చేస్తుంటవి వారు దానివలన అవతలివారికి కలిగే అసహ్యతను, బాధను గమనించలేరు. వారు వ్రాసినట్టుగా చదువుకొన్న వారందరిని నాగరికులు అనలేము. అనగూడదు.

లక్ష్మీ మల్లికార్జున్ (విజయవాడ)

* * *

చాలామంది నాగరకతగల స్త్రీలు అలా అసభ్యంగా చేయడం నే చూచాను ఈవ్యాసం అటువంటి వారికి గుణపాఠంలాగా వుందంటాను.

శ్రీమతి విజయలక్ష్మి సత్యమూర్తి (గుళ్లదుర్తి)

* * *

నేటి నవీనయుగంలో నాగరికులమని అనుకుంటున్నవారి గురించి చాల బాగా వ్రాశారు. చదువు ధనం ఉన్నంతమాత్రమున నాగరికత, సంస్కారము అలవడవు. చదువుకున్నవారికి చదువుకున్నామన్న అహంతప్ప మరొకటిలేదు. రాధారాఘవ్ గారు వ్రాసింది అందరికీ వర్తించకపోయినా, చాలామంది ఇటువంటివారు లేకపోలేదు.

కుమారి కన్య. డి (బరంపురం)

* * *

రచయిత్రి స్పష్టంగా కాకపోయినా సాధ్యమయినంతవరకూ తమకు వచ్చిన రీతిగా నేడు సంఘంలో నాగరికులమని ప్రగల్భాలుకొట్టే అనాగరికులను దుయ్యబట్టారనే చెప్పాల్సి వస్తుంది. నాగరికత మంచి మర్యాద, గౌరవం, సభ్యతా, అసభ్యతలమీద ఆధారపడివుంటుంది. ఒక్క చదువు సంస్కారం ఉన్నంత మాత్రాన నాగరికుల మనుకోవడం విచారకరమయిన విషయమే. హద్దులు మీరకుండా ఉన్నంతలో సభ్యతగా ప్రవర్తించడం నాగరికలక్షణమంటాను. ఈర్ష్య, అసూయ, హేళనలాటివాటికి నాగరికులమని పిలువబడేవారు ఈషణ్మాత్రమయినా స్థానం యివ్వకూడదని తలుస్తాను. అలాకానిపక్షంలో నాగరికతకున్న లక్ష్యంపోయిందన్నమాటే.

సుశీలాకృష్ణ, (విజయవాడ)

* * *

కొంతమంది వ్యక్తులు ఎదుటివారు వినిపించుకున్నా వినిపించుకోకపోయినా అదేపనిగా మాట్లాడేస్తుంటారు. మరికొందరు చాల గంభీరంగా వుంటారు. అది వారి స్వభావం వారి గంభీర్యాన్ని, అహంకారంగాగాని, మాట్లాడితే గౌరవభంగం కలుగుతుందనే ఊహతో మాట్లాడరనిగాని మనం ఊహించినట్లయితే పొరపడ్డట్టే! జీవితాంతం తన భాగస్వామిని అయిన భార్యతో మాట్లాడటానికి గౌరవభంగం అని ఎవరూ తలచరు గాంభీర్యం వారి సహజ స్వభావం మాత్రమే! ఈ విషయంలో రచయిత్రి అభిప్రాయం సమంజసంగాలేదని తలుస్తాను

అడవి నాగమణి (ఏలూరు)

* * *

మేము యు పి లో ఉన్నప్పుడు నాకూ అటువంటి అనుభవం చాలాసార్లు జరిగేది నిజానికి రొట్టెలూ అవీ తింటున్నప్పుడూ ఎంగిలి చేతికి అవకపోయినా, ఆ చేతితో వేసినవి తినాలీ అంటే మనకు అసహ్యంగానే వుంటుంది. ఆచార వ్యవహారాలలో పట్టుదలగల మనవాళ్ళకు ఇలా ఎంగిలిచేతితోవేయడం అతిశయోక్తిగా కనుపించినా, నా అనుభవంలో జరిగినది ఇప్పుడు కండ్లకు కట్టినట్లయింది.

సంధ్యారాణి (పాలకొండ)

* * *

నిజంగా చాలమందికి భోజనముకాగానే కాండ్రించి ఉమ్మివేయడము అలవాటు. అటువంటివారిని చూస్తే అసహ్యము వేస్తుంది ఇటువంటి వ్యాసాలు చదివిఅయిన మానివేస్తారేమో అనుకుంటాను.

మంజి. నందనా మనోహర్ (రాఘవాపురం)

* * *

శ్రీమతి రాధారాఘవ్ ప్రస్తావించిన అమెరికా వెళ్ళివచ్చిన వ్యక్తిలాంటివారు చాలామంది ఉంటారు అందం, చదువు ఎన్ని ఉన్నాగాని మా అక్కను ఏమీ చేతకాదని చిన్నబుచ్చుతూ కరినంగా చూస్తూ ఉంటారు, మా ఫారిన్ రిటర్న్డు బావగారు. విదేశాలు వెళ్ళి వాళ్ళు నేర్చుకొని వచ్చినది విజ్ఞానార్జనకాదు అజ్ఞానము, అహంకారము మాత్రమే అని రాధారాఘవ్‌గారు వ్రాసిన మాటలు ఎంతో బాగున్నాయి. 'సోదరి'

* * *



టేబుల్ క్లాత్ కు డిజైన్

డి. రామసూర్యభాస్కరం (ఇందుపల్లి)

## సెలవులిచ్చారు

ఈ వ్యాసంలో సరోజ అన్నట్టుగా మధ్యతరగతి కుటుంబాలలో ఆడపిల్లలకు వయస్సు మీరింది అనిపించకుండా వివాహమును జరిపించటమే ఉత్తమం. వాసంతిగారు వ్రాసినట్లు ఇటువంటి సంఘటనలు చూస్తూనే ఉన్నాము సామాన్య కుటుంబాలలో వివాహములు ఒక పెద్ద సమస్యలుగనే ఉంటున్నవి. అటువంటి సమస్యలు కొన్నయినా సులభంగా పరిష్కారమవాలంటే ఇటువంటి వ్యాసాలు కొంత వరకయినా ఉపయోగపడతాయని ఆశిస్తున్నాను.

కె సూర్యనారాయణమ్మ (మద్రాసు)

*   *   *

మధ్యతరగతిలోని యువతులకు మంచిపాఠం చెప్పినట్లు ఉన్నది. వాస్తవాన్ని అనుభవపూర్వకంగా వివరించినందుకు నా అభివందనములు.

వి. ఎస్. కాంతం (బైతూల్)

*   *   *

వాసంతిగారి సెలవులిచ్చారు వ్యాసం ఏ అభిప్రాయంతో రాశారో అర్థంకావడంలేదు. సెలవులిచ్చినందుకు, ఆ కాలాన్ని ఏలా సద్వినియోగపరచుకోవాలో అనేదన్నా వ్రాయలేదు. అమ్మాయిల పెళ్ళిళ్లమీద ప్రత్యేకంగా ఆవిడ పెళ్ళి విషయంలో ఆమె అభిప్రాయం రాసినట్టుగావుంది. ముందు చదువుల గురించి ఆలోచించడంలో, సెలవుల్లో ఆ విషయం గురించి చర్చించడంలో అర్థంవుందిగానీ, పెళ్ళిమీద ఈ వ్యాసం సెలవులిచ్చారు అనే పేరు కింద వ్రాయడం సరి అనిపించడంలేదు. చదువులు ముగించిన అందరూ సెలవుల్లో పెళ్ళి చేసుకోవడంలేదు. చూస్తే ఈవ్యాసం చదువుచాలించి పెళ్ళి చేసుకోపోయేవారికి సలహాలాగుంది. మాలాటి చదువుతై పై చదువులకిపోయేవారికి, చదువు చాలించి ఇంకా పెళ్ళి చేసుకోకుండా యింట్లో వుండేవారికి ఉపయోగపడేలాగులేదు. వాసంతి అనే పేరుతో వ్యాసంవ్రాసి, యీ వ్యాసంలో తమపేరు సావిత్రి ఎందుకు రాసుకున్నారో అర్థంకావడంలేదు. ఎం. ఎ. లాటి పెద్ద చదువులు అమ్మాయిలు చదివితే తగిన వరులు దొరకరు అందుకే పై చదువులు చదవకండి అని వార్నింగ్ యిచ్చినట్లుంది.

సుధ (బళ్లారి)

*   *   *

వాసంతిగారు వ్రాసిన "సెలవులిచ్చారు" అను వ్యాసము వాస్తవికతను రుజువు చేయుచున్నది.

శ్రీమతి కోరాడ సరస్వతీరావు (పార్వతీపురం)

*   *   *

వనితావాణిలో కేవలం పురుషులను విమర్శించుటతో సరిపోతుంది. స్త్రీలకు భుక్తి, రక్తి విషయములేగాక భక్తి కూడా ప్రధానమే. మంచి శక్తియేది అలవడినా భక్తి ద్వారానే అలవడుతుంది. భారతనారికి భక్తి శ్రీరామరక్ష. సోదరీమణులు భక్తిని గూర్చి కూడా వారి అమూల్య సందేశములు అందజేయుదురని ఆశిస్తున్నాను.

శ్రీమతి టి. జె. లక్ష్మీనారాయణ (సామర్లకోట)

★

## ఎప్పుడూ ఇంతే—103

శంకర్












# అగ్గిరాముడు బొమ్మల కథ సత్యమూర్తి 6




















# వేడుకలు? ఆంతర్యాలు

సింగరాజు లింగమూర్తి

## జరిగిన కథ

పోలయ్య అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం. కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు. నరసింహప్ప చలమయ్య ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు. ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది. రాజారావును మంచిచేసుకునేందుకు చలమయ్య అలివేణిని నియోగిస్తాడు. ఎన్నికలలో పోటీ చెయ్యమని పోలయ్యను రాజారావు ప్రోత్సహిస్తాడు. చలమయ్య ఏర్పాటు చేయించిన మిల్లు కార్మికుల సభ పోలయ్యా ప్రసంగంతో అభాసు అవుతుంది. అలివేణి రాజారావును ప్రేమిస్తుంది. మిల్లు కార్మికులలో రెండు వర్గాలు ఏర్పడుతాయి. ఇందిర, లలితలనుగూర్చి చలమయ్య చేస్తున్న ప్రచారాన్ని మునసబు నరసింహప్పకు తెల్పుతాడు. మెట్రిక్ పరీక్షకు హాజరయ్యేందుకు ఇందిర, పోలయ్య విజయవాడ వెడతారు. అక్కడ పోలయ్యకు శారదతో పరిచయం అవుతుంది. ఒకరినొకరు ప్రేమించుకుంటారు. విజయవాడనుంచి తిరిగివచ్చింతరువాత రాజారావు ప్రోద్బలంతో పోలయ్య ఎన్నికలకు అభ్యర్థిగా నిలుస్తాడు. చలమయ్య మిల్లు కార్మికులలో ఒకవర్గంచేత సమ్మెచేయిస్తాడు. పోలయ్య నిరశనవ్రతం చేసి సమ్మెచేసిన కార్మికులకు మళ్ళీపనులు ఇప్పిస్తాడు.

ఎన్నికల ప్రచారం ముమ్మరంగా ప్రారంభమైంది ఆ నియోజకవర్గానికి చుట్టుపట్లఉన్న గ్రామాల్లో కూడా ప్రచారకులు జట్లు జట్లుగా వెళ్ళి సభలు జరుపుతున్నారు ఆ నియోజకవర్గంలో ఒక అభ్యర్థిగా నరసింహప్ప, ప్రతిఅభ్యర్థిగా చలమయ్య, వెనుకబడిన జాతుల, తెగల రిజర్వు అభ్యర్థులుగా పోలయ్య, రాజయ్యలు పోటీ చేస్తున్నారు. తన ప్రచారానికి అవసరం కాబట్టి చలమయ్య ముందుగానే చంద్రిగాడిని, వాడితోపాటు హత్యా ప్రయత్నంమీద వెళ్ళిన మిగతా ఇద్దరినీ డబ్బు గుప్పి విడిపించాడు. సమ్మె విరమణతో రాజయ్య అంతకుముందే విడుదల అయ్యాడు.

నరసింహప్ప తరఫున మునసబు, చలమయ్య తరఫున కరణం తమ దొరలకు వత్తాసుగా ప్రచారం ప్రారంభించారు. పోలయ్యకు వీళ్ళకున్నన్ని హంగులూ, ప్రచార సాధనాలూ లేకపోయినా, నిరాడంబరంగానే ప్రచారం సాగుతున్నది. ఓటికి పేరుకు నిలబడినందుకు, రాజయ్య కనిపించిన వారందరికీ తనకు ఓటు వెయ్యమని చెబుతున్నాడు. పోలయ్య నిరశన వ్రతంవల్లని కార్మికులకు లాభం కలిగించడంవల్ల ఆ వూళ్ళోనేకాక, చుట్టుపట్ల గ్రామాల్లో కూడా మంచి పలుకుబడి ఏర్పడింది. పోలయ్య, రాజారావులకంటే కార్మికులే పోలయ్యకు ఉచితంగా ప్రచారం చేసిపెడుతున్నారు.

ప్రభుత్వపక్షం పార్టీ నాయకులు, ఒక రిద్దరు మంత్రులూవచ్చి బహిరంగ సమావేశాల్లో నరసింహప్పగారిని గెలిపించడం తమ పార్టీకి జయం చేకూర్చటమనీ, నరసింహప్పను గెలిపించడంవల్ల, ఈ నియోజకవర్గంలోని ప్రజలకు ఎన్నో ప్రయోజనాలు కలుగుతాయనీ చెబుతూ, ఆయన ఔదార్యాన్ని, వితరణ గుణాన్ని ఉపన్యాసాల్లో శ్లాఘించారు. నరసింహప్ప తన ప్రచారానికి హైదరాబాదునుంచి ఒక బుర్రకథ బృందాన్ని కూడా పిలిపించాడు

(45-వ పేజీ చూడండి)

**సుందరపు లలిత**

"చెల్లి పరీక్ష పాసయిందండీ"

"ఆఁ, ఆడపిల్ల పాసవ్వటానికేంవుందిలెద్దురూ మగపిల్లలు గట్టెక్కితే మాటగాని ఆడపిల్లల్ని ఇట్టే తోసిపారేస్తారు" అంటూ ప్రక్క వాటాలో ఆవిడ తను పాసయినందుకు అక్కకు 'అభినందనలు' అందిస్తుంటే చదువుకున్నమ్మాయి చిత్తం చివుక్కుమంది. రాత్రింబవళ్లు కష్టపడి సాధించుకున్న పట్టా—ఆడవాళ్ల పేపర్ల కట్ట ఒకవేపు—మొగవాళ్లది మరొకవేపు పెట్టుకుని ఆ దిద్దే ఆయన ఆడవాళ్ల నందరినీ ఉత్తపుణ్యానికి ఒక నెట్టు నెడతాడన్నట్టు మాట్లాడితే బాధగా వుండదూ ? ఏదో చదువుకోని మనిషి కదా ఆవిడతో మనకేమిటి అనుకుని సరిపెట్టుకుంది.

పోనీ చదువుకున్నవాళ్లు ఏమన్నా చక్కగా దీవించారా అంటే అదీ లేదు అవతల డాబా ఇంటి ప్లీడరుగారితో బాబాయి తను పరీక్ష గట్టెక్కిన సంగతి చెప్తే ఆయన సంతోషించలేదు సరికదా "పాసయ్యిందీ ? వెధవది ! ఈ రోజుల్లో ఆడపిల్లలే ఇట్టే బి. ఏ లు, ఎం. ఏ లు దాటేస్తున్నారు. ఎందుకూ, మావాడూ ఉన్నాడు. పరీక్ష పూర్తిగా తగలేశాడు" అని ఉసూరుమని వూరుకుంటే బాగానే ఉండును.

"ఆడపిల్ల పాసైతే ఎంత, ఫెయిలయితే ఎంత! మగపిల్లవాడంటే, చూశారు, వాడి పొట్ట వాడు పోషించుకోవటమే గాక మరికొంత పటాలాన్ని కూర్చోబెట్టి పోషించుకు రావాలయ్యె" అంటూ ఆడపిల్లలవి దండుగ చదువు లన్నట్టు ఓ దండకం చదివాడు. డబ్బెక్కువై తిన్నది దరక్క చదువుకోవటం తప్పించి, ఆడపిల్లలకు చదువేమిటి అని కాబోలు ఆయన ఉద్దేశ్యం.

ఊరంతా బలాదూరు తిరిగే మొనగాళ్ల పాసవుతారా మరి ? అలా చెప్పినా తప్పేకదా ?

"మీలా బట్టీపెట్టే వోపిక ఉంటే ఏగాని చేయని చెట్టయినా ఇట్టే గట్టెక్కుతుంది" అంటూ నిస్సారంగా తీసిపారేశాడు పరీక్ష చెట్టెక్కిన అబ్బాయి. చాతకానితనాన్ని కప్పెట్టుకోవటంలో మహా ఘటికులు ! ఆడవాళ్లని చులకన చేయాలంటే ఎక్కడలేని చురుకు బాగా మార్కులు వస్తే చాలు, ఆడపిల్లని 'జాలిదలిచి' మాస్టారు మార్కులు వేసాడని రిమార్కు ! వట్టి ఆకతాయి స్వభావం ! ఆడవాళ్ల తెలివిని మెచ్చుకునేంత ఉదారత వాళ్ల కెక్కడిది ?

*         *         *

"మీరు కూడా ఇంటర్వ్యూ కొచ్చారా ?"

ఎవరో అబ్బాయి వేసిన ప్రశ్నకు చదువుకున్నమ్మాయి తలాడించింది.

"చూడండీ, మరేం అనుకోకపోతే చిన్నమాట—మీకు ప్రత్యేకంగా స్కూళ్లు, కాలేజీలు, సంస్థలు ఉంటే మళ్లా మామీద దాడిచేస్తా రెందుకు ? మేము ఉద్యోగాలు దొరక్క చస్తుంటే మధ్యలో మీరొకరు పోటీగా !" అబ్బాయి చురచురా చూసిన చూపులకి అమ్మాయి ముఖం వెలవెలా బోయింది ఉద్యోగం దొరకటంమాట దేవు డెరుగు, చీవాట్లు ఘాటుగానే తగిలాయిరా బాబూ అనుకుని చిన్నబుచ్చుకుంది.

అబ్బాయిలకి ఏది వచ్చినా రాకపోయినా అధికారం చెలాయించటం మాత్రం బాగా వచ్చు. ఇంటర్వ్యూకు వాళ్లు రమ్మంటే తను వచ్చింది. మధ్యలో ఈ అబ్బాయి విరగబాటేమిటి ? వాళ్లకున్నన్ని కాలేజీలు ఆడవాళ్లకు ఉండేడిసినయ్యా? అన్ని రకాల ఉద్యోగాలకు ఆడవాళ్లని అప్లయ్ చేయనివ్వరుకదా ? ఏదో రమ్మన్నప్పుడైనా అదృష్టం పరీక్షించుకోవటానికి వీల్లేదా ? పోనీ, ఆడవాళ్ల సంస్థల్లో మగవాళ్లు దూరకుండా ఉన్నారు కను

(44-వ పేజీ చూడండి)



జమున బొమ్మల కొలువు

ఫోటో : (నిప్పాణి సారథి)


కామిడీ గుజ్జ మార్కు షోకులలో బషాజో
హావిపుడీ మార్కు బొంబాయి వాళ్ళ విలవిలో ఫ్లాజో
బొట్టూ కాటికా పెడితే చక్కటి ఆడపడుచు
ఋషీనారం వేసబూస తొడిగితే కోడెపడుచు
తెలుగుసినిమాలో గిరిజ మార్కు వేషాలు
ఉంటే హుషారుగ గడుచు
లేకపోతే ఇంకా జురుగ్గా నడుచు



## జరిగినకథ

పూర్వం ఒకానొక దేశంలో ఒక రైతు ఉండేవాడు. అతనికి వాకయ్యా, రామయ్యా, దేవయ్యా అనే ముగ్గురు కొడుకులు; మారమ్మ అనే కూతురు ఉండేవారు. దేవయ్యా తెలివి తక్కువవాడు; మారమ్మ మూగదీ, చెవిటిదీ వాకయ్య సైన్యంలో చేరి జాగీరు సంపాదించాడు రామయ్య వ్యాపారంలో ఆరితేరాడు. దేవయ్య వ్యవసాయం చేసుకుంటూ తండ్రిని చెల్లెలిని కనిపెట్టుకొని ఉన్నాడు. కొంత కాలం తరవాత వాకయ్యా, రామయ్యా వచ్చి తమ భాగాలు పంచుకుపోయారు. అన్నదమ్ములు తగవులాడుకోకుండా ఇలా కాలం గడపటం ఆ ఊరి పొలిమేరలో ఉన్న దెయ్యానికి నచ్చలేదు. వారిలో వారికి పడకుండా చెయ్యమని తన ముగ్గురు పిల్లల్ని ప్రోత్సహిస్తుంది. అవి మూడూ ఆ అన్నదమ్ముల పనులు పాడుచేయడానికి ప్రయత్నిస్తాయి, దేవయ్య మాత్రం లొంగిపోడు. వాకయ్యా, రామయ్యా ఆస్తులు పోగొట్టుకొని, తండ్రి పంచను చేరుతారు. దేవయ్యా సహాయంతో వాళ్ళిద్దరూ జాగీర్దారులు అవుతారు. రాజుగారు దేవయ్యకు తన కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేస్తాడు. ముగ్గురన్నదమ్ములూ హాయిగా ఉన్నారని తెలుసుకున్న పెద్ద దెయ్యం వాళ్లని భ్రష్టుల్ని చెయ్యడానికి తనే బయలుదేరుతుంది. వాకయ్యా, రామయ్యా దాని వలలో చిక్కుకుని, మళ్ళీ బికారులవుతారు. దేవయ్యా మాత్రం సుఖంగానే ఉంటాడు.

అందుకని దేవయ్యదగ్గరకి వెళ్లడానికి దయ్యం సిద్ధమయ్యింది. అక్కడకి కూడా ఒక యుద్ధవీరుని వేషంలో వెళ్ళింది. దేవయ్యా మహారాజుని సందర్శించి, నమస్కరించి, యిలా అంది. “మహాప్రభూ! తమవంటి మహారాజు సైన్యంలేకుండా ఉండడం సమంజసంగా లేదు. తమరు ఆజ్ఞయిప్పిస్తే యీక్షణంలో వేలకివేలు సైన్యం సిద్ధం చేయిస్తాను. మన యువకులు మంచి సేనగా తయారౌతారు.”

ఇది విన్నాడు దేవయ్యా “ఓ దానికేం మహాబాగు! అలానే సిద్ధంచేయించు కాని ఆ సైన్యం చక్కగా పాటలుపాడేటట్టు మాత్రం చూడాలి.” అన్నాడు.

పెద్ద దెయ్యం మహా సంతోషంతో ప్రజలుదగ్గరకి వెళ్లింది. యుద్ధసైనికులుగా చేరడంలో ఉండే లాభాలని కొండంతలుగా వర్ణించి చెప్పింది. చేరిన ప్రతివాడికి త్రాగడానికీ తినడానికీ లోటు ఉండదంది.

ఇదివిని వెఱ్ఱి వాళ్ళంతా నవ్వుకున్నారు.

“తినడానికీ త్రాగడానికీ మాకేం కొదవయ్యా? ఎక్కలు తక్కలుగా మాకేఉంది. ఇంక మిగిలిన లాభాల విషయం అంటావా అది మాకు అంత అవసరమూ లేవు ఆశా లేదు.”

అంచేత ఒక్కడూ సైన్యంలోకి చేరలేదు.

పెద్ద దెయ్యానికి మతిపోయి నట్టయింది. రాజుగారి దగ్గరకివెళ్ళి “మహాప్రభూ! మీ దేశంలో వెఱ్ఱి వెధవాయి లెవ్వరూ సైన్యంలో చేరమని అంటున్నారు. వారంతట వారు చేరకపోతే బలవంతంగానైనా చేర్పించ వలసిందే!”

“ఓ మహా బాగు అలానే చేర్పించు.”

పెద్ద దెయ్యంవెళ్ళి ఈ విషయం ప్రజలకుచెప్పి, సైన్యంలో చేరని యువకుల తల తీయిస్తారు మహారాజు అని బెదిరించింది

ఈసారి కొంచెం కంగారుపడ్డారు. వారంతా ఆ సైన్యాధిపతి దగ్గరకి వెళ్ళి "ఏమయ్యా! సైన్యంలో చేరక పోతే మహారాజు చంపుతా రంటున్నావు. సైన్యంలో చేరిన వాళ్లని యేంచేస్తారు చెప్పవేం. యుద్ధంలో వాళ్లనీ చంపేస్తారుటగా?" అని అడిగారు.

"అవును అప్పుడప్పుడు అదీ జరుగుతూ ఉంటుంది."

అని విన్నాక ఆ వెర్రి వెధవాయిలు మరింత మొండికేశారు.

"అయితే యింకెందుకు చేరడం సైన్యంలో? ఆ చచ్చేదేదో యింటిదగ్గరే చస్తాం. పరాయిచోట పరాయివాడి చేతిలో యెందుకులే."

"ఓరి చచ్చు దద్దమ్మల్లారా? సైన్యంలో చేరిన ప్రతివాడూ చస్తాడని ఎక్కడుందిరా? ఒకసారి వీడు చావవచ్చు. చాలాసార్లు ఎదటివారిని చంపవచ్చును కదా! ఇప్పుడు మీరు సైన్యంలో చేరకపోతే మాత్రం దేవయ్యరాజుగారు మీ తలలు తీయించడం తథ్యం నడవండి."

దాంతో ఆ తెలివి తక్కువ వాళ్ళంతా కంగారు పడిపోయారు. బిలబిలమంటూ మహారాజు దగ్గరికి పరుగెత్తారు.

"మహాప్రభో! యిదేం అన్యాయం. ఎవడో సైన్యాధిపతి వచ్చి మమ్మల్ని సైన్యంలో చేరమంటున్నాడు. మీరు సైన్యంలో చేరితే చస్తే చావవచ్చు లేకపోతే లేదు; కాని చేరకపోతే మాత్రం దేవయ్య మహారాజు తలలు తీయిస్తారు అంటున్నాడు. నిజమేనా ప్రభూ?"

మహారాజు పకపకా నవ్వాడు. "అదెలా సాధ్యం అవుతుందర్రా! నేనుఒక్కణ్ణే మీఅంతమందినీ చంపగలనా? ఎలా వీలవుతుంది. నేను తెలివితక్కువ వాణ్ణి కాకపోతే మీకువివరించి చెప్పేవాణ్ణి. కాని నేను తెలివితక్కువవాణ్ణే కదా మరి. నాకే అర్థంకాదు అదెల్లా వీలుపడుతుందో" ఇంక మీకేం చెప్పను?

"అయితే మేం సైన్యంలో చేరం ప్రభూ!"

"ఓ మహాబాగు మానేయండి."

ఆ మాటమీద ఆ వెర్రివాళ్ళంతా వెళ్లి సైన్యాధిపతితో చెప్పేశారు మేం చేరమూ అని. ఈ విధంగా తన పన్నాగం భగ్నమైందని తెలుసుకున్న పెద్ద దెయ్యం కోపంతో చిందులు త్రొక్కింది. ఆ రాజ్యానికి దగ్గరలోనే ఉన్న అసురద్వీపానికి వెళ్లింది. ఆ దేశపు మహారాజుకి బాగాబోధించి, ఈ రాజ్యంమీదికి దండెత్తేలా చేసింది. అసురద్వీప మహారాజు అఖండ సైన్యంతో, అశేష శతఘ్నిబల సమేతుడై దేవయ్య రాజ్యంమీదికి వచ్చేశాడు. దేవయ్య మాత్రం యేం పట్టనట్టే ఉన్నాడు. శత్రు సైన్యంవచ్చి రాజ్యపు ఎల్లల్లో విడిసి ఉంది. ఎన్నిరోజులు వేచిఉన్నా ఎటువంటి ఎదిరింపూ లేదు. వాళ్ళకి విసుగెత్తింది. అందుకని ఆ రాజు, తమ సైనికులకి, దేవయ్య రాజ్యంలోని గ్రామాలని దోచుకోమని ఆజ్ఞాపించాడు. సైనికులు అట్టహాసంతో గ్రామాలపై పడ్డారు. ధాన్యాలని తరలించేశారు; పశువుల్ని తోలుకుపోయారు. కాని ప్రజలుమాత్రం కిమ్మనలేదు. వద్దని అడ్డగించలేదు. పైగా వారి పట్ల యెంతో సానుభూతి చూపేవారు. "పాపం! మీ దేశంలో అన్నానికి కరువైతే మా దేశం రండయ్యా కావలసినంత ఉంది యిక్కడ" అనేవారు. దాంతో ఆ శత్రుసైనికులకి యేం చేయడానికి తోచలేదు. ఎక్కడా ప్రతిఘటనలేదు; ఎలాంటి సంఘర్షణాలేదు. ఎక్కడ చూసినా ఆదరణగాఉండే ప్రజలే! చూసి చూసి ఆ ప్రజలు విసుగెత్తిపోయారు. చకచకా తమ రాజుదగ్గరకి వెళ్ళి "మహాప్రభూ! ఈపరిస్థితి మహా ఘోరంగా ఉంది. ఎదటబడి యుద్ధం చేయడం ఎంతేనా సుఖంలా ఉంది. ఈసహాయ నిరాకరణ కన్నా! ఒక్కడూ కలియబడడే! ఒక్కడూ కత్తిదూయడే ఛ! ఛ! ఈ కార్యక్రమం యింక చేయలేం మన్నించండి ప్రభూ!" అని విన్నవించుకున్నారు.

అసురద్వీప మహారాజు మండిపడ్డాడు. ఆకోపంలో తన సైనికులకి ఆజ్ఞలు యిచ్చేశాడు. "ఇలా కాదు వీళ్ళరోగం కుదర్చడం. గ్రామాలకి గ్రామాలు తగలపెట్టేయండి. సర్వనాశనం చేసేయండి. అప్పుడైనా ఎదిరిస్తారోలేదో చూద్దాం ఎలాంటి కనికరమూ చూపించకండి."

శత్రు సైనికులు మారణహోమం ప్రారంభించారు. గ్రామాలకి గ్రామాలకి తగులబెట్టేశారు. ధాన్యపురాసులు బుగ్గిబుగ్గి అయిపోయాయి. పశువులన్నీ పనపన నరికివేయబడ్డాయి. ఎక్కడ చూసినా యేడుపులూ పెడబొబ్బలూను. ఇంత ఘోరాలు జరుగుతున్నా దేవయ్య ప్రజలు శత్రువులను పల్లెత్తుమాట అనలేదు; ఛట్టుమని ఎదరించి అడ్డుకోలేదు. శత్రువులు తమ సర్వస్వాన్ని నాశనం చేసేస్తోంటే గుండెలవిసేలా యేడ్చేవారు. ముసలివాళ్లు యేడ్చారు; ముగుదలు యేడ్చారు; ముక్కుపచ్చలారని ముద్దుపాపలూ యేడ్చారు. ఆయేడ్పుల్లోనే శత్రు

(43-వ పేజీ చూడండి)

మతుకుమల్లి సుశీల

# విదేశీ ఆహారాలు

మానవులకి స్వభావం మార్చుకోవడం ఎంత కష్టమో అలవాట్లు మార్చుకోవటం కూడా యించుమించు అంతే కష్టం. అవి ఆహారపు అలవాట్లయితే మరీని సరిగ్గా నిరుడు యీ రోజుల్లో నన్నీ సమస్యే బాధించింది మావారిని యిక్కడ మిస్సోరీ యూనివర్సిటీలో ప్రొఫెసరుగా రమ్మన్నారు. కుటుంబంతో తరలివెళ్ళి మరో ప్రపంచమన్నంత దూరంలో ఉన్న అమెరికాలో ఎలా బ్రతకగలమా అని భయపడ్డాను పరిసరాలకి అనుగుణంగా ఎన్ని మార్పుల నంగీకరించినా ఆహార పదార్థాలు ఏవి దొరుకుతాయో ఏవి దొరకవో నని పించింది. చాలామంది మనదేశంలో శాకాహారులుగా ఉండి నో ఏడాదిపాటు విదేశాలలో ఉండి మాంసాహారులై తిరిగి వచ్చినవారిని గురించీ విన్నాను అప్పట్లో యివన్నీ నన్ను వేధించిన సమస్యలు కాని యిప్పుడు అవన్నీ నిరాధారమైన అపోహలని తెలిసింది. ఆహారం దృష్ట్యా చూస్తే అసలు ఒక సంవత్సరంపరాయిదేశంలోఉన్నామాఅనిపిస్తున్నది.

అంటే మనకీ అమెరికన్లకీ ఆహారపదార్థాల గానీ, అలవాట్లలో గానీ కించిత్తు కూడా భేదం లేదని కాదు. కృష్ణా గోదావరి జిల్లాలకీ, గుంటూరు కృష్ణా జిల్లాలకీ కూడా యీ విషయాలలో తేడా లుంటాయి. ఇంతదూరంలో ఉన్న దేశంలో కొన్ని భేదంగా ఉన్నా ఆశ్చర్యంలేదు అయితే యీ మార్పులు ఎవరినీ బాధపెట్టవు

ఇక్కడ ఆహారపువేళలు యీ జీవన విధానానికి అనుకూలంగా ఉంటాయి సాధారణంగా ఉద్యోగస్థులంతా ఉదయం 8 నుంచి సాయంత్రం 5 గంటల వరకూ పనిచేయాలి. తదనుగుణంగానే ఆహారపు అలవాట్లూ ఏర్పడ్డాయి. వీరు ఉదయం 7—7—30 మధ్య బ్రెక్‌ఫాస్ట్ మధ్యాహ్నం 12 గంటలకి లంచ్, సాయంత్రం 6, 6—30 మధ్య డిన్నర్ తీసుకుంటారు. (కొందరు లంచ్‌ని సప్పర్ అనీ, కొందరు డిన్నర్‌ని సప్పర్ అనీ కూడా అంటారు (ఉదయం 10 గంటలకీ, మధ్యాహ్నం 3 గంటలకీ కాఫీ బ్రేక్స్ (Coffee breaks) ఉంటాయి. ఈ వేళలలో తినే ఆహారాలని స్నాక్స్ (Snacks) అంటారు.

బ్రెక్‌ఫాస్ట్ అన్నిటికన్నా తేలిక ఆహారము ముఖ్యమైనది సాయంత్రం తీసుకునే డిన్నర్. ఇది మిగిలిన వాటికన్న బరువైన ఆహారమే కాకుండా ఎక్కువ రకాలు కూడా ఉంటాయి. సాధారణంగా బ్రెక్‌ఫాస్టులో ఒక మీట్ డిష్, ఫల సంబంధమైనవి, బ్రెడ్‌కి సంబంధించినవీ తింటారు. లంచ్‌లో మెయిన్ డిష్ (Main dish) కాయలూ, పళ్ళూ, డెజర్ట్ (Dessert) తీసుకుంటారు డిన్నర్‌కి సుమారు 5 రకాల ఆహారపదార్థా లుంటాయి. (1) మాంసము, (2) బంగాళదుంపలు, (3) కాయలు, పళ్ళు, (4) సెలాడ్స్, (5) డెజర్ట్. బిస్కెట్లూ, కాఫీ, పండు రసం, వైన్స్, ఐస్‌క్రీమ్ వీటిలో ఏవైనా స్నాక్స్‌గా ఉపయోగపడతాయి బేకన్, టీస్, ఫ్రెంచ్ టోస్ట్, ఫ్రైడ్ ఎగ్స్, ఆమ్లెట్, చక్‌రోస్ట్, హాంబర్గర్స్, ఫోర్క్, స్పాగెట్టి, లివర్, హాట్‌డాగ్స్ మొదలైనవి అమెరికన్లకి ప్రీతిపాత్రమైన మాంసాహారాలలో కొన్ని. రకరకాల పళ్ళూ, కాయగూరలు పచ్చివీ, పండు రసాలూ, సెలాడ్స్ యివన్నీ వెజిటబుల్ అండ్ ఫ్రూట్ డిషెస్, యాపిల్ పై, జింజర్ బ్రెడ్, ఐస్‌క్రీం, చాక్‌లెట్‌పై వంటివి డెజర్ట్‌గా తింటారు.

ఈవిధంగా చూస్తే వీరి ఆహారపువేళలు యించుమించుగా మన వేళలతో సరిపోతాయి ఒక డిన్నర్ తప్ప వేళలు సరిపోయినా వీరికీ మనకీ ముఖ్యమైన భేదాలు కొన్ని ఉన్నాయి

అన్నింటిలోకి స్ఫుటంగా కనిపించే తేడా ఏమిటంటే వీరిలో నూటికి తొంభైతొమ్మిదిమంది బియ్యం అసలు వాడరు మనం బియ్యం వాడినంత విరివిగా వీళ్ళు బంగాళాదుంపలు వాడుతారు. వాటిని ఉడకపెట్టి (Mashed Patatoes), బ్రెడ్ కాల్చే అవెన్‌లో కాల్చి (Fried), ఫ్రెంచి ఫ్రైడ్ అనీ—యిలా రకరకాలుగా వండి వాడుతారు. ఒకవేళ ఎప్పుడైనా బియ్యం వండితే 5, 6 గురున్న యింట్లో అరకప్పుడు బియ్యం వండుతారు. అదికూడా ఏ కూరలతోనో, మాంసముతోనో కలిపి ! హాంబర్గర్స్, హాట్‌డాగ్స్, శాండ్ విచెస్ ఇక్కడ ప్రతివాళ్ళూ తినే ఆహారాలు హాంబర్గర్స్ అంటే గుండ్రముగా వుండే బన్ మధ్యకి కోసి, అందులో కాల్చిన మాంసము, రకరకాల మసాలా దినుసులూ పెట్టినది అన్నమాట హాట్‌డాగ్స్ అమెరికన్స్‌కి అభిమానమైనదే కాక ప్రపంచకములో మరెక్కడా తయారుచేయని ఆహార పదార్థం. ఇది ఒకరకమైన మాంసము ప్రత్యేకమైన రంగువేసి తయారు చేస్తారు చూడటానికి సరిగ్గా (రంగూ, ఆకారమూ కూడా) కారెట్ దుంపలా ఉంటుంది శాండ్ విచెస్ అందరికీ తెలిసినవే రెండు బ్రెడ్ ముక్కలకి మధ్య ఫ్రూట్‌జామ్స్, జెల్లీ, తగిన కూరలు, కాల్చిన మాంసము ఏదైనా పెడితే శాండ్‌విచ్ తయారవుతుంది స్కూళ్ళకీ, ఆఫీసులకీ లంచి తీసుకువెళ్ళేవారూ, హడావిడిగా ఇంటికివచ్చి లంచ్ తినే వాళ్ళూ సాధారణంగా శాండ్ విచెస్ తింటారు. త్వరగానూ, చౌకగానూ తయారయే పదార్థం. మన పిల్లలకి పెప్పర్‌మింట్స్ చేతిలో పెట్టినట్లు యిక్కడ పిల్లలకి హాట్‌డాగ్స్ చేతిలో పెట్టి ఆడుకునేందుకు పంపిస్తారు.

మరొక అతిముఖ్యమైన భేదం ఏమిటంటే ఇక్కడ చాలాభాగం ఆహార పదార్థాలు ఫ్రీజ్ చేస్తారు అన్ని మార్కెట్లూ ఎయిర్ కండిషన్డ్ కాబట్టి యిది శ్రమ కాదు ప్రతి కుటుంబానికీ తప్పకుండా ఒక రెఫ్రిజిరేటర్ ఉంటుంది. ఈ ఫ్రోజెన్ ఫుడ్స్ (Frozen Foods) లో రెండు రకాలు ఉంటాయి. ఒకటి వండినవి. వీటిని ప్రీ కుక్‌డ్ (Pre-cooked) అంటారు. రెండవది పచ్చివి శాకాహారాలూ, మాంసాహారాలూ కూడా. యీ రెండు రకాలలో దొరుకుతాయి. ఇందులో మొదటిరకం వండటానికి 5 నిమిషాలు చాలు. కొన్ని వెచ్చచేసీ, కొన్ని కళపెళా కాగే నీళ్లలో ½ నిముషం ఉడకనిచ్చి తీస్తే తినటానికి సిద్ధంగా ఉంటాయి. ఉదాహరణకి ప్రీకుక్‌డ్ బియ్యం ½ నిముషంలో అన్నం తయారవుతుంది.

(48



# వంటలు

[తొక్కుడు లడ్డూలు తెనుగు దేశంలోనూ "స్ట్యూ" కేరళ లోనూ, 'బిస్సిబేడ హుళియన్న' కన్నడదేశంలోనూ, ఇంటింటా చేసుకుంటారు.]

## తొక్కుడు లడ్డూలు

కావలసిన వస్తువులు :

శనగపిండి ½ వీశ
బెల్లం 15 పలాలు
ఏలకులు ½ తులం.

చేసేవిధానం :

శనగపిండి శుభ్రంగా జల్లించుకోవాలి. చిటికెడు ఉప్పు నీళ్ళలో వేసుకుని, ఆనీటితో శనగపిండిని జంతికలపిండివలె ముద్దగా కలుపుకోవాలి. బూరెల మూకుడులో డాల్డాగాని, నూనెగాని వేసి, కాగిన తరువాత జంతికలగొట్టంతో తడిపి ఉంచుకున్న పిండిముద్దను వత్తుకోవాలి. వండినతరువాత రోలు శుభ్రంగాతుడిచి, ఆ జంతికలను మెత్తగా దంచుకోవాలి. వెడల్పాటి గిన్నెలో బెల్లం లేత పాకం పట్టి, దంచి వుంచుకున్న జంతికలపొడి దానిలో వేసుకోవాలి. కొంచం చల్లారినతరువాత చేతికి నెయ్యి రాసుకుని మనకు కావలసిన సైజులో ఉండలు చేసుకోవాలి.

## 'బిస్సిబేడ హుళియన్న'

కావలసిన వస్తువులు

1. 1½ అళాకు బియ్యం.
2. 1½ అళాకు కందిపప్పు.
3 6 అళాకుల నీరు.
4 2½ పలాల చింతపండు.
5 1¼ పలాల పండు మిరపకాయలు.
6. 1¼ పలాలు ధనియాలు.
7. 2½ పలం ఎండుకొబ్బరి.
8. 2½ పలం మంచి నూనె.
9. ¼ అళాకు ఉప్పు.
10. ¼ నుంచి ½ తులం ఇంగువ.
11 1 చెంచా శనగలు.
12. 1 చెంచా మెంతులు.
13. 1 చెంచా ఆవాలు.
14. కరివేపాకు.

చేసేవిధం

I. ఒక ...లో మూడు చంచాల మంచినూనె ఉంచి దానిలో మెరపకాయలు, ధనియాలు, ఇంగువ, మెంతులు, శనగలు వేసి 'బంగారు' రంగు వచ్చేవరకు వేయించాలి. కొబ్బరి వేరేవేయించాలి. ఆతర్వాత ఈ రెండిటినీ కలిపి పొడికొట్టి ఉంచాలి.

II. చింతపండు సుమారు అర్థ అళాకు నీటిలో నానపెట్టాలి.

III. కందిపప్పు ఉడకబెట్టి ఇంకా పూర్తిగా ఉడకక ముందే బాగా కడిగి ఉంచిన బియ్యం ఇందులో కలపాలి. ఇవి రెండూ బాగా ఉడికిన తర్వాత చింతపండురసం వెయ్యాలి. ఉప్పు దీని తర్వాత వెయ్యవచ్చు. పదినిమిషాలు కాగినతర్వాత మొదట చేసినపొడి వేసి బాగా కలపడం అవసరం. అయిదు నిమిషాలవరకు నిప్పుమీదనే ఉంచాలి.

IV. మంచి నూనెలో ఆవాలు విరిగేవరకూ వేయించి కలపాలి. కర్వేపాకు చివర వేసినా పరవాలేదు.

బాగా కలిపి నెయ్యి వేసుకుని తింటే రుచిగా ఉంటుంది. కొందరు అప్పడాలు, వడియాలు నంచుకుంటారు.

## 'స్ట్యూ'

కావలసిన వస్తువులు

1. ½ వీసె బంగాళ దుంపలు.
2. 2 కొబ్బరి కాయలు
3. ½ పలం పచ్చి మెరపకాయలు.
4. ½ పలం అల్లం.
5. 2 చంచాలు ఉప్పు (రుచిని బట్టి)
6. 2 పలాల కొబ్బరి నూనె.

చేసేపద్ధతి

బంగాళాదుంపలు మొదట ఉడకబెట్టి కూరకు తరిగినట్లే తరగాలి. కొబ్బరిని కూడా 'కోరి' అందులోని 'పాల'ను తీయాలి. మిగిలిన కొబ్బరి 'పిప్పి'కి కావలసినన్ని నీళ్లుకలిపి, మరి కొంచెం కొబ్బరిపాలు తియ్యవచ్చు. దుంపలు ఈ పాలలో ఉడకబెట్టిన తర్వాత మొదట వేసిన కొబ్బరిపాలు, తరిగిన పచ్చిమెరపకాయ, అల్లం ముక్కలు చేర్చి బాగా కలపాలి. ఆ పైన కొబ్బరినూనె వేయాలి. ★




చూడు, చీరలబ్బి, ఇక్కడ కేకెయ్యకుండా వెళ్ళిపోయావంటే ఈ పావలా, ఇచ్చేస్తాను!

చిత్రకారుడు రమేశం.

పోతులూరి రాజ్యలక్ష్మి

# కోతలు

ఎవరన్నా కాస్త అతిశయోక్తులు మాట్లాడటం మొదలుపెట్టేసరికి వెంటనే ప్రక్కనున్నవాడు "కొయ్యరా నాన్నా! కోత!" అని అంటాడు ఈమధ్య ఎవరో అనగా విన్నాను ఆంధ్రులలో కోతలు కొయ్యనివాళ్ళు నూటికి ఏ పదిమందో ఉంటారుట! ఇందులో నిజమెంతో మనకు తెలియక పోయినా మన చుట్టూ ఉన్న వాతావరణాన్ని, అందులో మెసిలే వ్యక్తులనీ గనక పరిశీలించినట్లయితే, ఆ ప్రబుద్ధుడు చెప్పిన నిజానికి దగ్గరగా వస్తున్నామనిపిస్తుంది కోతలు కొయ్యడంగనక అలవాటైతే కొన్నాళ్ళయేసరికి మన ప్రమేయం లేకుండానే వాటంతటవే గంగాప్రవాహంలాగ సాగిపోతుంటాయి కాకపోతే, సంతోషించదగ్గ విషయం ఏమిటంటే ఈ కోతలవలన ఏ సమయంలోనూ, ఎవ్వరికీ ప్రమాదం వాటిల్లదు

నా చిన్నతనంలో ఒకాయన మూరెడు చుట్ట కాలుస్తూ, గజంన్నర పొడుగుగల తుపాకీని రీవిగా పట్టుకొని, పంచాయితీబోర్డు ఆఫీసు ముందర కూర్చుని, తను తన వయసులో పెద్దపులిని చంపిన వైనం గురించి దీర్ఘంగా—గర్వంగా ఆనందంగా అనర్గళంగా ఉపన్యాసం ఇస్తూఉంటే, మా ఊళ్ళో ఉన్న చిన్నలూ—పెద్దలూ భయసంభ్రమాలతో ఆనందాశ్చర్యాలతో ఆయన మాట్లాడే ప్రతి ముక్కా, ఆయనయొక్క ప్రతి కదలికా వింతగా పరికిస్తూ ఉండేవారు చిత్రమేమిటంటే, ఆయన పెద్దపులిని ఈ జన్మలోకాదుగదా! మరి ఏడు జన్మలెత్తినా చంపలేడని అందరికీ తెలుసు! కానీ, ఆయన ఆకథ చెపుతూ చేసే యాక్షన్‌కే—ఆ కోతలు కొయ్యడంలోగల నేర్పుకే అట్లా పొగవుతుండేవారు ఆయన గూడా, చక్కగా విపులంగా విప్పి చెప్పుతూ, ఆమందానందాన్ని అనుభవించేవాడు కొందరు—కొందరు కోస్తుంటే ఆ కోతలు వినే వాళ్ళని అయిస్కాంతంలాగ ఆకర్షిస్తుంటాయి

కానీ—చౌకబారు కోతలు ఉంటాయి చూశారూ అందులో ఏమాత్రం హాస్యం లేకుండా అంతా తమ గొప్పదనాన్నే చాటేవి అవి వింటూఉంటే శ్రోతలలో అసహనం—అసహ్యం ఎక్కువైపోయి, కోసేవాడి ముక్కుమీద బలంగా ఒక్క గుద్దుగుద్ది అక్కడనుంచి లేచిపోదామనిపిస్తుంది

ఒక ఉపాధ్యాయుడు బదిలీఅయిన సందర్భంలో మిగతా ఉపాధ్యాయులు సమర్పించిన పకోడీలూ—టీ ఆప్యాయంగా స్వీకరించి, ఘాటైన కారాకిళ్ళీ నములుతూ, తను ఏ ఏ వూళ్ళల్లో ఎన్నేళ్ళు పనిచేసిందీ వినయంగా మనవి చేస్తున్నాడుట! "తాడేపల్లిగూడెంలో ఆరేళ్ళు చేశాను. గుంటూరులో ఎనిమిదేళ్ళు పని చేశాను తెల్రపోలులో పన్నెండేళ్ళు చేశాను బెజవాడలో పదకొండు—ఆరుగొలనులో ఏడేళ్ళు, గన్నవరంలో రెండేళ్ళు . . ." ఆయన ఇంకా చెప్పేకముందే తడిక అవతలనుంచి ఈ తతంగం అంతా చూస్తున్న ఒక కుర్రాడు అసహనంతో "ఇంతకీ మీ వయస్సెంత?" అని అరిచాడుట

ఈ కోతలు కొయ్యడంలో అనేక రకాలు!

'ఫలానా సినిమా తీస్తున్న డైరెక్టరు లేడండీ! వాడూ—నేనూ ఒక కంచంలోతిని, ఒక మంచంలో పడుకున్నాం ఇప్పుడు వాడేమో మద్రాసులో స్థిరపడిపోయాడనుకోండి! అయినా నేను వెడితే ప్రాణం ఇస్తాడు!"

"ఆమధ్య ఏం జరిగిందో తెలుసా! నాగేశ్వరరావు—అంజలి, నేనూ కలసి కార్లో అట్లా బయలుదేరాం. ఇంతలో ఏం జరిగిందీ . . ."

"మొన్న ఢిల్లీ వెళ్ళినప్పుడు నేను నేరుగా 'నెహ్రూ భవన్'కు వెళ్ళానండీ! ఆయన నన్ను సాదరంగా ఆహ్వానించి 'ఫలానావారు మీరేనా?' అనీ ఎంత మర్యాద చేశాడనుకున్నారు! అది చూసి నాకు ఢిల్లీ వదిలిపెట్టి రా బుద్ధికాలేదంటే నమ్మండి!"

"మావారి హోదాచూసి ఈ బీరువా ఇంత చవకగా ఇచ్చారుగానీ, ఇంకొకళ్ళకయితే ఈ రేటుకు రాకపోను!"

"మా వారిని సినిమాలోకి రమ్మనమని చాణక్య ఎంత బతిమాలాడనుకున్నారు! అయినా ఆ గొడవలోపడితే మన ధోరణి ఉండదనుకోండి! అందుకని వద్దని నేనే పట్టుబట్టాను"

"మా అమ్మగారింట్లో నాలుగు గమిడిగేదెలూ ఆరు ఆవులూ ఉన్నాయి రోజూ నేను శేరుపాలు తాగుతాను"

"మా పుట్టింట్లో నెలకు ఆరు వీశల నెయ్యి అవుతుంది మేము వెధవ మిల్లిగరిటెతో వేసుకోము గిన్నెతో గిన్నెడు నెయ్యి వేసుకోందే అన్నం తిన్నట్టే ఉండదు"

వస్తువు కొన్నధరకు రెట్టింపుధర కల్పించిచెప్పే ఆడవాళ్ళను మనం తరచూ చూస్తుంటాం ధరనుబట్టే వస్తువుల విలువ నిర్ణయిస్తారని వాళ్ళ ఆలోచన వినేవాళ్ళు నమ్మటంలేదని తెలిసినా, వాళ్ళు కొయ్యడం మానరు అత్తారింట్లో పుట్టింటి గొప్పదనాన్ని గోరంతలు కొండంతలుగా చెప్పే లలనామణులు మనకు నిత్యం తటస్థపడుతుంటారు.

ఒకసారి ఏదోపనిమీద ఒకరింటికి వెళ్ళాల్సి వచ్చింది. ఆధునాతనంగా అలంకరించిన ఇల్లు అందంగా ఉంది ఆ ఇంటావిడ నన్ను వాకిట్లో చూసి గబ—గబా లోపలికివెళ్ళి—రేడియో పెద్దగా ట్యూన్‌చేసి, బయటకువచ్చి నన్ను ఆహ్వానించింది. "రేడియో పెట్టకపోతే నాకు ఒక్కక్షణం గూడా తోచదండీ!" అంది ఆవిడ సంభాషణ ప్రారంభిస్తూ. "అవును గాబోలు!" అనుకున్నా "కొన్ని కొన్ని అలవాట్లు అవుతాయీ! అవి చస్తే మానలేమనుకోండి! నాకు ఇంట్లో అస్తమానమూ రేడియో మోగాల్సిందే! బయటకు వెళ్ళాల్సివస్తే కారుమీద తప్ప రిక్షామీద ప్రాణంపోయినా వెళ్ళలేను అయినా నాకు తెలియక అడుగుతాను కారు చేతిలో ఉండగా మనకా ఖర్మేమిటి?" అందావిడ ఏవగింపుగా

"బహువచనం ఉపయోగించకండి! ఇప్పట్లో మేము కారుకొనే ప్రయత్నంలో లేము" అన్నాను నవ్వుతూ

"మీరు భలేవారేనండీ! ఆ—ఈ కారు కొనడానికి మేము ఎంత అవస్థపడ్డామనుకున్నారు! ఈయన మద్రాసు వెళ్ళారు ఎందుకనో నాగేశ్వరరావు స్టేషనుకు వచ్చాడట. మా వారిని చూసి కావలించుకుని, ఇంటికి తీసుకెళ్ళి నెలరోజులదాకా కదలనివ్వలేదు ఇద్దరూ చిన్నప్పుడు ఒక బళ్ళో చదువుకున్నారులే! ఏం? అప్పుడే అతను ఈ కారు కొని పంపించాడు. ఆ డబ్బు అతనే ఇచ్చాడు మావారు ఎంత చెప్పినా వినలేదు నాకు "కాడిలాక్" అంటే ఇష్టం అది కొని రెండేళ్ళు కావస్తుంది—ఇది అమ్మేసి త్వరలోనే కాడిలాక్ కొంటాము. ఇదిగో! ఈ నెక్లెస్ చూశారా! ఇది బొంబేలో . . ." ఈ విధంగా సాగింది ఆ ఇంతి ధోరణి ఒక అరగంట కూర్చునేసరికి చెవులు హోరెత్తిపోయాయి 'వెళ్ళొస్తా'నని ఆవిడ దగ్గర సెలవు తీసుకుని, ఇంటికివచ్చి హాయిగా వూపిరి పీల్చాను కారు—రేడియో, ఫ్యాను—ఫోను ఇవన్నీ నాగరికతా చిహ్నాలు అనుకుంటున్న ఈ రోజులలో ఆ మగువ ఉన్నవాటికి మరి కొన్ని తీయటి కోతలు మేళవించి—ఆ అమృతాన్ని నాకందిస్తే—అది నాకు కాలకూటవిషంలాగ అనిపిస్తే అది నా తప్పా? నేను సాక్షాత్ సాంబశివుడి అవతారం కాకపోగా, ఆయన అంశం చిన్నమెత్తు గూడా నా దగ్గరలేదాయె! ఈ ఆడంబరాలకు—కోతలకు ఎక్కువ ప్రాముఖ్యమిచ్చేది మన ఆడవాళ్ళే. పైకి అనకపోయినా ఇది నిజమని అందరూ మనసులోనయినా ఒప్పుకుంటారు. ఒప్పుకోడమే కాకుండా కొయ్యడం గూడా తగ్గిస్తే ఇంటికీ—వంటికీ మంచిది 





## ప్రశ్నోత్తరావళి

ఆమె ఎవరు?

—అతివ, మహిళ, వనిత, అబల, ముగువ లేక స్త్రీ.

కొందరున్నారు వారెవరు?

—పక్క ఇంటి పిన్నిగారు, వారి తాలూకువారు; బాబాయిగారు, వారి తాలూకువారు; దూరపు బంధువులు వారి బంధువులు మొదలైనవారు. అసలేమీ తెలియనివారు, అన్ని విధాలా బుద్ధి తక్కువవారు.

పాతకాలం వారెవరు?

—అమ్మ, బామ్మ వగైరా. ముక్కుమీద వేలువేసుకొనేవారు, నోరు నొక్కుకునేవారు, అసలు ఏవిధమైన విచక్షణ లేనివారు కూడా వీరే.

ఆధునిక యుగానికి చెందిన వారెవరు?

—ఈ ప్రశ్నకు వేరే సమాధానం అనవసరం. కాని, స్పుట్నిక్‌లు ఆకాశంలో ఎగిరాయని తెలిసినవారు. ఇది ఇరవయ్యవ శతాబ్దం అని గ్రహించినవారు. ఇంకా ఎన్నెన్నో విషయాలు తెలిసినవారు.

ఆనాడేమి జరిగెను?

—ఏమీ తోచక పక్క ఇంటికి వెళ్లటం, లేక బాబాయిగారి ఇంటికి వెళ్లటం, లేక బంధువుల / తెలిసినవారి ఇంటికి పెళ్ళికి వెళ్ళటం సంభవించింది.

అత్యావసరములైన ఆశయములు సంస్కరణలు, సత్యములు వివరించునది.



ఆఁ ఏమికుళిలమో, రోజురోజుకీ ఆయువు క్షీణించి పోతున్నది. ప్చ్!
చిత్రకారుడు: వి. వి. మహేశ్వరరావు, (గుంటూరు)

—...కావాలి, ...చెయ్యాలి, ...గ్రహించాలి, ...తెలుసుకోవాలి, ...కృషిచెయ్యాలి వగైరా, వగైరా.

అప్పుడేమగును?

—జీవితమే బాగుపడిపోతుంది. ఆనందమయమవుతుంది. స్వర్గతుల్యం కూడా కావచ్చు.

కె. జీవనరావు.

* * *

కొన్ని వందలమంది కూలీలు ఒక ఆలయాన్ని కట్టడంలో నిమగ్నులై వున్నారు. ఆ చోటుకు ఒక ప్రొఫెసరు వచ్చాడు. ముగ్గురు కూలీలను కలుసుకుని "నువ్వు ఏం చేస్తున్నావు?" అని ప్రశ్నించాడాయన.

"రోజుకు రెండు రూపాయలు సంపాదిస్తున్నాను." అన్నాడు మొదటివాడు.

"రాతిమీద రాతిని పేరుస్తున్నాను" అన్నాడు రెండవ కూలీ.

"నేనొక పవిత్ర దేవాలయాన్ని నిర్మిస్తున్నాను." అన్నాడు ఆఖరివాడు!





వెంకట్రావు హుషారుగా ఈలవేసుకుంటూ మెడ్రాస్ కాలేజీ లైబ్రరీహాలు ప్రవేశించాడు. ద్వారందగ్గర కాసేపు నిలబడి హాలంతా కలయజూచాడు. మూల "విషాద సారంగధర" పోజులో కూర్చున్న మధుసూధనరావు అతడికి కనిపించాడు. వెంటనే రెట్టించిన హుషారుతో యీలవేసి బిరబిరా అతడి దగ్గరకు నడిచాడు.

"లేరా! నాన్నా హాస్టలు కెడదాం" అన్నాడు మిత్రుడిని సంబోధిస్తూ. మధుసూధనరావుమటుకు చెంపకు చేయి ఆనించుకుని మెదలకుండా అలాగే కుర్చీలో కూర్చున్నాడు.

మిత్రుడి ఈ ప్రవర్తన వెంకట్రావులో ఆశ్చర్యాన్ని కలిగించింది. కణకణలాడుతున్న నిప్పుకణికెల్లో చెంబెడు చన్నీళ్ళుపోసినట్టు అతడి ఉత్సాహమంతా చల్లారిపోయింది. అనుమానంగా మిత్రుడి మొహంలోకి చూశాడు.

"ఎన్నడూలేంది ఈ పూట యీ విషాదయోగానికి కారణమేవిట్రా?" అని సేరుగా వాడినే అడిగేశాడు. మధుసూదనరావు వెంటనే మాటాడలేదు. కాసేపుండి గట్టిగా నిట్టూర్చాడు. మరి కాసేపటికి మెల్లగా "ఒరే వెంకట్! నాపని అయిపోయిందిరా!" అన్నాడు.

"అంటే?" వెంకట్రావు ప్రశ్నించాడు పజిల్డ్‌గా.

"ఓ ప్రేమ వ్యవహారంలో యిరుక్కుని గొంతుకి తెచ్చుకున్నానురా? నాశనయిపోయింది! ప్చ్" అన్నాడు, ఆత్మానుకంపాపూరితుడై విచారంగా నిట్టూరుస్తూ.

"విశదంగా చెప్పరా!" కాస్త విసుగుతో అన్నాడు వెంకట్రావు. మధుసూదనరావు గుండెలనిండా వూపిరి పీల్చుకుని లెక్చరు కొట్టబొయ్యేవానికి మల్లే ఆరంభించాడు : "థర్డియర్ కెమిస్ట్రీ స్టూడెంటు లేదూ సుధారాణి. . . . . ."

గంగాప్రవాహానికి ఆనకట్టలా వెంకట్రావు అడ్డొచ్చాడు : "నాకు పేర్లు సరిగా గుర్తుండవులే. ఇంతకీ నువ్వనేది ఆ రెండు. . . ."

ఈసారి బియాస్‌నదికి భాక్రానంగల్‌లా మధుసూదన్ అడ్డుపడ్డాడు : "కరెక్టురా ! నేననేది ఆ రెండు జడల అమ్మాయి గురించే! సన్నగా పొడుగ్గా వుండి కళ్ళకు కాటుక పెట్టుకొని వుంటుందే, ఆ కోలమొహం అమ్మాయి! ఆమే మిస్ కే. సుధారాణి థర్డియర్ బి.యస్సీ కెమిస్ట్రీ. ఆమెనుచూసిన దగ్గర్నుంచీ నా బ్రతుకిలా అయిపోయిందిరా!" అన్నాడు.

వెంకట్రావు కాసేపు ఆలోచించాడు : "అసలా పిల్లెక్కడో నాకు కనబడ్డంలేదు. ప్రేమలోపడ్డ వాడివి హుషారుగా పాటలుపాడుతూ ఊరంతా చక్కర్లుకొట్టక "మాసిన చీర కట్టుకొని మౌనముతోడ నిరస్తభూషయై. . . ."అన్నట్టుగా ఈ అవతారం ఎత్తావేమిటి?" వెంకట్రావుది తెలుగు మెయిన్ కాబట్టే అతడి నోట్లోంచి తెలుగు కొటేషన్లు దొర్లుతుంటాయి అప్పుడప్పుడూ.

"కాదురా ! చాలా క్లిష్ట పరిస్థితుల్లో వున్నాను. నీవే సహాయం చేయాలి. నీమీదే నా ఆశలన్నీ పెట్టుకున్నాను. ఎలా కడతేరుస్తావో ఏమిటో!"




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**18-10-1961 బుధవారము మొదలు**
**24-10-1961 మంగళవారము వరకు**

## మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ సమయంలో ఇతరులతో కలిసి ఏ పని చేసినా సులభంగా జరుగదు. ఎప్పటికప్పుడు స్వల్ప విషయాలలో పేచీలు వస్తూ ఉంటవి. కుటుంబం లోని వారికి అనారోగ్యం చేస్తుంది. ఏ వ్యవహారమూ మధ్యవర్తుల ద్వారా రాయబారాలు సాగించ వద్దు ప్రత్యక్షంగా సంప్రదించటంవల్ల కొంత వరకు మేలు కనిపిస్తుంది. ధనాదాయం గతవారం కన్నా తగ్గే అవకాశా లున్నవి. మీతోపోటీ చేదా మనుకునేవారు దైవికంగా తామే ఇబ్బంది పడ వలసి వస్తుంది వృత్తిలో మీరు అనుకున్న ప్రకారం పనులు జరుపలేక పోవటంవల్ల తాత్కాలికంగా మనస్సులో బాధపడతారు. క్రొత్తగా పెట్టుబడి పెట్టి ఏ పనీ ఆరంభించవద్దు. 23, 24 తేదులలో వ్యవహార జయం, బంధువులవద్ద నుంచి శుభవార్తలు, వస్త్రాలంకార ప్రాప్తి.

* * *

## వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ప్రస్తుతం సుఖం తక్కువగానే ఉంటుంది కాని, మరి ఏ విషయంలోను లోపం రాదు. ప్రయాణాలు లాభదాయకంగా జరుగుతవి. పరోపకారం నిమిత్తం మీ చేతినుంచి ఖర్చుపెట్టి తిరగవలసి వస్తుంది. కుటుంబంలో అభిప్రాయాలు భేదించేటట్లు కనుపిస్తుంది. అయితే మీ జాగ్రత్తవల్ల జరగవలసిన కార్యక్రమాలకు చిక్కు లేకుండా చూడగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో ఆదరము, దేహశ్రమ పెరుగుతవి. ఇంతకుముందు సాధించజాల మనుకున్న ఒకానొక ముఖ్యమైన పనిని చేయగలుగుతారు డబ్బు మాత్రం ధారాళంగా ఖర్చు చేయవలసిన సమయం. లలితా స్తోత్ర పారాయణం చేసుకొనటంవల్ల దేహ సౌఖ్యము, మానసికంగా ధైర్యము, శాంతి లభిస్తవి. 21, 22 తేదులలో ఉత్తరదిక్కునుంచి లాభవార్తలు, నౌకరులవల్ల కార్యసిద్ధి.

> **గ్రహస్థితి**
>
> సింహంలో రాహువు, కన్యలో శుక్రుడు, తులలో సూర్య అంగారక బుధులు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు, మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

* * *

## మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

మీరు ఈ వారం పట్టుదలతో ముందుకు పోగలుగుతారు. ఆరంభంలో ఎవరితో పేచీ పెట్టుకుంటారో వారివల్లనే చివరకు పని సాధించుకుంటారు. ఆదాయం బాగుంటుంది. మీ ఆలోచనలు క్షణక్షణానికి మారుతూ ఉంటవి. మీ క్రింద పనిచేసేవారు ప్రస్తుతం అశ్రద్ధగా ప్రవర్తిస్తారు. జాగ్రత్తగా ఉండటం అవసరం. పేరు ప్రతిష్ఠల కోసం ప్రాకులాడవలసిన సమయం కాదు. బంధుమిత్రులు సమయంలో సహాయంగా నిలుస్తారు. పైన పెట్టుకున్న భారం ఎలా నిర్వహించగలమనే ఆందోళన కలిగినా ధైర్యాధు గ్రహంవల్ల సక్రమంగా మాట దక్కించుకుంటారు. పుణ్య కార్యాలకు ఆటంకాలు వస్తవి. వారాంతంలో ఉష్ణ సంబంధమైన అనారోగ్యం చేస్తుంది. 18, 19 తేదులలో అపవాదులు, కుటుంబంలోని వారితో కలహాలు.

* * *

## కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ప్రతిదీ స్వయంగా చూచుకొనవలసి వస్తుంది వృత్తి వ్యాపారాలలో పలుకుబడి, ధనలాభము బాగా ఉంటవి. వినుగుదల తోస్తూ ఉంటుంది. క్రొత్త మార్గాలలో సంపాదనకు అవకాశా లున్నట్లు కనుపించినా నమ్మవద్దు. అధికారులవల్ల [illegible] జనం పొందగలుగుతారు. బంధువర్గ [illegible] వచ్చిన కలహాలు ఈ సమయంలో మీదాకా వచ్చి ఆందోళనను కలిగిస్తవి. విలువగల వస్తువులు కొంటారు. రెండవ భాగంలో ఉష్ణ, శైత్య ప్రకోపంవల్ల బాధ పడతారు. ఇండ్లు, భూములు మొదలైనవాటికి సంబంధించిన పని ఏదీ చురుకుగా సాగదు. ఎంత శ్రమపడినా ఇంకా కొంత కొరత కనిపిస్తూ ఉంటుంది. 20, 21 తేదులలో శత్రుబాధ, ఇతరులవల్ల మోసము.

* * *

## సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ప్రస్తుతం మీ కోపాన్ని అణుచుకొనటం అవసరం. ఇంతకుముందు మీ పక్షం మాట్లాడేవారే తలవనితలంపుగా మీ విరోధులతో చేరగల అవకాశా లున్నవి. ముందు విశేషంగా ఖర్చు చేయవలసి వస్తుంది. అందువల్ల ముఖ్యమైన పనులలో డబ్బుకు ఇబ్బంది పడవలసి వస్తుంది. ఈ వారం కొన్ని వ్యవహారాలలో బాగా లాభించినట్లు కనుపిస్తుంది. కాని, మొత్తంమీద లెక్క

చూసుకుంటే ఆదాయం తక్కువ అనే విషయం తెలుస్తుంది కలహ ప్రసంగాలవల్ల కార్యభంగం కాని, కష్టనష్టాలు కాని ఉండవు మీ మంచి పేరుకు భంగం రాకుండా చూచుకొనండి. మీ హోదాను అనుసరించి స్నేహితులకు సహాయం చేయగలుగుతారు కుటుంబ విషయాలలో విశేషంగా జోక్యం పెట్టుకొనటంవల్ల అశాంతి కలుగుతుంది 20, 21 లలో ధన విషయంలో తగాదాలు, వృత్తిలో పొరపాట్లు.

* * *

**కన్య :**

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

ఈ వారం ఆదాయము, ఖర్చులు కూడా అధికంగానే ఉంటవి మీరు పెట్టిన ఖర్చులకు ఉపయోగం ఉంటుంది ప్రత్యక్షంగా ఏ లోపము ఉండదు కాని, మనస్సుకు విశ్రాంతి లభించదు వ్యవహార రంగంలో మీ అభిప్రాయాలను కొంత వరకు మార్చుకుని కార్యం సాధించుకో గలుగుతారు పిల్లల ఆరోగ్యం గతవారం కన్నా మేలుగా ఉంటుంది. బంధు మిత్రులకు అప్పు ఈయటం వంటి విషయాలతో ముందుముందు పేచీలు రాకుండా చూచుకొనండి క్రొత్తవారిని మీ వ్యాపార, వ్యవహార రంగాలలో చేరనీయవద్దు పెద్ద మనుష్యులుగా చలామణి అవుతున్నవారే మిమ్ములను మోసం చేయటానికి చూస్తారు మీ విలాస వినోదాలకై ఖర్చులు అధికం అవుతవి వృత్తిలో మధ్యమధ్య ఆటంకాలను ఎదుర్కొంటూ ముందుకు పోగలుగుతారు 21, 22 తేదులలో ధనలాభం, ఇష్టవస్తు ప్రాప్తి

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఈ వారం ఏ విధంగానూ శ్రమ లేకుండా మీ ధర్మాన్ని నెరవేర్చుకుంటారు. వృత్తిలో తరచూ క్రొత్త మనుష్యుల సంబంధం కలుగుతూ ఉంటుంది అనుకున్న ప్రకారం ఆదాయం కనుపిస్తుంది. అవతలివారి మాటను కాదనకుండా తటస్థంగా ఉండటం అన్నివిధాలా మంచిది. అకస్మాత్తుగా మిత్రులవద్ద నుంచి కష్టవార్తలు తెలుస్తవి. శరీర శ్రమతో కూడిన పనులు ఎక్కువ అవుతవి. కాని, ఉపాయంతో తప్పించుకోగలుగుతారు ఒకరిద్దరు మిత్రులు మిమ్ములను అనుసరించి అన్నివిధాలా అండగా నిలుస్తారు. మీ ఆరోగ్యం కొంతవరకు బాగుంటుంది. కుటుంబంలో సంతోషం లభిస్తుంది ఇంతకుముందు ఏర్పడిన డబ్బుకొరత చాలావరకు తగ్గుతుంది. 23, 24 తేదులలో విలువగల వస్తువులు కొంటారు. ధన ప్రాప్తి

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఇతరులను మెప్పించటానికి శ్రమ పడతారు కాని ప్రయోజనం కనుపించదు. సేవకులను నమ్మి అజాగ్రత్తగా ఉండతగిన సమయంకాదు "తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే రకం" మనుష్యులు తటస్థపడతారు. ఎవరు ఏవిధంగా భావించినా మీ సుఖం నిమిత్తం జాగ్రత్తపడటం మంచిది. ఆడంబరంతో ఖర్చులు పెరిగే సమయం. క్రొత్త క్రొత్త యోచనలు తాత్కాలికంగా బాగున్నట్లు తోచినా, తీరా ప్రయత్నంలో దిగిన తర్వాత గాని నిరుపయోగం అనే విషయం తెలుసుకొనలేక పోతారు వ్యవహార రంగంలో ఆర్థికంగా పెద్ద ఉపయోగం ఉండదు కాని, పేరు ప్రతిష్ఠలు దక్కుతవి స్థిరాస్తుల మార్పులు మొదలయిన పనులకు తొందరపడదగిన సమయం కాదు. బంధువుల ఇండ్లకు ప్రయాణాలు చేయవలసి రావచ్చు. వారాంతంలో ధనలాభం ఉంటుంది. 21, 22 తేదులలో గౌరవప్రాప్తి, అధికారులతో సమావేశం, దైవ కార్యాలు

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

మీ ఉత్సాహానికి తగినట్లు వృత్తి ఉద్యోగాలలో తోటివారి సహాయం లభిస్తుంది. మీరు చెప్పిన మాటను పదిమందీ ఆమోదిస్తారు వ్యవహార పరిష్కారాదులలో ఫలితం సామాన్యంగానే ఉంటుంది కాని, ముందు ముందు బాధ రాకుండా చేసుకుంటారు శుభ పుణ్యకార్యాలు సులభంగా నెరవేరుతవి వారం రెండవ భాగంలో విలువగల వస్తువులు కొంటారు బంధువులలో ఒకరిద్దరు మిమ్ములను గురించి అపవాదులు ప్రచారం చేస్తారు ప్రయాణాలు అనుకూలిస్తవి. మీరు ఎదురు చూచినచోట ధనసహాయం లభిస్తుంది. హాస్య ప్రసంగాలలో జోక్యం కలిగించుకోవద్దు 22, 23 లలో వస్త్రాలంకార వస్తుప్రాప్తి. ఆదాయ వృద్ధి, విశేషంగా శ్రమ

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

పోటీవారు మిమ్ములను కేటాయింపుగా చూస్తారు. అంతమాత్రంచేత భయపడవద్దు, ఇంతకుముందుకన్నా మీ స్థితి బాగుంటుంది. ఆడంబరం లేకుండానే తృప్తిగా ఫలితం సంపాదించుకుంటారు. కుటుంబంలోనివారిని గురించిన ముఖ్య సమస్యలు ఈ సమయంలో తీరిపోయి మనశ్శాంతి లభిస్తుంది. ఎవ్వరితోనూ అవసరాన్ని మించి మాట్లాడతగిన సమయం కాదు. ధర్మకార్యాలకై ఖర్చులు అధికం అవుతవి. పడమరదిక్కునుంచి వచ్చే వార్తలు అనుకూలంగానే కనుపించినా, ఫలితం నిదానంగా ఉంటుంది "దూరపు కొండలు నునుపు" అనే విషయం గుర్తుంచుకొని అవకాశాన్ని వినియోగించుకొంటూ ఉండటం మంచిది.

**ఈవారము ధరలు**

బంగారు ధర క్రమంగా పెరుగుతుంది. వెండి ధర ఆరంభంలో తగ్గి తిరిగి 21 నుంచి పెరుగుతుంది. పసుపు ధరలో పెద్ద మార్పులు కనుపించవు. వేరుశనగపప్పు ధర కొద్దిగా తగ్గుతుంది నూనె ధర వారం ఆరంభంలో పెరిగి, వారం రెండవ భాగంలో తగ్గుతుంది. నూవుల ధర మందీలోనే నిలుస్తుంది. నూవుల నూనె ధర కూడా గత వారం మాదిరిగానే ఉంటుంది. చింతపండు ధర పెరిగే అవకాశాలున్నవి. కందుల ధర తగ్గుతుంది. మినుములకు గిరాకీ వచ్చి వారం చివరలో మందీ వస్తుంది. గోధుమల ధర నిలకడగా ఉంటుంది

18, 19 తేదులలో వినోద కార్యక్రమాలు, అధికారుల పరిచయం స్వంతవిషయాలలో ఆందోళన.

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

క్రొత్త మనుష్యులతో సంప్రదింపులు జరపటంవల్ల కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసి వస్తుంది దుబారా ఖర్చులు పెరుగుతవి కోర్టు కచేరీలలో పనులు ఎటూ తేలవు బంధువర్గంలో మీకు ప్రస్తుతం అనుకూలత తక్కువ బాహ్య విషయాలలో చక్కగా పేరుప్రతిష్ఠలు సంపాదించుకుంటారు వృత్తిలో కూడా ఇంతకు ముందుకన్నా శ్రమ తగ్గుతుంది మీతో పోటీ పెట్టుకునేవారు క్రమంగా తొలగిపోతారు. సంఘంలో భిన్నాభిప్రాయాలు గల వ్యక్తులను చల్లగా ఒక మార్గానికి తీసుకురాగలుగుతారు. ఈ సమయంలో ఎంత శ్రమనైనా భరించగల శక్తి, ఓర్పు లభిస్తవి ఆదాయం మామూలుగా ఉంటుంది. 23, 24 తేదులలో బంధువులవద్ద నుంచి శుభవార్తలు, ప్రయాణం

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ఈ సమయంలో వృత్తిలో శక్తికి మించిన శ్రమ పైనవేసుకుంటారు అయితే ఎదుటివారి మనస్సుకు నొప్పికలుగకుండా సమర్థించుకోగలుగుతారు రావలసిన డబ్బు సకాలంలో వస్తుంది కుటుంబంలో ఖర్చులు పెరిగే సమయం. వ్యవహార రంగంలో మీ మాటకు కొంతవరకు విలువ లభిస్తుంది ప్రత్యేకంగా అనారోగ్యం అంటూ చేయదు కాని, తరచు అసౌఖ్యం కనిపిస్తూ ఉంటుంది ఎటునుంచి ఏవిధమైన చిక్కు వస్తుందేమోననే ఆందోళన మాత్రం తొలగిపోతుంది విలువగల వస్తువులు కాని, డబ్బు కాని అకస్మాత్తుగా పోయే అవకాశాలున్నవి. వారం చివరలో మిమ్ములను ఆదరించినట్లు నటిస్తూ హేళన చేసేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి 20, 21 తేదులలో పిల్లలకు అనారోగ్యం, పనులలో అజాగ్రత్త మరచిపోతూ ఉండటం. ★

వెంక(టావులో చల్లని ఉత్సాహం ఆరంగ వుంచా కుంది · "చాలించు ఈ నిస్సహాయుని నిరాశాగీతం. నిన్ను నిర్ధాంతభీతుడను చేస్తాను. కర్మక్షే(త్రంలో విషాదయోగం వీడి అసలు విషయం విన్నవించు" అని మి(త్రుడికి ముదల యిచ్చాడు వాడివీపున ఓ చరుపున్నూ (ప్రసాదించాడు.

"ఈ సుధారాణి అనే అమ్మాయి నన్ను (ప్రేమి స్తుందో లేదో తెలుసుకుందామని . . . ." మధు సూదనరావు ఆరంభించాడు

"చాలు, చాలు! అర్థమయింది నీ బాధ" హస్తం పైకెత్తి వెంక(టావు అన్నాడు "ఎంతసేపు? ఈ చిన్న విషయం తెలుసుకోవటానికి అర్థపూట చాలును!"

"అదికాదు! నే చెప్పేది విను అమె నన్ను లవ్ చేస్తుందో లేదో తెలుసుకుందామని ఓ లవ్ లెటర్ (వాశానురా !" అన్నాడు మధుసూదనరావు. వెంక(టావు ఈ సంగతి విని బోలెడు సంతోష పడిపోయాడు "వెరీగుడ్ మై బోయ్! వెరీగుడ్! అని మనఃపూర్వకంగా మి(త్రుణ్ణి అభినందించి 'సదరు (ప్రేమలేఖను కుమారి సుధారాణి కర కమలాల్లో సమర్పణ చేసేవుంటావు ఔనా?" అని (ప్రశ్నించాడు

"లేదు. . " అన్నాడు మధుసూదన్. వెంక(టావు ఆశ్చర్యపోయాడు. ఇటువంటి జవాబు వస్తుందనుకోలేదు మరింత ఆశాజనకమయిన కథనే వినవచ్చని అనుకున్నాడు. కాని అతడి బు(ర్రలో చటు క్కున ఓ ఆలోచన మెరపుతీగెలా మెరిసింది. 'ఒహో! తెలిసిందిలే!! తిరస్కృత(ప్రేమ గాథన్న మాట! ఆ లేఖను తీసుకోనని సుధారాణి మొరా యించిందా?" అని అడిగాడు

"కాదురా!" అన్నాడు మధుసూదన్. ఈసారి వెంక(టావు మరో తెలివయిన వూహని బయట పెట్టాడు "ఈరోజు ఆ అమ్మాయి కాలేజీకి రాలేదంటావు అంతేకదూ!"

"అదికాదోయ్ వె(ర్రినాయనా! నేను (ప్రేమలేఖని (వాసి, దాన్ని జా(గత్తగా ఓ పల్చని కవర్లోవుంచి ఆ కవర్ని వో పుస్తకంలోవుంచి ఆమెకిద్దామని కాలేజీకి తెచ్చాను . . . " పారంలా చెప్పుకుపోతు న్నాడు మధుసూదన్ వెంక(టావు బు(ర్ర మళ్ళీ చురుగ్గా పనిచేయ నారంభించింది "కాని తీరా సమయానికి వణుకు పట్టుకోవడంవల్ల దాన్ని అమెకు ఇయ్యలేకపోయానంటావ్?" ఇది వెంక(టావు (క్రొత్త వూహ

"అదికాదురా!" మధు జవాబు

"సరిసరి! అలాచెప్పు. ఇప్పుడర్థమయింది ఇది రెకమెండేషన్ల యుగం. నీ తప్పేముంది? ఉత్తరం నేరుగా నేవే యివ్వడం బావుండదని నీ తరఫున నన్నే వెళ్ళి ఆ ఉత్తరాన్ని ఇమ్మంటున్నావ్. అంతేనా ?"

"వస్ ! అదికాదంటుంటే . . . ."మధు గట్టిగా అరిచాడు వెంక(టావుకి విసుగెత్తింది. "మరేవి(టా నీ బాధ ?" అనడిగాడు

"ఏమిటో నీ సొదేగాని నే చెప్పేది కాస్తయినా వినిపించుకోవు" మధు చిరాకేశాడు. "సరే సరే!

# మధుపత్రమ్

(33-వ పేజీ తరువాయి)

తొందరగా అసలు విషయం చెప్పు. నేనిక మాటా డనులే!" అన్నాడు వెంక(టావు కుతూహలంగా

"(ప్రేమలేఖని వో కవర్లోవుంచీ, ఆ కవరును వో పుస్తకంలో వుంచానని చెప్పానా ? ఆ పుస్తకాన్ని అన్ని పుస్తకాలతోపాటు కాలేజీకి తెచ్చాను. కాని ఇప్పుడా పుస్తకం కనబడ్డంలేదు" అన్నాడు మధు విచారంగా

ఆయుధాగారంలో ఒక హై(డోజన్‌బాంబు లెక్కకు తక్కువ వస్తోందని తెలిసిన సైన్యాధికారి "వ్వాట్!" అని గట్టిగా అరచి ఆరంగుళాలు మీది కెగిరి పడ్డాడో లేడో మనం నిర్ధారణగా చెప్పలేం కాని వెంక(టావు మా(త్రం సరిగ్గా అలానే (ప్రవ ర్తించాడు.

మధు మరింత ఫోర్సుగా చెప్పాలనే ఉద్దేశ్యంతో "అవు(నా నిజం! యా. . . స్!" అన్నాడు

వెంక(టావు అనుమానంగా "ఎవరూ?" అని అడిగాడు

---

మొదటి వాడు:- యమధర్మ రాజుకి డాక్టరుకి తేడా ఏమి టండీ? చెప్పగలరా.

రెండవ వాడు:- యమధర్మ రాజు మనిషి (ప్రాణం ఒక్కటే తీసుకు పోతాడండి. డాక్టరయితే మనిషి (ప్రాణం, ఫీజు కూడా తీసు కెడతాడండి.

మైలవరపు వేంకటయజ్ఞేశ్ బాబు
(పెద్దాపురం)

---

మధు "వేవరేమిటి నీతల! యా స్ అంటే అవును అన్నమాట. నేననేదేమిటంటే ఆ పుస్తకం ఇప్పుడు కనబడ్డంలేదు!" అన్నాడు.

వెంక(టావు వో ముఖ్యమైన క్లూ కనుకున్న వాడిలా "మరి దానిలో కవరేమైంది ?" అనడిగాడు.

"అదీ కనబడ్డంలేదు, దానిలోని (ప్రేమలేఖ కూడా కనబడ్డంలేదు" అని విశదీకరించాడు మధు

"అంటే నీ పుస్తకమూ, దానితోపాటు నీ (ప్రేమలేఖా పోయినాయన్నమాట" అని ఒక కంక్లూషన్‌కి వచ్చాడు వెంక(టావుది తెలుగు మెయిన్ అయినా అతడికి శాస్త్రీయమైన మెదడు వుంది అన్నీ తేటతెల్లంగా ఆలోచించీ కచ్చితమైన తీర్మానాలు చేస్తాడు. "ఇంతకీ నువ్వాకవర్ని ఏ పుస్తకంలో వుంచావు?" అనడిగాడు

"ఒక లై(బరీ పుస్తకంలో వుంచాను దాని పేరు "హంపీ కన్యలు" చలంగారు రాసిన నవల" మధు చెప్పాడు.

"ఆఖరుసారిగా నీవు ఈ హంపీకన్యలు అనే పుస్త కాన్ని ఎక్కడ చూశావు?" హిచ్‌కాక్ సినిమాలో లాటన్‌పోజులో అడిగాడు వెంక(టావు

"దాన్ని తిరిగి లై(బరీలో ఇచ్చేదామని తెచ్చాను. మొదటి పీరియడ్ అయిపోయాక పుస్తకాలు క్లాసు లోనేవుంచి అలా కెమిస్ట్రీ లాబ్‌వేపు చక్కర్లు కొట్టొద్దామని వెళ్ళాను తిరిగివచ్చేసరికి పుస్తకం లేదు!"

"మీ క్లాసులో వాకబు చెయ్యలా?"

"చేశాను తెలిందేమంటే నా బెంచినేటు రవీం(ధనాథ్ తానే నా లై(బరీ పుస్తకాన్ని తీసి కెళ్ళి లై(బరీలో ఇచ్చేశాట్ట అదీ విషయం"

వెంక(టావు అనుమానంగా వాడే తీశాడేమో కవర్ని?" అనడిగాడు

"వాడు తీయలేదట. ఎలావున్న పుస్తకాన్ని అలా తీసికెళ్ళి లై(బరీలో ఇచ్చేశానన్నాడు."

"నిజమేనా ?"

"నిజమే అయివుంటుంది " మ్యుఖ్యమైన కవ రురా బాబూ! నిజం చెప్పరా!" అని (బతిమాలాను ఏడుపుమొహం పెట్టి "నే తియ్యలేదురా మధూ! నీతోనా అబద్ధం ఆడేది!" అన్నాడు "

"ఇంతకీ వాణ్ణి సివాశ్లేశావా, లేదా ?"

"గుహం వాచిపోయింది" వెంక(టావుకి ఇదొక సంతృప్తి నిచ్చింది (ప్రఖ్యాత డిటెక్టివులందరి వలెనే, అపరాధికి తగినశిక్ష పడాలని అతడి అభి(ప్రాయ (ప్రాయం

"సరే! అయితే ఇంకా ఆలస్యందేనికి? ఆ పుస్తకం లై(బేరియన్ దగ్గరే వుంటుంది పోయి అడిగి దాన్ని తీసుకొని, దానిలోని కవర్ని తీసుకొని వచ్చెయ్!" అన్నాడు

మరోసారి మధు నిట్టూర్చాడు "అంత సులభ మైన వ్యవహారంకాదురా! పుస్తకం ఇమ్మని ఆయన్ని ఇందాకే అడిగాను కాని ఆయన నాకలం పోయిం దనే (భ్రమలో వున్నాడు!"

"అధైర్యపడకు ! నేను ఆయనకు వినబడేట్టు చెబుతాగా!" అని వెంక(టావు మధుని లై(బేరి యన్ వద్దకు తీసుకొని వెళ్ళాడు ఇద్దరూ ఆయన టేబిల్‌వద్దకు వెళ్ళేసరికి ఆయన (ప్రశ్నార్థకంగా వీరివంక చూశాడు

"ఉదయం పుస్తకాలిచ్చేకాలం దాటిపోయిందండీ! అన్నాడు లోగొంతుకతో

"అదంతా కన్యలు కావాలండీ!" అన్నాడు వెంక (టావు కొంచెం గట్టిగా

"అదికాదు, అదికాదు" మధు సరిదిద్దబోయాడు

"ఓ ఆయామ్‌సారీ! నాకు పేర్లు సరిగా గుర్తుం డవు "హరప్పా కన్యలు" కావాలండీ !" అన్నాడు వెంక(టావు తిరిగి లై(బేరియన్‌తో

"హరప్పాకాదు హంపీ" అని సరిదిద్దాడు మధు.

"ఔనౌను హంపీకన్యలు హంపీ కన్యలు కావాలి" అన్నాడు గట్టిగా లై(బేరియన్ జా(గత్తగా ఈ మాటువిని పాంపేయి కింగ్‌డమ్ ఇష్యూలో వుందండీ" అన్నాడు జవాబుగా

"కాదు, కాదు" వెంక(టావు చేతో సంజ్ఞ చేశాడు "హంపీకన్యలు కావాలి" అని గట్టిగా చెప్పాడు.

"కన్నయ్య ప్రిన్సిపాల్‌గారి రూంకెళ్ళాడు"

వెంకట్రావు ఈసారి చేతో మధుసూదనరావును చూపాడు "ఈయన తెచ్చిన హంపీకన్యలు కావాలి!" అన్నాడు తారస్థాయిలో. "ఆయన కలం నే చూడ లేదు" అనే క్లుప్తమైన జవాబు వచ్చింది వెంకట్రావు గొంతుకెండిపోయింది కొద్దిగాదగ్గి ఒక్కొక్క అక్షరమే చెబితే ఆయనకు వినబడుతుందేమోనని '‚గు—డి—పా—టి— వెం—క—ట—చ—లం వ్రాసినది" అన్నాడు వినబడిందో లేదో తెలుసుకుందామని ఆశగా అతడివంక చూశాడు మళ్లీ ఒకసారి చెప్పాడు : "గుడిపాటి"

"నిడుపాటి . . . .ఒహో నిడుపాటిదంటారా!" అన్నాడాయన పాపం పెద్దకలమేపోయిందే అన్న సానుభూతితో

"వెంకటచలం. . . . . .వెంకటచలం . . . " అన్నాడు వెంకట్రావు అదన్నా వినబడుతుందేమోనని

"పైలట్‌కలం. . . .పైలట్‌కలం. . . .చాలా ఖరీదే వుంటుంది. ప్స్!!" అని పెదవి విరిచాడాయన

వెంకట్రావు జేబురుమాలుతో చెమటపట్టిన నుదురును తుడుచుకున్నాడు. "ఒరే మధూ! దాహమేస్తోందిరా! కాంటీన్‌కెళ్దాం పద" అన్నాడు బొంగురు గొంతుతో ఇద్దరూ కొంటీన్‌వేపు దారి తీశారు. వెంకట్రావు రెండు గ్లాసుల నీరు త్రాగాక "ఏం చెద్దామంటావురా?" అని మధు ప్రశ్నించాడు వెంకట్రావు "ఏమీలాభంలేదు వూరుకుందాం!" అన్నాడు

"ఊరుకుంటే ఎలారా ? ఆ ఉత్తరం ఎవరి చేతుల్లోనన్నాపడితే ఏంవన్నావుందీ ? నా పరువు పోదూ! పైగా ప్రిన్సిపాల్ చేతిలోగాని, లెక్చరర్ల చేతుల్లోగాని పడిందంటే ఇక మనకి శ్రీముఖమేరా ! నన్ని కాంపౌండులోనికి రానియ్యరు!" అన్నాడు మధు

వెంకట్రావుకి బోల్డు కోపమొచ్చేసింది స్నేహితుడికోసం తనుపడిన శ్రమంతా బూడిదపోసిన పన్నీరయింది. ఈ సంగతి తెలుసుకొని అతడు మండిపడిపోయాడు. "చస్! తెలివితక్కువ వెధవ్వి! లవ్‌లెటర్లట! లవ్ లెటర్లు! రాసేవాడివి కాస్త జాగ్రత్తగా యాడవరాదూ! ఇప్పుడెలా చావాలనుకున్నావ్? చూశావుగా నీకోసం తంటాలుపడితే ఏమైందీసి" అని చడా మడా వాగేశాడు.

"నామీదెగుర్తావేరా? నేనేం చేశాను? నా పుస్తకం ఆ సన్యాసి తీసుకెళ్ళాడా! ఆయనేమో పొడవాటికలమంటున్నాడా ? పోనీకదాని నీతో చెబితే నీవు నామీదే ఫైరయిపోతుంటివాయెను! ఇక నేనెలా మొత్తుకోవాలి?" అన్నాడు బిక్కమొహమేసి మధుసూధనరావు

ఎందరో కవులు స్నేహాన్ని గురించి గొప్పగా వర్ణించారు క్షీర నీరాల స్నేహంలా మహాత్ముల మైత్రి వుంటుందని భర్తృహరి నుడివాడు పేద మిత్రుడు సమాదరంతో సమర్పించిన పిడికెడు అటుకులను పాయసంలా అప్యాయంగా తినేట్టు చేయగలిగింది కృష్ణ కుచేలుర మధ్యగల స్నేహమేనని అందరకూ తెలుసు స్నేహం గురించి చెబుతూ గురజాడవారు "ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును, ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" అన్నారు.

"సృష్టిలో తీయనిది స్నేహమేకోయ్!" అన్నారు బసవరాజు అప్పారావుగారు (లేక అడివి బాపిరాజుగారా?) ఏమైనా, బాపిరాజుగారు (బసవరాజుగారా?) చెప్పినమాట మహా సత్యమైనదని మన మందరమూ అంగీకరిస్తాం వాగర్థములవలె రెండు ఆత్మలొకటిగా సంపృక్తమై, క్రూరమకరనికర దుర్వార చలదూర్మికాగహనమైన వార్నిధిని తరింపజేసి, మానవుని ఔన్నత్యాన్ని దీర్ఘీకరించి "మనుష్యుడిల మహానుభావుడే" అనిపింపజేసేది యీ స్నేహమే! దానిలో ఏమీ సందేహంలేదు

మధు బిక్కమొగమేసేసరికి వెంకట్రావు కరిగిపొయ్యాడు అనునయంగా "కాదురా! మరి ఇల్లాటి పనులు చేసేవాడివి కాస్త జాగ్రత్తతో చేయొద్దూ! నీవే ఆలోచించు. . . . ఇంతకీ అంత ప్రమాదకరమైన విషయాలేం రాశావు ఆ జాబులో? ఏదీ దాని నకలుంటే ఇవ్వు చూద్దాం !" అనడిగాడు.

"కాపీ లేదురా!" అన్నాడు మధు. వెంకట్రావుకి తిరిగి చిరుకోపమొచ్చింది "ఛీ! ఛీ! నువ్వన్నీ యింతేరా! లవ్‌లెటర్ వ్రాసేవాడివి దాని కాపీ ఒకటి నీ దగ్గరుంచుకోవద్దూ! కాస్తయినా తెలివిలేదు నీకు!" అని వాగేశాడు ఈ దెబ్బకి మధుసూదన్‌కి కూడా కోపం ఎచ్చేసింది "కాపీలు వుంచుకోవడానికి నేనేవి ఫైళ్ళకొద్దీ లవ్ లెటర్లు వ్రాసేస్తున్నాననుకున్నావా? నా జన్మలో వ్రాసిన మొదటి ప్రేమలేఖ యిదే! అది నాకు కంఠతా వచ్చినప్పుడు కాపీ వుంచుకోవాల్సిన అవసరమేముంది?" అన్నాడు

"అయితే అదేదో తొరగా చెప్పి ఏడు ఎందుకైనా మంచిది!" అని శాసించాడు వెంకట్రావు ఈ మాటవిని మధు సిగ్గుపడ్డాడు.

"హారిని అసాధ్యం!! చెప్పడానికింత సిగ్గయితే కాయితమ్మీదరాసి తగలెట్టు చదువుతాను" అన్నాడు వెంకట్రావు. మధు అంగీకరించి వో కాయితంచింపి దానిమీద ప్రేమలేఖ తాలూకు కాపీ

---

మొదటివాడు :- ఏమండీ మహాశయా! తమరు మీ అబ్బాయి ప్లీడరు కావలెనని ఎందుకు కోరడం? ఏ మాస్టరుగానైనా చేస్తే బాగుంటుందే?

రెండవవాడు :- నిజమే సోదరా! కాని మావాడికి చిన్నప్పటినుండీ అబద్ధమాడడం అలవాటు. అందుచేత వకీలుగా తయారుచేయడం మంచిదనిపించింది నాకు.

మైలవరపు వేంకటాయజ్ఞేశ్ బాబు
(పెద్దాపురం)

---

రాసిచ్చాడు వెంకట్రావు దాన్ని అందుకొని ఇలా చదివాడు

"మై డియర్ సుధారాణి,

మీ మధుర వదనారవిందాన్నిచూచి ధృతిచెదరి నామది నాలో అవధుల్లేకుండా అల్లరిచేస్తోంది. మీ ఎదురుగా నా కధనాన్ని వినిపిద్దామనుకుంటే వెధవది నా హృది ఒకటే దడదడలాడుతోంది. పదార్వన్నె సువర్ణంతో మధువును రంగరించి విధాత మీతనూలత నను సృజించాడు మీ అధరంలోని అరుణిమగానీ, మీ సోగ కనుల సోయగంగానీ నాకు దివ్యసందేశాలనే అందిస్తున్నాయి. జీవితపథంలో నిరాధారంగా పయనించేపాంధుణ్ణి నేను. నా జీవిత రథానికి సారథిగా వుండటాని కంగీకరిస్తారేమోనని ధైర్యంచేసి యీవిధంగా వ్రాస్తున్నాను. జవాబిస్తారుకదూ!

మీ మధు"

ఈ ఉత్తరాన్ని సాకల్యంగా, సావకాశంగా సవిమర్శనంగా మైమరచి చదివి ఏదో చెబుదామని వెంకట్రావు నోరు తెరిచాడు. అదే క్షణంలో—

రివ్వున గాలి వీచింది. రెమ్మలనుండి అనిలావర్జితములైన కుసుమాలు ఎగురుకుంటూ ఎలా వెళ్ళతాయో అలాగే వెంకట్రావు చేతిలోనుండి కూడా ఆ ఉత్తరం తొలగిపోయి గాలిలో ఎగురుకుంటూ కాంటీన్ కిటికీగుండా అవతల కెమిస్ట్రీ లాబ్‌వద్దకు పోయి పడింది.

* * *

మిత్రులిద్దరూ ఆశ్చర్యంతో నిశ్చేష్టులై ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. పరిసర పరిజ్ఞానం కలిగాక ఇద్దరూ పరిగెత్తుకుంటూ కిటికీవద్దకు వెళ్ళారు. అవతల కెమిస్ట్రీ లాబ్ చుట్టుపక్కల ఓ చిన్నకాయితమ్ముక్కయినా వారికి కనబళ్లేదు. జనసంచారం కూడా ఎక్కడా లేదు. లాబ్ హాలు గోడ కానుకుని ఓ గార్దభరాజంమాత్రం ఈ ప్రపంచంతో ఏ సంబంధమూ లేనట్టు నిశ్చింతగా నిలబడి నిద్రపోతోంది.

"ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు మధు సర్వనాశనమైన 'కింగ్‌లియ్యర్'లా. కష్టాలొచ్చాయంటే వందలకొద్దీ వస్తాయని పెద్దలు చెప్పనే చెప్పారు కదా!

మధు ఆందోళన గమనించి వెంకట్రావు అన్నాడు: "ఒరే! వూరికే గాభరాపడకు. ఆపదలందు సముచితధైర్యగుణంతో వుండడం ధీరోదాత్తుని లక్షణాల్లో ఒకటని ఈరోజే మా ప్రొఫెసర్ చెప్పాడు. అసలు నువ్వు రెండు లవ్ లెటర్లు పోయాయే అని బాధపడకూడదు. ఈ రెండవదివెళ్ళి మొదటిదాన్ని వెతుక్కొస్తుందని తలంచుకొని గుండె దిటవు చేసుకోవాలి ఇక ఇది క్లిష్టపరిస్థితి కాబట్టి సర్వాధికారాలూ నేను వశపరచుకుంటున్నాను. నువ్వు నేను చెప్పినట్టల్లా చెయ్యి ముందు లైబ్రేరియన్ దగ్గర కెళ్ళి 'హంపీకావ్యము' అనే పుస్తకం ఎక్కడుందో కనుక్కొనిరా !. . . . ."

"హంపీకన్యలు" అని సరిదిద్దాడు మధు.

"అదే "హంపీకన్యలు"కాని ఇంతకుముందు వలె ఇప్పుడు నీవు కష్టపడవలసిన అవసరంలేదు.

(39 వ పేజీ చూడండి)

# ఎంత లాలిత్యము, ఎంత మృదుత్వము, ఎంత తాజాయైన సువాసన!

## కాష్మీర్ బొకె టాల్కమ్ పౌడరు వాడితే మీకు అటువంటి హాయినిస్తుంది!



మీరు వాడే ఫేసు పౌడరును మెరిసేలా చేసుకోండి. కాష్మీర్ బొకె టాల్కును కొంచెము పౌడరులో చల్లండి. కాష్మీర్ బొకెలో ఉన్న ఎక్కువ మృదువైన, మనోహరమైన తళతళ మీ పౌడరును మెరిసేలా చేస్తుంది!



పాపాయిని హాయిగా, సౌఖ్యముగా ఉండేలా చూడండి! కాష్మీర్ బొకె పౌడరు ఇతర ప్రత్యేకమైన బేబీ పౌడర్లంత మెత్తగానూ ఉంటుంది. దానిని రాస్తే మీ పాపాయి పువ్వులా తాజాగా ముద్దొస్తూంటుంది. ఈ పౌడరు మీకూ మీ పాపాయికి కూడ పనికివస్తుంది!



కాష్మీర్ బొకె టాల్కు యొక్క చల్లని పుష్పదళమువంటి స్పర్శకు మీరు పూల గుత్తుల మధ్య ఉన్న చక్కని అనుభవము పొందుతారు! దానిని ఒళ్లంతా రాసుకోండి - వసంత ఋతు పూలపరిమళము వంటి సువాసనలో తేలిపోతూ ఉంటారు. స్నానము చేసిన ప్రతి సారి దానిని రాసుకోండి.




## కాష్మీర్ బొకె

టాల్కమ్ పౌడరు పురుషులు ప్రేమించే పరిమళం గలిది.

నాకో అయిడియా తట్టింది ఆయనకు వినబడదు గాని చదవగలడుగా! కాబట్టి వెళ్ళి త్వరగా తెలుసు కొనిరా! ఇంతలో నేను ఇప్పుడెగిరిపోయిన కాయితం గురించి ఆలోచిస్తుంటాను'' అన్నాడు వెంకట్రావు

"అద్భుతంరా వెంకట్! అద్భుతం! నీ బుర్ర ఇంత చురుగ్గా—ఇంత క్లిష్ట సమయంలో పని చేస్తుం దనుకోలేదు!" మిత్రుణ్ణి మెచ్చుకుంటూ మధు నిష్క్రమించాడు

వెంకట్రావు సాలోచనగా కిటికీలోంచి ఆవలకు చూశాడు ఆ చుట్టుపట్ల ఎక్కడా కాయితం అన్న జాడే కనబళ్లేదు వెంకట్రావు బుర్రలో ఓ ఆలో చన మెరిసింది సైంటిఫిక్ అయిడియా కెమిస్ట్రీ లాబ్‌కదూ అది దాని చుట్టుపట్లవుండే వాయు వంతా ఆమ్లంతో నిండివుంటుంది. కాబట్టి కాయితం ఆ వాయువులో కరిగిపోయివుంటుంది ఎంత సైంటి ఫిగ్గావున్నా ఈ నిర్ణయం అంత సమంజసంగ కనిపించలా తీక్షణంగా చూశాడు హాలుప్రక్కగా గార్దభరాజం అలాగే నిలబడి నిద్దరోతోంది దానిని చూస్తూవుంటే అతడి మనసు పరిపరివిధాల పరుగ లెత్తింది. కాని . . బుజువెలా?

మధు తిరిగొచ్చాడు. "ఒరే" వెరీసారీ! హంపీ కన్యలు అప్పుడే చేతులు మారిందట! నా ప్రేమ లేఖ ప్రపంచంలో ప్రవేశించిందిరా!!"

"నీవేం భయపడకు. నాకు ఇంకొక వూహ తట్టింది. సెకెండ్ జా ఆలజీలో మధుమూర్తి అని ఒకడున్నాడు కాబట్టి నిన్నెవ్వరూ అనుమానించరు ఇంతకీ ఆ పుస్తకాన్ని ఎవరు తీసుకున్నారట?"

"ఫోర్తియర్ మాథమాటిక్స్ స్టూడెంటు యస్ రామ్మూర్తి తీసుకెళ్లాడట మెయిన్ బ్లాకులో వుంటాడే వాడేననుకుంటా !" అన్నాడు మధు

"ఒరే మధూ! ధైర్యం చిక్కబట్టుకో, కష్టా లొకదానివెంట ఒకటి వస్తాయంటే ఇదే! ఆ రామ్మూర్తి సంగతి నువ్వెరగవులే! వాడి బుద్ధి ఎంత వంకరయిందంటే, అది చూశాక కొంగమెడ తిన్నగా కనబడుతుంది కర్ణుడు, శిబి వగైరా దాతలు జన్మించిన దేశంలో వీడంత స్వార్థపరుడెలాపుట్టాడో తెలియకుండావుంది వాడి దగ్గరకెళ్ళి 'ఒరే! నీ పుస్తక మొకమాటివ్వరా! చదివి ఇచ్చేస్తాను' అని అడిగావనుకో! వాడి ప్రాణంపోయినా దాన్ని యివ్వడు పైగా ఏ పుస్తకం తీసుకుపోతావోనని అన్నిటినీ అలమారులోపెట్టి గొడ్రెజుతాళం వేసుకుంటాడు వాడు సామాన్యుడుకాదు'' అని ఏకరువుపెట్టాడు వెంకట్రావు

"మరేం చేద్దామంటా విప్పుడు?"

"నాకొక అయిడియా తడుతోంది ప్రసాద రావు రూము కెళ్దాం రా!"

"వాడి రూముకెందుకూ?"

"వాడిదగ్గర వో విరుగుడుంది అదేమిటో నాకు తెలీదనుకో ఉందనిమాత్రం తెలుసు వెళ్దాం రా!"

ఇద్దరూ బయటికొచ్చారు దూరంగా కాలేజి నుండి అమ్మాయిల బృందం వస్తోంది వారిని చూడగానే మధు వెంకట్రావుని మోచేత్తో పొడి చాడు "ఒరే చూడు! కథానాయకి వస్తోంది"అన్నాడు మెల్లగా వెంకట్రావు తల పంకించాడు.

(37–వ పేజీ తరువాయి)

ఆ అమ్మాయిల్లో వో రెండు జడలమ్మాయి మధుని వోరగంటచూసి తనలో తానే మెల్లగా నవ్వుకొంది. తన చేతిలో పుస్తకాలని సర్దుకొని మళ్ళీ నవ్వింది. అందరూ ముందుకు సాగిపోతుండగా ఆమె వెనుదిరిగి వోసారి మధు వంకకి చూసింది.

"ఒరే చూశావుట్రా! ఆ క్రీగన్నులలోని కాంతి! జలదనీలాలైన ఆ నయనాలలో విద్యుల్లతలా మెరిసి పొయ్యే సౌందర్యం!"

"పూర్వకాలం రోమ్ నగరపు రాజు నీరో...." మొదలెట్టాడు వెంకట్రావు.

"అబ్బ చాలిద్దూ నీగోల! ఆమె సౌందర్యం నన్ను పిచ్చివాణ్ణిగా చేస్తోంది. నడకలోని ఆ విలాసం, సౌవర్ణప్రభనుమించే ఆ తనూసౌకుమార్యం నన్ను వెర్రివాణ్ణిగా చేస్తున్నాయి ఆమెకోసం అమాంతం నిప్పులలోకి ఉరకమంటే నేను సిద్ధం. కాలిపోయిన నా దేహానికి ఆమె చేలాంచలముల కొస విసరుల తోరు పులు తగిలితే నాలో ప్రాణం ప్రసరించగలదని

గుమాస్తా (జవానుతో):– ఏమి టోయి ఈ రోజు ఇంతగా చినిగి పోయిన చొక్కా ధరించా వెందుకు?

జవాను:– ఈ రోజు మన పై ఆఫీసర్లు తనిఖీకు వస్తారటగదండీ!

కొల్లా వెంకటేశ్వరరావు (గుంటూరు)

పిస్తోంది. ఆమె నా హృదయరాణి నా ప్రేమ పాశాలకు బోణి మాంచి కవిత్వం రాసేయాలనుంది నాకు

నేను విధాత నామె వాణి
నేను శర్వుడ నామె శర్వాణి
నే నింద్రుడ నామె యింద్రాణి
నేను మధు నామె సుధారాణి"

"ఒరే! నీ పైత్యం చాలించి ముందు నీప్రేమ లేఖ గొడవ చూసుకో దాన్ని తీసికెళ్ళి ఆమె ప్రిన్సి పాలు కిచ్చిందంటే నీ రోగం చప్పగా కుదుర్తుంది!" అని వెంకట్రావు హెచ్చరించాడు మధు వెంటనే "సరే పద" అని అతడివెంట నడిచాడు.

ఇద్దరూ ప్రసాదరావు రూము కెళ్ళారు ప్రసాద్ మంచంలో పడుకొని మిదికిచూస్తూ సిగరెట్టు కాలుస్తున్నాడు

"సమస్కారం, బ్రదర్ ప్రసాద్" అన్నాడు వెంకట్రావు

"నమస్కారంరా!" అన్నాడు ప్రసాద్ తల తిప్పకుండానే "పనిమీదే వచ్చినట్టున్నారే!" వచ్చిన యిద్దరూ కుర్చీల్లో కూలబడ్డారు. వెంకట్రావు చెప్పాడు. "బాగా వూహించావు బ్రదర్!! పని మీద వచ్చామంటావా? అది సఫలం కావాలనే వచ్చాం. అందుకే నీకు నమస్కారం కూడా కొట్టాం. నమస్కారం కొట్టంది పని సఫలంకాదని శాస్త్ర గ్రంథాల్లో రాశారటలే!"

"ఔనౌను! నేనూ విన్నాను ఇంతకీ మీ "మస్కా" ఎందుకు?"

"మన రామ్మూర్తితో చిన్నపనిబడింది. నీ సాయంకోసం"

"వాడితో ఏం పని ?"

"వాడిదగ్గరుండే ఒక వస్తువు మాకు కావాలి అది మాదే అనుకో అయినా ఇప్పుడది వాడి చేతిలో వుంది"

"మీ వస్తువన్న మాటేమిటి? ఒకసారి వాడు కాఫీతాగి . ." ప్రసాద్ ఆగి మళ్ళీ సర్దు కున్నాడు. ఐమీన్ మీ వస్తువయినా, వాడి చేతులో పడిందంటే తిరిగి రావడంకల్ల" నిక్కచ్చిగా చెప్పే శాడు

"అలాగంటే ఎలాభాయ్? వో ముఖ్యమైన కవరు వాడిచేతిలో చిక్కుకుంది ఎలాగైనా నీవు సాయం చేయాలి! లేకుంటే చచ్చామన్నమాటే!"

"నాకూ చేయాలనేవుంది కాని రామ్మూర్తి సంగతి నువ్వెరగవు!"

"నీవే ఏదో ఉపాయం చెప్పాలి"

ప్రసాద్ కాసేపు పై కప్పువంకకిచూసి, తర్వాత అన్నాడు "నాకొక్కటేమార్గం కనబడుతోంది"

"చెప్పరాబాబూ! నీకు పుట్టెడు పుణ్యము స్తుంది" అన్నాడు వెంకట్రావు

"ఆ కవరు ముఖ్యమైనదా?"

"ముఖ్యమేమిటి? మన ఫ్యూచరంతా దాంటోనే వుంది!" ప్రసాద్ మళ్ళీ కాసేపు వూరుకున్నాడు. తర్వాత "సరే, అయితే! నా దగ్గరో బ్రహ్మాస్త్ర ముంది! అది మీకు ఉపదేశిస్తాను" అన్నాడు.

"థాంక్స్యూ, బ్రదర్! థాంక్యూ" వెంకట్రావు సంతోషపడిపోయాడు

"ఒక్కషరతు" నిరుద్వేగంగా ప్రసాద్ అన్నాడు. "దానిలోని రహస్యంమాత్రం అడుగరాదు"

"ఎందుకడుగుతాను బ్రదర్! మాక్కావలసింది నీ మంత్రం"

"సరే ! ముందు నీ కవరు ఇచ్చెయ్యమని వాడిని మర్యాదగా అడుగు వాడసలు ఇవ్వడులే! అప్పుడు "దీపక్‌మహల్లో జరిగిన సంగతి నాకు తెలుసు" అను వెంటనే వాడు నీకు నీ కవర్ని ఇచ్చేస్తాడు"

"వెరీగుడ్! అల్లావుద్దీన్ అద్భుతదీపం అన్న మాట "దీపక్ మహల్లో జరిగిన సంగతి" వెరీ గుడ్! దీపక్‌మహల్‌అంటే సినిమాటాకీస్‌కదూ!"

"అదే లీలామహల్ ప్రక్కనుండేది" అన్నాడు మధు

"తెలుసులేరా! వాణిమహల్‌కెళ్లేదారిలోదేగా!" అన్నాడు వెంకట్రావు "బావుంది బ్రదర్ నీ మంత్రం అథాతో బ్రహ్మజిజ్ఞాసా అంటే దీపక్ మహల్లో ఏం జరిగిందో తెలుసు అని అర్థం. ఇంతకూ ఏంజరిగింది దీపక్‌మహల్లో?"

"అడగొద్దన్నాగా! ఎక్కువ తెలుసుకోడానికి ప్రయత్నించకు!" గంభీరంగా నవ్వాడు ప్రసాదరావు.

"కార్యసాధనకు పితాళభైరవివంటిది. వాడిదగ్గర చిక్కుపడిన కవరు తెచ్చుకోడానికి అలీబాబా నేర్చుకున్న "వోపెన్‌సెసేమ్" వంటిది ఉపయోగించుకుంటే లాభం చేకూరుతుంది వెళ్ళిరా!' అన్నాడు

"అలాగే బ్రదర్! థాంక్యూ! మెనీథాంక్స్. నమస్కారం"

"నమస్కారం!"

* * *

మిత్రులిద్దరూ రామ్మూర్తి గదివేపు నడిచారు గదింకా అల్లంతదూరంలో వుండగానే వెంకట్రావు చిటికేవేసి "నాకో అయిడియా తట్టింది" అన్నాడు

"ఏమిటది?" అనడిగాడు మధుసూదనరావు యాంత్రికంగా. వెంకట్‌కి అయిదు నిమిషాలకొకటి చొప్పున అయిడియాలు తడుతూనేవుంటయ్. అంచేత అవి వినడం మధుసూదన్‌కి అలవాటయిపోయింది.

"మనం ప్రసాద్ చెప్పిన అస్త్రాన్ని ఉపయోగించాల్సిన అవసరమే లేదు"

"కారణం?"

"వాడిప్పుడు బీచ్‌కి వెళ్ళివుం[illegible]"

"వెళ్తే కాసేపట్లో తిరిగి వస్తాడు."

"కాదులే నీకు తెలియదు సిటీబస్సుకి అణాన్నర ఎందుకివ్వాలని నడిచే వస్తాడు. వాడొచ్చేసరికి రాత్రి తొమ్మిదిదవుతుంది"

"అయితే ఇప్పుడు వాడి రూముకెళ్తే లాభమేమిటి?"

"ఇప్పుడే లాభం వో వస్తువు సంపాదించదలచినప్పుడు మోసం చేసైనా సంపాదించాలి"

"మరి నేను?" అనడిగాడు మధు

"నీవూ నాతోనే రా!" అన్నాడు వెంకట్రావు ఎడంచేతివేపు తిరుగుతూ

"బాబోయ్! నేను రాను!" అని మధు అక్కడే ఆగిపోయాడు.

"ఓరి వెధవాయ్! జీవితంలో నీవెలా ప్రాస్పర్ అవుతావో నాకు తెలీకుండావుంది. సరే! నీవలా వెళ్ళి నేచురల్ సైన్స్ డిపార్ట్‌మెంట్‌దగ్గర వుండు. పని ముగించుకుని పావుగంటలో వస్తాను" అని వెంకట్రావు హుషారుగా ముందుకు నడిచాడు.

వెంకట్రావు రామ్మూర్తి గది దగ్గరకు వచ్చాడు సరిగా కిటికీలో చేయిపెట్టి వో గుప్త ప్రదేశంలో నుండి తాళంచెవిని తీశాడు ఆ రూంలో ముగ్గురుంటున్నారు. తాళంచెవి ఒకటే వుండడంవల్ల ఎవరెప్పుడొచ్చినా తలుపు తెరుచుకోవడానికి వీలుగా దాన్ని వో స్థలంలో దాచారు. వెంకట్రావుకి ఈ సంగతులన్నీ తెలుసు అతడు గది తలుపులు తెరిచి చొరవగా లోపలికి ప్రవేశించాడు. అన్ని మూలలా పుస్తకంకోసం త్వర త్వరగా వెతికాడు కాని అది కనిపించలేదు. వెళ్ళిపోదామనుకుంటుండగా టేబిల్ మీద అతడికొక సినిమా పత్రిక కనిపించింది. దాన్ని అందుకుని కుర్చీలో కూర్చున్నాడు.

బూట్లచప్పుడు విని వెంకట్రావు చెవాల్నలేచి వింటున్నాడు. ముప్పావుగంట గడిచిపోయిన సంగతే తెలియదతనికి మరుక్షణంలో రామ్మూర్తి గదిలోకి ప్రవేశించాడు.

వెంకట్రావు అతడి కళ్ళలోకి అనుమానంగా చూశాడు.

రామ్మూర్తి అతడి మొహంలోకి కోపంగా చూశాడు.

వెంకట్రావు ఆశ్చర్యపోయాడు.

రామ్మూర్తి విస్తుపోయాడు.

"అప్పుడే వచ్చేశావేం?" అనడిగాడు వెంకట్రావు అప్రయత్నంగా.

"ఈరోజు. . . . ." అని రామ్మూర్తి ఏదో చెప్పబోయి తమాయించుకుని "నువ్వు మా రూంలో కెలావచ్చావ్" అనడిగాడు.

"సర్దాకి నిన్ను చూద్దామని వచ్చాను మనిద్దరం భాయ్ భాయ్ కదూ!"

"భాయ్ భాయ్ అయితే దురాక్రమణ ఎందుకు చేశావ్?"

"నీ కుర్చీలో కూర్చోవడం దురాక్రమణా?"

"తలుపుతెరుచుకొని లోపలికి రావడం దురాక్రమణకాదూ?"

మల్లయ్య:- ఇంత పెద్ద పట్నంలో యిన్ని దుకాణాలున్నాయి కాని నాకు కావలసింది ఒకచోట దొరకలేదు.

స్వామి:- ఏమిటది.

మల్లయ్య:- "అరువు"

డి. బ్రహ్మానందరెడ్డి (చీరాల)

"అరేభాయ్! నే వచ్చేసరికి తలుపులు వేసివున్నయ్. నువ్వు త్వరలోనే వస్తావుకదా అని తలుపు తెరుచుకుని లోపల కూర్చున్నాను. ఇది తప్పా?"

"నాకేం నచ్చలా! ఇంతకీ నీకు నాతో ఏంపని?" అని మీదికొచ్చినట్టు అడిగాడు రామ్మూర్తి.

"సరదాగా మాటాడదామని. . . ."

"చెప్పు! ఏం పని?" మరింత మీదికొచ్చినట్టు అడిగాడు.

"చెబుతున్నాగా ! పనేం . . ."

"బలుసాకు తినదలచుకుంటే నిజం చెప్పు ఏమిటి నీ అభిప్రాయం?" భయంకరమైన భూతం కదిలి ముందుకొస్తున్నట్టు వచ్చాడు రామ్మూర్తి. వెంకట్రావు విలవిల్లాడిపోయాడు గొంతెండిపోయింది ఎలాగో కష్టపడి" 'వాణీమహల్లో జరిగింది నాకు తెలుసు" అనగలాడు

"వాణిమహలా! వాణిమహల్!!" వికటంగా నవ్వాడు రామ్మూర్తి. వెంకట్రావు ఆశ్చర్యపోయాడు బ్రహ్మాస్త్రం పనిచేయనందుకు తీక్ష్ణంగా ఆలోచించాడు. ఈసారి అతడి మనసుకు సరైన మంత్రం స్ఫురించింది.

"నాకుతెలుసు లీలామహల్లో ఏం జరిగిందో" అన్నాడు.

"గదిలోకి ఎందుకొచ్చావురా అంటే చవాకులు వాగుతున్నాడు!" రామూర్తి స్వగతంగా మరింత దగ్గరకువస్తూ. మెల్లగా వాడిచేయి మీదికిపోతోంది. వెంకట్రావు భయంతో కళ్ళుమూసుకుని గట్టిగా అరిచాడు. "దీపక్‌మహల్లో జరిగిందంతా నాకు తెలుసు!"

అంతే! ఆ చేయి అలా ఆగిపోయింది మెల్లగా క్రిందికిజారిపోయింది కూడా.

"తెలుసు, నాకంతా తెలుసు!" అన్నాడు మెల్లగా వెంకట్రావు. "ఏంతెలుసు?" అని అడుగుతాడేమో నని భయపడ్డాడు కూడా.

రామ్మూర్తి దగ్గరికివచ్చి వెంకట్రావు చేతులు పట్టుకున్నాడు. "బాబ్బాబు! ఎవ్వరితో చెప్పద్దురా! మనిద్దరం భాయ్‌భాయ్ ! నీకేం కావాలో చెప్పు చేస్తాను!" అన్నాడు

"నాకు చలం రాసిన "అమరావతి శిధిలాలు" అనే లైబ్రరీ పుస్తకం కావాలి" అన్నాడు వెంకట్రావు

"చలం అలాటి పుస్తకం రాయలేదురా!" అన్నాడు రామ్మూర్తి ఓపిగ్గా.

"అవునవును. అదికాదు "హంపీ శిధిలాలు" అనే పుస్తకం నువ్వివాళ లైబ్రరీనుండి తెచ్చావుగా! అది" అన్నాడు వెంకట్రావు.

"అది "హంపీ శిధిలాలు"కాదు "హంపీ కన్యలు". కాని ఆ పుస్తకం నా దగ్గరలేదు. కావాలంటే రేప్పొద్దున్నే తెచ్చిస్తా"

"అదెక్కడుంది?"

"సెకెండవరు దాన్ని లైబ్రరీలో తీసుకున్నాను. అట్లఅయినా విప్పిచూడలేదు పట్టుకొస్తూంటే కెమిస్ట్రీ స్టూడెంటు సుధారాణి, నే చదివిస్తానని తీసికెళ్ళింది. నీకు కావాలంటే ఉదయాన్నే వెళ్ళి తీసుకొస్తాను అత్యవసరమయితే ఇప్పుడే తెస్తాను"

"వద్దులేరా భాయ్! నీకాశ్రమ ఎందుకు? నాకాపుస్తకమేవద్దు తమాషాకి అడిగాను. అంతే, వస్తా. టా! టా!!" అని వెంకట్రావు వెనుతిరిగి నడిచాడు

"ఒరే వెంకట్! ఎవరితోనూ. . . .

"భయపడకోయ్! ఒక్కపిట్టకయిన తెలీదనుకో! వస్తా బై బై!!" అని వెళ్ళిపోయాడు.

వెంకట్రావు విసవిసా నడుచుకుంటూ నాచురల్ సైన్స్‌లాబ్ దగ్గరకు వచ్చాడు. మధుసూదనరావు అతడికోసం విసుగ్గా ఎదురుచూస్తున్నాడు.

"ఏరా! ఇన్ని యుగాలయిందేం? అని అడిగాడు వోపిక చంపేసుకుని.

"నీరొట్టె విరిగి నేతిలో పడిందిరా బ్రదరూ!" అన్నాడు వెంకట్రావు

మధు కర్థంకాలా "అంటే?" అని ప్రశ్నించాడు

"నీ మొదటిప్రేమలేఖ గమ్యస్థానం చేరింది"

"అంటే ?"

"అంతే!" అని వెంకట్రావు క్లుప్తంగా పరిస్థితిని విశదీకరించాడు.

(42 వ పేజీ చూడండి)


ఇది రహస్యం - మళ్లీ ఎవరితోనూ అనవద్దని లీలకి గట్టిగా చెప్పావా?
అమ్మో! నిజంగానే ఎవరికీ తెలీకూడదు కదా - అందుకనే రహస్యమని చెప్పలే-


జయకి కాలేజీ చదువంటే విసుగేస్తోందట-
ఏమ్మా! కుర్రాళ్లు వెంట పడుతున్నారా?
అదే తొందరట!


నిన్న మా నాన్నారు నా జాతకం చూపించారు- నాకు పద్దెనిమిదేళ్ళు, నిండేదాకా పెళ్లవదట
పద్దెనిమిది నిండేదాకా పెళ్లవదనా - లేక పెళ్లయ్యేదాకా పద్దెనిమిది నిండవనా?


మీ గ్రామరు మరీ పాడౌతోందే తేడుస్తోంది
పోదూ నువ్వసలు అలా అనుకోకే పోయినా పైకి అలా అంటావూ-
లేవిదులా పైకి అనక పోయినా మనసు లోపల అలాగే అనుకుంటావుగా-


వెర్రి వెధవలు- అది సవరం జడ అని తెలీక అలా వెంట బడుతున్నారు-

(40-వ పేజీ తరువాయి)

"మరి మన కర్తవ్యం"

"అదీ ఆలోచించాను. చెబుతా విను. సుధారాణి రోజూ కాలేజినుండి ఇంటికెళ్లేటప్పటికి రాత్రి ఎనిమిదిన్నర అవుతుంది. రోజూ రామారావ్‌స్ట్రీట్ వెంబడే వెళ్తుంది. ఈరోజురాత్రి నీవు దారికాసి ఆమెతో మాటాడేసి ఐసాపైసా తేల్చేసుకో. నే నింతలో రెండో ప్రేమలేఖ సంగతి చూస్తాను"

"ఎలా మాటాడాలిరా ! వణుకుగావుంటుం దేమో!" అన్నాడు మధు.

"ఆమాత్రం మాటాడలేని వెధవాయివి ప్రేమ లేఖ ఎలా వ్రాశావు? ఏం భయంలేదు దారిలో నిలబడి "సుధారాణి!" అని పిలు "హోయ్" అంటుందికదూ! "హంపీయాత్ర"లో వుండే నా కవరు తిరిగి ఇచ్చెయ్యండి అను. ఆ సంగతి తెలిసిపోతుంది! వెళ్ళు త్వరగా! నాకూ అర్జంటు పనుంది" అని మధుని వెంకట్రావు తరిమాడు.

* * *

మధు వీధిలైటు క్రీనీడపడేచోట నించున్నాడు వీధిలో ఏ సందడీలేదు కాని దూరంగా విద్యుద్దీప కాంతిలో తళతళ తారురోడ్డు మెరిసిపోతోంది ఆకాశంలో మినుకు మినుకుమనే నక్షత్రాలు, ఉత్సాహజనకమయిన గాలి, మనోహరమైన వాతావరణం. మేజర్ టిటోవ్, వోస్టాక్‌లో కూర్చున్నంత ఆనందంగా వుంది.

దూరంగా హో ఆకారం కదులాడింది మసక నీడలోంచి మధు కళ్ళు చించుకుని చూశాడు సందేహంలేదు. అది స్త్రీ ఆకారమే అతడి గుండె జనతా ఎక్స్‌ప్రెస్‌తో పోటీ చేయడం ప్రారంభించింది ఆ ఆకారం క్రమేపీ దగ్గరవడుతూ వచ్చింది మధు ఆమెను పోల్చుకున్నాడు ఆ రెండు జడలూ, రాయంచలను జయించినట్టి ఆ నడకలోని వయ్యారం అతడి గుండెవేగం హెచ్చించి గ్రాండ్‌ట్రంక్ వేగాన్ని అందుకునేలా చేసింది ఆమె పది గజాలదూరంలో వుందనగా అతడి గుండె చిన్నసైజు అమెరికన్ రాకెట్టుతో సమానంగా పరిగెత్తింది

ఆమెను కాస్త దగ్గరగా రానిచ్చి "సుధా" అని మధురంగా పిలిచాడు మధు. కాని ఆ భయంలో అతని నోటిలోంచి విచిత్రమైన ధ్వనితప్ప స్పష్టమైన శబ్దం బయటికి రాలేదు

"హా. . . క్" అని అరిచింది సుధారాణి అర వడమేమిటి ఒక్క ఉదుటున ఆమె ఎగిరి త్రుళ్లిపడింది ఆమె చేతిలోని సుమారు ఇరవై పుస్తకాలూ నేలనపడి పోయాయి.

మగపక్షి ప్రేమకూజితానికి ఏ ఆడపక్షిఅయినా "హా. . . క్" అని జవాబిస్తుందో లేదో తెలీదు మానవ భాషలోమాత్రం ఈ ప్రయోగం అపూర్వం బహుశా ఆమె "వాట్" అనబోయి "హా . క్" అని అరచివుంటుందేమోనని వూహించవచ్చు

"ఏంసుధా!! అంత భయపడిపోయారేం?" అని అడిగాడు మధు

ఆమె "మీరా మధుగారూ!! ఎంత భయపెట్టారండీ!!" అన్నది

"క్షమించండి! మీతో పనుండి మాటాడుదామని వచ్చాను" అన్నాడు మధు.

"నేనూ మీతో హో విషయం చెబుదామనుకుంటున్నాను"

"చలంపుస్తకంతో కవరు . . ."

"దానిలోని ప్రేమలేఖ . . . ."

"క్షమించండి . . ."

"నేను దాన్ని చదివేశాను"

"నిజంగానా?"

"ఔనండి! నా జవాబు వింటారా!"

"హోయస్!!"

"నా జవాబు కూడా అదే !"

"సుధా!"

"మధూ!"

"నిజంగా !?"

"నిజమే!"

"సుధా ! మిమ్మల్ని కాలేజీలో చూసిన మొదటి రోజునే ప్రేమించాను"

"సరిగ్గా చెప్పారు ఆగస్టు 15 వ తేదీకదూ! మీరు లిటరరీ అసోసియేషన్‌లో ఇంగ్లీషులో ఉపన్యాసం యిచ్చినరోజు!!"

"సుధా నేనెంతో అదృష్టవంతుణ్ణి!!"

"ఊహూఁ! నేను!!"

ఈ రకంగా చాలాసేపు సంభాషణ జరిగింది. అయితే దానితో మనకంతగా అవసరంలేదు కాబట్టి అక్కడితో దాన్ని వదిలేద్దాం ఇది తర్వాతి రంగం.

* * *

మధుసూదనరావు వెంకట్రావును గట్టిగా కావలించుకున్నాడు "ఒరే బ్రదర్! నేను సుధారాణిని వివాహం చేసుకోబోతున్నారా!" అన్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్ మై బోయ్! నే చెప్పాగా! యూ విల్ గో ఫారిన్ది వరల్డ్!!"

"నీకెలా థాంక్స్ చెప్పాలో తెలీకుండా వుందిరా! నీకు నేనెంతో ఋణపడివున్నాను"

"నో థాంక్సు! స్నేహితానికి ఋణమేఁవిట్రా?"

"మరి ఆ రెండో ప్రేమలేఖ ఏమైందిరా?"

"ఏమో! దాని గురించి ఏమీ నిర్ధారణగా తెలీదు అనేకమైన అభిప్రాయాలున్నాయి. కాని దేనికీ సరైన ఋజువులేదు ఋజువు దొరగ్గానే చెబుతాలే! అయినా నీ విప్పుడు దాని గురించి భయపడాల్సిన అవసరమేముంది? ఎలాగా సుధారాణిని వివాహమాడబోతున్నావుగా!"

"వెరీగుడ్! వస్తానురా!! బైబై! మళ్ళీ కలుస్తాను చాలా థాంక్స్" అని మధు వెనక్కి తిరిగాడు.

"ఒరేయ్! ఇది విని వెళ్ళు! ఆ లీలామహల్లో ఏం జరిగిందో తెలుసా?" అని వెంకట్రావు పిలిచాడు

"ఏ లీలామహలూ?"

"అదే రామ్మూర్తిగాడిమీద ప్రయోగించిన బ్రహ్మాస్త్రంమాట!"

"అది లీలామహల్ కాదురా, దీపక్‌మహల్"

"హో సారీ! ఆ దీపక్ మహల్లో ఈ రామ్మూర్తిగాడు ఇంటర్వెల్లో కాఫీత్రాగి ఎవరూ చూడ్డంలేదనుకుని ఆ గ్లాసును జేబిలో పెట్టుకొని తీసుకొని వచ్చాడట అది ప్రసాద్ చూశాడట ఇప్పుడే వాడిచేత ఈమాట చెప్పించాను."

"అందుకే అందరికీ తెలుస్తుందని వాడంత బాధపడ్డాడు పాపం! పూర్‌ఫెలో!! వస్తావ్రా! గుడ్‌బై!!"

"గుడ్‌బై"



# దేవయ్యా కథ

(27-వ పేజీ తరువాయి)

వులతో అనేవారు "మేం మీకు యేం అపకారం చేశామని యిలా యేడిపిస్తారు? అన్ని వస్తువులూ అలా నాశనంచేస్తే మీకు ఒరిగిం దేమిటి? కావలిస్తే వాటి నన్నింటినీ మీరు తీసుకుపోవచ్చునుగా? ఎం దుకు బాబూ యీ కసి!"

ఈ ధోరణిలో ప్రజలు ప్రతి మాలి గోల పెడుతుంటే, శత్రుసైని కులు వినివిని భరించలేక పోయారు. ఏదో బాధ అనుభవించారు; ఇంక ముందుకుపోలేక ఎవరిదారిని వారు పోయారు.

## 12

తన పన్నాగం ఈ విధంగా విఫలమయినందుకు పెద్ద దెయ్యానికి ఎంతకోపమైనా వచ్చేసింది. ఈ సైని కులద్వారా తెలివితక్కువ దేవయ్యాని లొంగదీయలేనని తెలిసి వచ్చింది. అందుకని పద్ధతి మార్చాడు. ఒక పెద్దమనిషి వేషం వేశాడు. దేవయ్యా ముఖ్యనగరంలో మకాం చేసాడు. ఇంతకుముందు రామయ్యాని లొంగ దీసినట్టు ఈ దేవయ్యాని కూడా డబ్బుతో లొంగదీయాలని ఊహిం చాడు.

"నేను మీకో ఉపకారం చేయా లనుకుంటున్నాను. మీకు చదువూ సంధ్యా చెప్పి తెలివితేటలు కల వారినిగా చేస్తాను. ఇక్కడే ఒక భవనం నిర్మించుకుని మీ మధ్య ఉండి మీకు సహాయపడాలనిఉంది" అన్నాడు.

"ఓ దానికేం మహాబాగు. అలాగే ఉండండి" అని అనుమతించారు దేవయ్యా.

మరునాడు ఆ పెద్దమనిషి ఒక కాగితం ఒక సంచీడు బంగారు నాణాలు పట్టుకుని నాల్గువీధుల మొగ లోకి వెళ్లాడు. "ఇదిగో విన్నారా? మీరంతా పశువులకన్నా కనా కష్టంగా బ్రతుకుతున్నారు. ఇంత కన్న దర్జాగా సరిగ్గా బ్రతకడం యెలాగో మీకు నేర్పాలని నా ప్రయత్నం. అందుకని ముందు నాకో భవనం ఈ పద్ధతి ప్రకారం కట్టి పెట్టండి. మీకు ఈ కాసులు ప్రతి ఫలంగా యిస్తాను." అని ఆ

---

ఆ రాత్రి మా వూళ్ళో హరి శ్చంద్ర నాటకం వేస్తున్నారు. నేను, మా స్నేహితుడు చూట్టానికి వెళ్ళాం. హరిశ్చంద్ర పాత్రధారి (స్త్రీ) చంద్రమతి పాత్రధారి (పురుషుడు.)

హరి:- దేవీ నావల్ల నీ కెన్ని కష్టాలు వచ్చినవి. తిండి కూడా కరవైంది.

చం:-నాథా! తిండేకాదు, కనీ సం సెకెండు హాండు బీడీ కూడా దొరకలేదు.

ఎ. రాజారావు (గుడ్లవల్లేరు)

---

కాగితంలో ఉన్న యింటి నమూనా చూపించాడు. ఆ కాసులు చూసిన దేవయ్యా ప్రజలు ఆశ్చర్యపోయారు. ఇంతకుముందు వాళ్లు అటువంటి వస్తువులు చూడలేదు. వాళ్ళకి డబ్బే అవసరం లేకపోయిందికదా! వస్తువు లనే మార్పుచేసుకునేవారు. అంతగా అవసరం అయితే పనిచేసి ఎదటివాడి బాకీ తీర్చేసేవారు. అందుకని ఆ కాసులు చూసి "భలేభలే, ఈబుల్లి బుల్లి బిళ్లలుఎంతబాగున్నాయో?" అని సరదాపడ్డారు.

దాంతో బాటు, తమ దగ్గర వస్తు వులను తీసుకువెళ్లి ఆ పెద్దమనిషికి యిచ్చి అతని దగ్గరనుంచి కాసులు తీసుకునేవారు. అతని యింటిపనికి వెళ్ళి కూలిగా కాసులు తెచ్చుకునే వారు. ఈ ముసలిదెయ్యం కూడా లావుపాటి రామయ్యా దేశంలోకి మల్లేనే కాసులు యివ్వడంలో మహా ఉదారంగా ఉండేది. దీంతో ప్రజలు అదేపనిగా వస్తువులు తెచ్చేసేవారు. ఏపని కావలిస్తే ఆ పని చేసిపెట్టేసే వారు.

ఇది చూసిన పెద్దదెయ్యం ఎంతో మురిసిపోయింది. "ఇప్పటిదాకా అంతా నవ్యంగానే ఉంది మరి. ఇలాగే అయితే రామయ్యాలాగే దేవయ్యాని కూడా దెబ్బకొట్టినట్టే! ఈ దెబ్బతో దేవయ్యా దిగిరావల సిందే" అని అనుకుని సంబరపడేది.

కాని అంతలోకే పరిస్థితి తారు మారై ఊరుకుంది. అందరికీ తగి నన్ని కాసులు దొరకడంవల్ల, ఆ తెలివితక్కువ వాళ్ళంతా కాసుల్ని ఆడవాళ్ళకి నగలు చేయించుకో డానికి యిచ్చేశారు. ఇంకా మిగిలిన కాసులు పెట్టి కుర్రాళ్ళు వీధుల్లో గోలీలులా ఆడుకునేవారు. ప్రతి వాడికీ బోలెడన్ని కాసులు రావడం వల్ల యింక వస్తువులు తీసుకువెళ్లడం మానేశారు. పనిలోకి వెళ్ళడం అంతకుముందే మానేశారు. అందు వల్ల పాపం ఆ పెద్దమనిషి భవనం సగంలోనే ఆగిపోయింది. వస్తు సామగ్రికూడా యేడాదికి సరిపడి నది పూర్తికాకుండానే రావడం ఆగి పోయింది. అక్కడికీ మళ్ళీ రమ్మని అతడు ప్రజలను ఎన్నివిధాలో పిలి చాడు. ఇంకా వస్తువులు తీసుకు రమ్మని ప్రోత్సహించాడు. ఎంత బంగారం కావలిస్తే అంతా యిస్తా నన్నాడు. (సశేషం)

# చదువుకున్న అమ్మాయి

(24 వ పేజీ తరువాయి)

కనా ? లొట్టిపిట్టలాగ ఎంత జాగా ఉంటే అంతా తామే ఆక్రమించాలని చూస్తూ, పైగా ఈ దెప్పు లేమిటి అనుకొని చదువుకున్నమ్మాయి విసుక్కుపోయింది.

* * *

"చదువుకున్నాక అస్తమానం వంటింట్లోనే ప్రొద్దుపుచ్చమనటానికి మనకు మాత్రం నాలి కెలా ఆడుతుందిలెండి ?"

ఆడద్దని చదువుకున్నమ్మాయికీ తెలుసు తెలి వంటే అలాగుండాలి ! ఉదారత ప్రకటిస్తూ, వంట ఉద్యోగం రెండూ అప్పగించటానికేగా ఈ ఎత్తు !

అమ్మాయికి చదువు చెప్పించాం కదా, అంత కన్నా కట్నం ఏమిటి అంటాడు నాన్న.

"బాగుందండోయ్ ! మీ అమ్మాయికి మీరు చదువు చెప్పించుకుంటే మధ్య నాకేం ఉద్ధరింపు? నా కట్నం డబ్బులేవో నా ముఖాన పారేస్తేనేగాని ఈ పెళ్లి జరగదు."

ఇదేం ఎగతాళి వ్యవహారం కాదని, తాళి కట్ట డానికి అంత 'రేటు' కు నయాపైస తగ్గించి పుచ్చుకోనని అతడు నిక్కచ్చిగా చెప్పేశాడు.

ఆరేటు విన్న చదువుకున్నమ్మాయి నాన్న ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు.

"దీనికి చదువు చెప్పించకుండా చిన్నప్పుడే పెళ్లి చేసివుంటే ఈ కట్నం డబ్బుల్లో నాలుగో వంతు కూడా ఖర్చయ్యేదికాదు" అంటూ మొత్తుకున్నాడు చదువుకున్నమ్మాయి చాటుగా కళ్ల నీళ్లు వత్తుకుంటుంది. కట్నం ఒక్కసారి యిచ్చుకోలేక వాయిదాగా చదువుమీద ఆ వంతు చెల్లిస్తే చాలదా అనుకున్నాడు అమాయకుడైన నాన్న

* * *

"వాళ్లకేం రాజా బ్రతుకులు అరగంట లేటుగా వచ్చినా అడిగేవాళ్లుండరు. చిలకల్లా ముస్తాబై వచ్చి సీటులో కూర్చుంటే చాలు. పని చెయ్యాలా, ఏమన్నానా ?"

పనిమనిషి రాక పనులన్నీ చక్కబెట్టుకుని హడావుడిగా పరుగెత్తుకుని వచ్చేసరికి ఒక్క పావుగంట లేటయ్యింది. దానికి కొలీగ్సు ఇలా చెవులు కొరుక్కుంటే మాత్రం చేసేదేంవుంది ? కాస్త శుభ్రమైన చీర కట్టుకుంటే చూడలేరుగదా ? బికారి వాళ్లలా మట్టికొట్టుకున్న బట్టలతో, మాసిన గడ్డాలతో వాళ్లని మాత్రం రమ్మన్న దెవరు ? ఆడవాళ్లను పూరికే కుర్చీలో కూర్చోబెట్టి మేపుతున్నట్టు ఎందుకో ఆ విసుర్లు ?

సాయంత్రం ఇంట్లో అంట్లన్నీ ముందు పడేసుకుని అరగదీస్తున్న చదువుకున్నమ్మాయికి ఫకాలున నవ్వొచ్చింది. ఆఫీసులో కుర్చీ ఎక్కి దర్జాగా ఫైళ్ళు తిరగేసే అమ్మాయి—ఇక్కడ క్రింద కూలబడి అంట్లతో అవస్థపడటం—బాగానే ఉన్నాయి అవతారాలు అనుకుంది.

"ఇదుగో చూడు ! ఎవడి తర్వాత ఎవడు రాజ్యం ఎక్కాడో, ఎవడెన్నిసార్లు దండయాత్రలు చేశాడో చదువుకుంటే ఒరిగేదేముంది ? నిక్షేపంలా హోంసైన్సు చదువుకునివుంటే ఆ మసి వదల్చటానికి ఇంత శ్రమ పడనక్కరలేకపోయేది కదా ! ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు. ఆ గ్రూపు తర్వాతే హిస్టరీ చదివినా, మరేది చదివినా "

'హోంసైన్సు' చదువుకున్న అమ్మాయి తటస్థపడలేదు కాబోలు, ఎంత దుర్దశ అనుకుని తటస్థంగా పూరుకుంది 'కుట్లు' గ్రూపు ఎక్కడన్నా ఉందో లేదో కాని అది చదువుకునివుంటే ఆయనగారి చొక్కాలు, పంట్లాలు తనే కుట్టార్సి వచ్చేది. ఇంటిల్లిపాదికీ తను తీరిక, జీతం, బత్తెం లేని దర్జీ అయిపోయేది ఎంత సేవ చేసినా, ఎలాటి సేవ చేసినా సంతోషించకుండా స్వీకరిస్తారు కదా మగవాళ్ళు, అనుకుంది చదువుకున్నమ్మాయి లోలోన.

"స్నేహితు డొకడు వచ్చాడు కాని వాడితో అలా తిరిగి వస్తాను ఇంటికి వచ్చేటప్పటికి ఎంతవుతుందో చెప్పలేను "

రాత్రి పదకొండైనా, పన్నెండైనా బంట్రోతులా పిలుపు వినపడేసరికల్లా తలుపుదగ్గర హాజరు కావాలని 'హెచ్చరిక' ఇస్త్రీ మడతలు వేసుకుని, జోళ్ళు టకటక లాడించుకుంటూ వీధిలోకి నడిచిన 'యజమాని'ని చూసి భారంగా నిట్టూర్చింది చదువుకొన్న 'దాసి '

ఇంటిదగ్గర ఇంత గౌరవం ! ఆఫీసులో అంతకన్నా గౌరవం ! సరోజ మెటర్నిటీ లీవ్ పెట్టినప్పుడు బాస్ "ఈ ఆడవాళ్లతో ఇదొకటి ఏడాదికొకసారి 'మెటర్నిటీ లీవ్' పడేస్తారు. మధ్య మధ్యలో నీరసాలు, సున్నితాలు అసలు ఆఫీసులో ఆడవాళ్లను చేర్చటం ఎందుకయ్యా అంటే వింటేనా ?" అంటూ పై అధికారిపైన విసుక్కున్నాడు.

ఇప్పుడు తనూ .... మెటర్నిటీ లీవ్ . . అతడు విసుక్కున్నా, సణుక్కున్నా తప్పదు. లీవ్ తర్వాత పాపను ఉయ్యాల్లో వేసి పరుగెత్తాలి గాబోలు. చిరాగ్గా అంట్లముందరినించి చేతులు కడుక్కుని లేచి గదిలోకి వచ్చింది చదువుకున్నమ్మాయి. ఒకనాటి 'వంటింటికుందేలుకు' నేడు దాస్యం తొలగిందా, పెరిగిందా అని అనుమానం వేసింది. ముఖంమీదా, చీరమీదా మసి మరకలతో, భారమైన హృదయంతో అద్దంముందు నిలబడ్డ చదువుకున్నమ్మాయిని చూసి చేతుల నంటిపెట్టుకున్న దిట్టమైన బంగారు సంకెళ్ళు, నగిషీలతో జిగేలుమంటూ పకపకా నవ్వాయి.



# ఆదర్శాలు-ఆంతర్యాలు

(23-వ పేజీ తరువాయి)

చలమయ్యమటుకు నరసింహప్పకు తీసిపోయాడా? తనూ ఒక బుర్రకథ బృందాన్ని పిలిపించాడు—మరో చోటునుంచి. చలమయ్య బుర్రకథ బృందంలో ఒక స్త్రీ ఉండటం ప్రత్యేక ఆకర్షణ అయింది. నరసింహప్ప హరికథల పేరుతో ఎన్నికల ప్రచారం సాగిస్తే చలమయ్యా అ పంథా అవలంబించాడు. తమ పార్టీ నాయకులను పిలిపించి ఉపన్యాసాలిప్పించాడు. రంగపాండు ఆయనకు కుడిభుజంగా పని చేస్తున్నాడు. ఆయన ప్రచారాన్నిచూసి రాజారావూ, పోలయ్యలు నవ్వుకున్నారు. ప్రభుత్వపక్షం విజయానికై పత్రికలు కూడా విరివిగా ప్రచారం ప్రారంభించాయి. ఒక పత్రికలో ఎవరో కలంపేరుతో ప్రభుత్వపక్షాన్ని గెలిపించమని ప్రచార గీతాలు అదేపనిగా వ్రాస్తున్నాడు. మిగతా పార్టీల వారు ఊరుకుంటారా ? వాళ్ల పత్రికలలో కూడా ప్రతిపక్షంవారిని దుయ్యపడుతూ, తమ పార్టీ ప్రచార గీతాలు ప్రారంభించారు. అంటే కొంతమంది కవులుకూడా పరోక్షంగా ఎన్నికల ప్రచారం ప్రారంభించారన్నమాట. ఈ పరిస్థితులలోనే ఎప్పుడో జరుపుకోవలసిన జిల్లాపార్టీ వార్షికోత్సవాన్ని ఇప్పుడే జరిపించడానికి చలమయ్యవర్గం నిర్ణయించింది. ఇంకేం పెద్దపెట్టున ఉత్సవం ప్రారంభించారు. అందులో ముఖ్య విశేషం వర్షికోత్సవం రాత్రి పంచభాషా కవిసమ్మేళనం. కాంట్రాక్టు నాటకంలాఉంది ఈ కవిసమ్మేళనం ఏర్పాటు. వచ్చిన కవులందరికీ సెకండుక్లాసు ఛార్జీలు, భోజన వసతులు ఏర్పాటు చేశాడు చలయ్యమ్య అంతేకాదు కవులను శాలువలతో సత్కరించాలని కూడా కరణం, రంగపాండు సలహా ఇచ్చారు 'ఓ—దానికేం' అన్నాడు చలమయ్య

"పంచ కషాయంలా, ఈ పంచభాషా కమి సమ్మేళనం ఏమిటి ?" అని నరసింహప్ప నవ్వుకున్నాడు

"మరి దీనికి ప్రతిగా మనమేం చేద్దామంటారు' అని మునసబు నరసింహప్పను ప్రశ్నించాడు

"ఏమీ వద్దు . . ." అన్నాడు నరసింహప్ప

"అదేమిటీ . దొరవారు చప్పబడితే ఎట్లా? ప్రచారంలో మనది పైచెయ్యిగా ఉండాలన్నారుగా"

"అదేరోజు రాత్రికి మనం డాన్సు ప్రోగ్రాం ఏర్పాటుచేస్తే. . . . . "

"అద్భుతంగా ఉంటుంది . . . కవి సమ్మేళన దగ్గరి జనమంతా ఇటు మళ్లుతారు" చిటికవేస్తూ అన్నాడు మునసబు

"కాని సందర్భమేమిటి ? .అయినా ఈ డాన్సు ప్రోగ్రాం మనం ఏర్పాటు చేసినట్టు తెలియ కూడదు అక్కడ మన ప్రచారం కూడా అనవసరం ఇది కేవలం కవి సమ్మేళనాన్ని వెడగొట్టడానికే డబ్బు ఇచ్చే బాధ్యతమటుకే నాది మిగతా ఏర్పాట్లతో మనకు సంబంధం ఏమాత్రం లేనట్టుండాలి" అన్నాడు నరసింహప్ప

"నేనంతా ఏర్పాటు చేస్తాగా ఇంత డబ్బు ఎలాగూ ఖర్చుపెడుతున్నారు తీర్థం ప్రసాదం రెండూ ఉండాలి అందుకని ఈ నృత్య ప్రదర్శనం మీ అధ్యక్షతలో అని ఏర్పాటు చేయిస్తా" లౌక్యాన్ని తెలుపుతూ అన్నాడు మునసబు

"సరే . . ఆలోచిద్దాంలే" అన్నాడు నరసింహప్ప అనుకున్న ప్రకారమే అటు పంచభాషా కవి సమ్మేళనం, ఇటు నృత్య ప్రదర్శనం రెండూ ఒకే రాత్రి ఏర్పాటు చేయబడ్డాయి. కవి సమ్మేళనం ఇంకో రెండు రోజులున్నదనగా అదేరాత్రి నృత్య ప్రదర్శనం ఉన్నదన్న సంగతి తెలిసింది చలమయ్య వర్గానికి ఈ ప్రదర్శనం ఏర్పాటు చేసింది ఎవరో రూఢిగా తెలియలేదు కాని, నరసింహప్పని అనుమానించారు

"పోనీ మనం కవి సమ్మేళనం మరునటిరోజు పెట్టుకుంటేనో" అన్నాడు రాజయ్య.

"అదెట్లా. . . . .అన్ని ఏర్పాట్లూ చేసుకుంటిమి. ఆ మరునాడంటే పట్నంనుంచి వచ్చే కవులు ఒప్పుకోరనుకుంటా. . . .సరే—ఏమవుతే అవుతుంది మనం అనుకున్న ప్రకారం జరిపిద్దాం" అన్నాడు చలమయ్య

రాత్రి ఎనిమిది గంటలకు కవి సమ్మేళనం ప్రారంభించారు.

---

సతీమణి సమక్షంలో—

బావగారు:-మీ అక్క నాకే మవుతుంది?

ఐదేళ్ల బావమరిది:-(ముద్దుగా) "మొగుడు"—

పి లక్ష్మణాచారి (ఖర్గపూర్)

---

కవి సమ్మేళనం ప్రారంభించిన అరగంటకల్లా హైస్కూలు ఆవరణంలో నృత్య ప్రదర్శనం ఆరంభమైంది అందులో ఉచిత ప్రదర్శనం జనం చాలామంది అక్కడికే వెళ్లారు. కవి సమ్మేళనం చూడటానికి వెళ్ళినవారు "ఇక్కడికెందుకు వచ్చామా" అనుకున్నారు. పదగుంభనతో సమాస భూయిష్టమైన పద్యాలు సామాన్య ప్రేక్షకులకేం అర్థం అవుతాయి ? గీతాలు వింతగా తోచాయి. కన్నడం, మహారాష్ట్ర కవుల, ఉర్దూ, హిందీ కవిత్వాలు అర్థంకాకపోయినా, తోటకవులు పలికే 'వహ్వా'లు, వాళ్ళుచూపే లబ్జు రమ్ములు కొంత సేపు ప్రేక్షకుల్ని ఆకట్టాయి. సభికుల్లో చాలామంది లేచి నృత్యప్రదర్శనానికి వెళ్ళారు. మిగిలినవారి సంఖ్య చాలా అల్పం వాళ్ళయినా చలమయ్యగారి ముఖమాటానికి ముళ్లపైన కూర్చున్నట్టుగా ఉన్నారు.

నృత్యప్రదర్శనం ఊళ్లోని జనాన్ని చాలా మందిని ఆకర్షించింది నరసింహప్ప మునసబుతో మామూలు ప్రేక్షకుడిగానే వెళ్ళాడు. మునసబు ప్రోత్సాహంవల్ల నరసింహప్ప ప్రదర్శనం మధ్యలో వేదికమీదకు వెళ్ళి ఒక నర్తకికి ఒక పతకం బహూకరించాడు. అంతే. . . .ప్రదర్శకులు సభికుల ఎదుట నరసింహప్పగారి రసజ్ఞతను, ధర్మగుణాన్ని ప్రస్తుతించారు. 'ఇంతకంటే మనకేం గావాలి' మునసబు నరసింహప్ప చెవిలో అన్నాడు. ఆయన నవ్వి ఊరుకున్నాడు.

ఏ ఆడంబరమూ లేకుండానే పోలయ్యకు ప్రచారం జరుగుతున్నది.నరసింహప్ప, చలమయ్యగార్ల ప్రచారపు ఆర్భాటాలు చూస్తున్న ప్రజల్లో ఒక విధమైన ఏవగింపు కూడా కలిగింది

పోలయ్య, రాజారావులమీదఉన్న అక్కసు చలమయ్యకు రోజురోజుకు ఇనుమడించడమేగాని తగ్గడంలేదు. సమయంవస్తే తన కసి తీర్చుకుంటానికి కుతంత్రాలు పన్నుతూనే ఉన్నాడు. తను ఆరోజు వేసిన పథకం రాజారావు ఎలా పసికట్టాడో చలమయ్యకు అప్పటికీ అర్థం కాలేదు.

ఇందిరభర్త భాస్కరం అమెరికానుంచి తిరిగి వచ్చాడు. లలిత తేరుకున్నా, ఇంకా రుగ్మతగానే ఉంటున్నది. అలాగే పరీక్ష ఇచ్చింది భాస్కరంతో మరో రెండు రోజుల్లో వెళ్ళిపోతున్నాననీ, ఒకసారి వచ్చి పొమ్మని రాజారావుకు శాయిలుతో కబురుచేసింది ఇందిర.కబురైతేచేసింది కానీ అతనువస్తాడన్న నమ్మకం కలగలేదు. దానికి తగినట్టే శాయిలు తిరిగివచ్చి రాజారావుఇంట్లో లేడని చెప్పాడు. లలిత పరిస్థితి ఆమెను మరీ ఇరుకునపడేసింది. భాస్కరంతో అన్ని సంగతులతోపాటు లలిత రాజారావును ప్రేమించడం గురించి, రాజారావు విషయాలు చెప్పింది. "అయితే మనమే వెళ్ళి రాజారావును చూద్దాం" అన్నాడు భాస్కరం. ఆ రోజు సాయంత్రమే ఇందిర, భాస్కరాలు రాజారావు ఇంటికి బయలుదేరారు వాళ్ళను గుమ్మంలో చూసి రాజారావు ఆశ్చర్యంతో రాట్నంప్రక్కకుపెట్టి లోపలకు ఆహ్వానించాడు

రాజారావును భాస్కరానికి పరిచయంచేస్తూ, "ఆ పరీక్ష నాలుగు రోజులూ వీరు శ్రద్ధ తీసుకోబట్టి ప్యాసవుతానని నమ్మకంగా ఉంది" అంది ఇందిర.

భాస్కరం రాజారావును అభినందించాడు. పరోక్షంగా అతను దేశానికి చేస్తున్న సేవను ప్రశంసించాడు "మీవంటివారిని అల్లుడుగా చేసుకుంటానికి మామగారు' ఎందుకు సందేహిస్తున్నారో నాకు అర్థంకావడంలేదు . . ఈ ఎన్నికల హడావిడి కానివ్వండి—ఆ వ్యవహారం నేనూ, మా బావమరది ప్రసాదూ పరిష్కరిస్తాం" అన్నాడు భాస్కరం.

"ఇందిర అన్నీ చెప్పేసిందన్నమాట, తన అభిప్రాయం తెలిసి కూడా" అని అనుకుంటూ రాజారావు ఆ ప్రస్తావన మార్చాడు.

"శారద దగ్గరినుంచి పోలయ్యకు ఉత్తరమేమైనా వచ్చిందా ?" అంది ఇందిర

"వచ్చింది . . .పోలయ్య ఎన్నికలలో గెలుస్తాడని తనకు గట్టి నమ్మకం ఉందనీ, ఆ దినంకోసం తనూ—తండ్రీ ఎదురు చూస్తున్నామనీ వ్రాసింది" అన్నాడు రాజారావు.

"పోలయ్య పెళ్ళికి అధ్వర్యం మీదే కాబట్టి మరచిపోకుండా మాకు శుభలేఖ పంపాలి" అంది ఇందిర.

"పనిలో పని. . . .లలిత పెళ్ళికూడా ఒకేసారి జరిపిస్తే బాగుండు మీ నాన్న. . . మనం రెండుసార్లు రావడంతప్పుతుంది"అన్నాడుభాస్కరం.

"క్షమించండి. . . . నాకు మరో పనుంది వెళ్ళాలి" అన్నాడు రాజారావు

"మీరంతా పొగిడే పోలయ్యను ఒకసారి చూడాలని ఉంది నాకు"

"తప్పకుండా"

"సరే—మేం వస్తాం" అంటూ ఇందిర,

# ఆదర్శాలు-అంతరాలు

భాస్కరం బయటకు వచ్చారు వాళ్ళవెనకే రాజారావు తాళంపెట్టి బయలుదేరాడు

నిజానికి అప్పుడు రాజారావుకేంపనిలేదు ఇందిర, భాస్కరం సంభాషణ అతనికి నచ్చలేదు. వాళ్ళను తప్పించుకోటానికి మరో అవసరమైన పనుందనిచెప్పి వాళ్ళవెనకే తాళంపెట్టి బయలుదేరాడు. వీధి చివరకు వచ్చిన తర్వాత "ఎక్కడికి పోదామా' అని ఆలోచించాడు.

"చాలారోజులైంది—అలివేణిని చూసి . వెడితే బాగుండు. . . .చలమయ్యగారు అక్కడ ఇప్పుడెల్లాగూ ఉండడు" అనుకున్నాడు రాజారావు

రాజారావు నడుస్తున్నాడు. అతని ఆలోచనల్లో ఆ రోజు అలివేణి ఇంట్లో జరిగిన సంఘటన మెసిలింది

"తనలో కృష్ణుణ్ణి చూశానంది ఎలా చూడగలిగింది ? రాధ ప్రేమలాంటిదా అలివేణి ప్రేమ తన చేతుల్ని ముద్దుపెట్టుకోవడంలో ఉద్దేశ్యమేమిటి ? ఆ క్షణంలో ఆమె పొందిన అనుభూతి ఏమిటో ? ఆమె తనమీదకు వంగి ఫాలాన్ని ముద్దుపెట్టుకునేప్పటికి తను వివశుడైపోయాడు ఆమెను దగ్గరగా తీసుకోబోయాడు అంత మనోవికారంలో కూడా తాను ఏదో తప్పు చేయబోతున్నట్టు ఎలా తెలుసుకోగలిగాడు ?" అని తర్కించుకుంటూ నడుస్తున్నాడు.

"తన జీవితంలో అది మరచిపోని మధుర ఘట్టం" అనుకున్నాడు

మరికొంత సేపటిలో రాజారావు అలివేణి ఇల్లు చేరాడు గుమ్మంలోనే లక్ష్మి ఎదురై "పైకిరండి" అంటూ ముందు నడిచింది.

అలివేణినిచూసి ఆశ్చర్యపడ్డాడు రాజారావు ఆమె అలంకరణలో వెనుకటి ఆడంబరంలేదు. ఆమె చూపుల్లో వెనుకటిలాగా మొగవాళ్ళను కవ్వించే చిలిపితనంలేదు.

"నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియుటంలేదు అలివేణి" అన్నాడు రాజారావు.

"నేను చేసిందేముంది ? . . . నా ధర్మం నేను నెరవేర్చాను" స్నిగ్ధంగా నవ్వుతూ అంది అలివేణి

"అధర్మంలో కూడా ఎంతో త్యాగం ఉంది అలివేణి ! నీ ప్రాణాలకు కూడా తెగించి ఆరోజు నాకు ఉత్తరం వ్రాసిపంపావు. నన్నూ—ముఖ్యంగా పోలయ్యనూ కాపాడావు. ఈ విషయం చలమయ్యగారికి తెలిస్తే నిన్ను బ్రతకనిచ్చేవాడా ? నిజంగా నేను ఏంచేసినా నీ ఋణం తీర్చుకోలేను" అన్నాడు రాజారావు

"ఆ ఋణం తీర్చుకోవాలని మీకు అంతగాఉంటే నాకు ఒక సహాయం చేసిపెట్టండి రాజారావు గారూ"

"ఏమిటది ?. చెప్పు అలివేణి . . . . . . . తప్పకుండ చేస్తాను"

"నాకు చలమయ్యగారితో ఉండటం విసుగు పుట్టింది మీ పరిచయంవల్ల జీవితమంటే ఏమిటో ఆలోచించగలిగాను. ఇప్పటిదాకా నేను గడిపింది చచ్చు జీవితమనీ, దీనికో అర్థం లేదనీ తెలుసుకున్నాను. చలమయ్యగారి చర్యలు నాకు ఏవగింపుగా ఉన్నాయి. స్వతంత్రంగా జీవితం గడపాలనిఉంది పవిత్రంగా బ్రతుకు వెలార్చుకుందామని ఉంది బొత్తిగా అక్షరంముక్కరానిదాన్నిగాను. ఎనిమిదవ తరగతివరకూ చదివాను సంగీతం వృత్తిగా పెట్టుకొని పొట్ట గడుపుకోడానికి నిశ్చయించుకున్నా దానికి మీ సహాయం కావాలి నన్ను ఈ పంజరంలోంచి తప్పించాలి" అంది అలివేణి

"నీలో ఇంతమార్పు కలగడం నాకు చాలా సంతోషంగా ఉంది అలివేణి! నీకు తప్పకుండా సహాయంచేసి నా కర్తవ్యాన్ని నెరవేర్చుకుంటాను" అని హామీ ఇచ్చాడు రాజారావు

"ఉండండి—ఇప్పుడే వస్తాను" అంటూ అలివేణి లోపలకు వెళ్ళింది

"ఎక్కువ చదువు, సంస్కారం లేకపోయినా, కశ్మలమైన వాతావరణంలోపుట్టి పెరిగినా అలివేణి చాలా తెలివిగలది ఆరోజు జరిగిన సంఘటనే ఆమెలో ఈ మార్పు తీసుకొనివచ్చి ఉంటుంది. ఆమె పాట వింటూ ఆనాడు తానెంత వివశుడయ్యాడో పాటలో అలివేణి కూడా అంత వివశమై ఉంటుంది. ఇప్పుడు ఈమెను చూడాలని ఎందుకు బుద్ధి పుట్టింది తనకు? వెనుక ఈమె దగ్గరకు రావడానికే భయపడేవాడే తను? ఆమెలో ఆనాడు కలిగిన మార్పు, చేసిన త్యాగం తనను ఆకర్షింపచేశాయి. అయితే తనదీ, అలివేణిదీ పవిత్రమైన ప్రేమయా? అని ఆలోచిస్తున్నాడు రాజారావు.

ఇంతలో అలివేణి వెండిపళ్ళెంలో అరటిపళ్ళు, ఇంకేదో ఫలహారం తీసుకువచ్చిపెట్టింది

"ఇప్పుడివన్నీఎందుకుఅలివేణి!"అన్నాడురాజారావు.

"మీకు కావలసినంతమటుకు తీసుకోండి తీసుకుంటేనేగాని నాకు తృప్తిగా ఉండదు" అంది అలివేణి చిరునవ్వుతో ఆ నవ్వులో మాలిన్యంలేదు ఆమాటల్లో వెనుకటి చలోక్తిలేదు, అనిపించింది రాజారావుకు.

"నన్ను గురించి ఎక్కువగా వూహించుకోకు అలివేణి . . నేనూ సాధారణ మానవుణ్ణే. నాలోనూ కాంక్షలూ, ఆవేశాలూ ఉన్నాయి. ప్రలోభమూ లేకపోలేదనుకుంటాను వీటికి అతీతుడిగా ఉండాలనే నా ప్రయత్నం" అన్నాడు రాజారావు ఫలహారంచేస్తూ.

అలివేణి మౌనంగా వింటూ కూర్చుంది

"నిన్ను నీవు తెలుసుకున్నావు అలా తెలుసుకోవడంలో చాలా గొప్పతనంఉంది. ఎంతో మంది తమను తాము తెలుసుకోడానికి ప్రయత్నించరు ప్రయత్నించినా లోపలఉన్న గిజిగాడు అందుకు సందివ్వడు కాని నీవు ఇప్పుడు చలమయ్యగారిని, ఆయన చర్యలను ద్వేషిస్తున్నావు ఆ ద్వేషాన్ని తగ్గించుకో జాలిపడు ఆయన ఏ పరిస్థితులలో అలా చేస్తున్నాడో వూహించు వీలైతే ఆయనను మార్చడానికి ప్రయత్నించు" అన్నాడు రాజారావు

"ఆయన అంత సులభంగా మారేరకమా ? ... ఏది ఎలాఉన్నా. . . ఇక ఆయనతో ఎక్కువకాలం ఉండలేనేమోననిపిస్తున్నది . . . అందుకై నా కాళ్ళపై నేను నిలబడాలనిఉంది . నాకు మీ సహాయం కావాలి"

"సరే. . . .వస్తా ." అంటూ రాజారావు లేచాడు అలివేణి నమస్కరించింది గుమ్మం వరకూ సాగనంపుతూ. (సశేషం)

# మా హాస్టల్లో ఒకరోజు

(19వ పేజీ తరువాయి)

మా పెద్ద దిక్కుతో అలా చిన్న షికారెళ్లి ఏ ఆపదలూ లేకుండా హాస్టలు చేరుకున్నాం హాస్టలు చేరుకునేసరికి దీపాలు వెలుగుతున్నాయి. మా పెద్ద దిక్కు మమ్మల్ని పైకి వెళ్లమంది మేం మేడ మీదకెళ్లి ఏదో కబుర్లు చెప్పుకున్నాం ఆ కబుర్లలో మా ఇంగ్లీషు లెక్చరరు గండుపిల్లి, అసిస్టెంటు వార్డను వామనమూర్తి మొదలైనవారందరూ కూడా వచ్చారు. ఒకటే నవ్వులు. ఒక్కటే వెక్కిరింతలూ ఎనిమిది గంటలుకి భోజనం ముగించుకున్నాం

నిర్మల పుస్తకాలు ముందర వేసుక్కూచుంది నేను రికార్డులు ముగించుకున్నాను గంట తొమ్మిదిన్నర అయింది అంతవరకూ అక్కడ అక్కడా నవ్వులు అవీ విన్పిస్తూ ఉన్నవి అన్నీ ఒక్కమారు ఆగిపోయాయి. అందరు పుస్తకాలు ముందర వేసుక్కూర్చున్నారు చదివినా, చదవకపోయినా ప్రతివారూ పుస్తకం హస్తభూషణం అన్నట్టుగా పట్టుక్కూర్చున్నారు నళిని నన్ను మోచేత్తో పొడిచి "ఇది స్టడీ అవరు 8—30 నుంచి 11—30 దాకా ఆవిడగారు ఇంక దిగుతుంది చదువుతున్నామా లేదా పరీక్షించడానికి ఎప్పుడు వచ్చినా రాకపోయినా ఇప్పుడు తప్పక వస్తుంది. 9—30 ప్రాంతంలో రాకమానదు" అంది ఇంతట్లోగా మెట్లమీద జోడు చప్పుడవడం, వార్డను దాని వెనక్కాలే రావడం జరిగింది ఇన్‌స్పెక్షను ముగించి దిగి వెళ్లగానే నళిని "నిర్మలా ఎప్పుడైనా నువ్వు విన్నావా గంట ముందర విన్పించి తర్వాత ఏనుగు వస్తుందని అలాగా జోడు చప్పుడు ముందర విన్పించి తర్వాత మన కరిరాణి వస్తుంది" అంది మా నళిని పేర పెట్టని మనిషే లేదేమో అన్పించింది నాకు వార్డను లావుగా, నల్లగా ఉంటుంది అందుకని కరిరాణి అని పేరుట

11—30 దాకా రికార్డు వేసుకుంటూ కబుర్లు చెప్పుకున్నాం. 11—30 కి దీపాలు ఆర్పేశారు అప్పుడు దీపాలు ఆర్పితీరాలట వీళ్ల అన్ని రోజులు చదవక పరీక్షలు అప్పుడు రాత్రంతా చదువుతారట. మా నళిని ఆ కోవకి చెందినదే నిర్మల ఎప్పటికి అప్పుడు చదువుకుంటుంది పరీక్షలప్పుడు పదకొండు గంటలకి ఆర్పినట్లే ఆర్పి గది తలుపు మూసేసి లోపల టేబులులైటు వేసుకు చదువుతుందిట నళిని

శని, ఆదివారాలు బయటికి వెళ్లేమాటయితే పుస్తకంలో ఎక్కడికి వెళ్లేది, ఎప్పుడు వచ్చేది రాయాలిట నా మట్టుకి నాకు ఈ పద్ధతులవల్ల లాభం ఏం కనపడలేదు సరిగ్గా ఉండనేరని ఆడపిల్లలు హాస్టలు బయట ఏం చేస్తున్నదీ వార్డనకెలా తెలుస్తుంది అనవసరంగా ఆంక్ష పెట్టి లాభం ఏముంది బాబాయిని చూడటానికి వెళ్లతానని రాసి తన కన్వీనియంటు కజినుని చూడొచ్చుగా మరి ఈ రాతకోత లెందుకో అన్పించింది మర్చిపోయా. ఎవరేనా ఆడపిల్లకి ఫ్రెండు ఉన్నా చాలా సులభంగా కజిను అని చెప్పేస్తుందట ఇంగ్లీషులో కజిను చాలా సులభంగా వాడేస్తారు అందుకే ఏడిపించాలనుకున్నప్పుడు 'కన్వీనియంట్ కజినా' అంటారు మిగిలేవాళ్ళు

ఎదిగిన ఆడపిల్లలకు వాళ్ల బాధ్యతలు వాళ్లకి తెలియాలి వాళ్లని వాళ్లే దిద్దుకోవాలి అనవసరమయిన ఆంక్షలు కూడా అనర్థాలకి దారి తీస్తాయి హాస్టల్సులో స్నానాలగదుల విషయాల్లోనూ, భోజనం విషయంలోనూ, మిగతా సదుపాయాల విషయాల్లోను ఇంకా శ్రద్ధ చూపించాలి అన్పించింది నాకు మర్నాడు పొద్దున్న నాకు టెలిఫోను వచ్చింది నాన్న తను వచ్చేశానని సాయంత్రం కారు పంపిస్తానని అన్నారు

ఆ సాయంత్రం కారు రాగానే నళినికి వాళ్లకి చెప్పి బయల్దేరుతుంటే నాన్న నిర్మలతో 'ఏవమ్మా! నిన్న రాత్రి వచ్చాం. నిన్న రాత్రి నుంచి ఫోను చేస్తుంటే అస్తమానం ఎంగేజి సిగ్నల్ వచ్చింది" అన్నారు అప్పుడు నిర్మల చెప్పింది "అనవసరంగా ఎవరేనా మగవాళ్లు ఫోను చేస్తారు ఆ బాధ భరించనేరక మేం టెలిఫోను రిసీవరు తీసి క్రింద పెట్టేస్తాం. అలాంటప్పుడు ఎంగేజ్డు సిగ్నల్ వస్తుంది ఒక్కొక్కప్పుడు ముఖ్యమయిన కాల్సు కూడా అలాగే తప్పిపోతాయి" నాన్న "అదీ నిజమే" అన్నారు సాలోచనగా "కారులో కూర్చున్నాక మీ అమ్మ నన్ను చాలా బాధపెట్టిందనుకో. నిన్న రాత్రికి ఇంటికి చేరుకున్నాను" అన్నారు. హాస్టలు వార్డనుని అమ్మని పోల్చుకుంటూ హాయిగా అమ్మ పురమాయించే వంటల్ని ఆలోచించుకుంటూ ఇంటికి చేరుకున్నాను ఒక్కరోజు హాస్టలు కట్టుబాట్లు చూసినమీదట మా యింటి స్వేచ్ఛా వాతావరణం, నాకు హాయిగా ఉంది మా యింటి ముందర గడ్డి మరీ పచ్చగా కన్పించింది 



**చదివితేనే రావాలని విద్యాగలదే
ముద్దార నేర్పించినవే...**


















# విదేశీ ఆహారాలు

(28-వ పేజీ తరువాయి)

పచ్చి పదార్థాలలో కూడా మళ్ళీ రెండు రకాలుగా ఉంటాయి. కూరలూ, బటానీలూ, మొక్కజొన్న, యాపిల్ మొదలైనవి తరిగి వండటానికి సిద్ధంగా ఉన్నవీ, తరగకుండా ఉన్నవీ కూడా ఉంటాయి. తరిగినవన్నీ పాకెట్లలో ఉంటాయి ప్రికుక్‌డ్ పదార్థాలు వండటం తేలికైనా, రుచిగా ఉండవనిఎక్కువమందివాటిని వాడరు. ఇక్కడ పళ్ళూ, పాలూ, వెన్న కారుచౌక మరీ యాపిల్స్ సుమారు మన అణాకి ఒకటి యిస్తారు.

మరొక తేడా, వాడే మసాలా దినుసులలో— ఇక్కడ అన్ని దినుసులూ కాటుకలా మరపట్టి 1 ఔన్సు డబ్బాలలో అమ్ముతారు. ఉల్లి, వెల్లుల్లి వంటివి పచ్చి పదార్థాలు వాడక్కరలేకుండా ఆనియన్, గార్లిక్ సాల్ట్సు ఉంటాయి. నట్‌మెగ్ అనేది మన మెప్పుడూ వినని దినుసు. విడివిడిగా కాక 'ఆల్‌స్పైస్' సెస్' పొడి కూడా ఉంటుంది. వీరు కాయగూరలు మాంసముతో కలిపి వండి కానీ, పచ్చివికానీ తింటారు మనలా అచ్చగా కూరగాయలు వండి తినరు కేక్స్ చేసుకోవటం చాలా తేలిక. రకరకాల కేక్ మిక్స్‌లు పాకెట్లలో అమ్ముతారు వాటిలో కొలత ప్రకారం నీళ్ళు, గుడ్లు వేసుకుని యిచ్చిన టైము, వేడి పకారం తయారు చేయవచ్చు

స్థూలంగా చెప్పాలంటే ఇక్కడి వంట మన వంటకన్నా తేలిక. ఏపూట కాపూట వండుకో నక్కరలేదు. మిగిలినవి ఉంటే ఫ్రిజిడెయిర్‌లో పెట్టుకుని తరువాత తినవచ్చు. ఇక్కడ ఆహారంతో నీళ్ళు ఎవరూ తాగరు. కాఫీ, టీ, పాలు, పండు రసం, వైన్స్, బీర్ మొదలైన ద్రవ పదార్థాలు వాడుతారు టీ టోట్లర్స్ ఎక్కువ మంది లేకపోయినా యింటి దగ్గర ప్రతిరోజూ తాగేవారు అరుదు

ఈవిధమైన తేడాలు ఉన్నా ఇక్కడ మనం బ్రతకటం కష్టమేమీ కాదు. యిక్కడ 1000 కి 999 మంది మాంసాహారులైనా, పూర్తి శాకాహారులు కూడా ఉన్నారు. వాతావరణరీత్యా కానీ మరే కారణంచేత కానీ ఇక్కడ పూర్తి శాకాహారులుగా ఉండటం అసంభవం కాదు. మన దేశీయులలో మాంసాహారులకన్న శాకాహారులకే యిక్కడ ఎక్కువ సుఖం ఇక్కడ అన్నీ ఫ్రోజెన్ ఫుడ్స్ అవటంవలన, మనకీ యిక్కడకీ మాంసాహారాల రుచిలో తేడా ఉంటుందని మిత్రులు చెప్పగా విన్నాను. శాకాహారులకి యీ బాధలేదు. ఒక్క ఆనపకాయలు తప్ప మన దేశపు కూరలన్నీ యిక్కడ దొరుకుతాయి. వంగ, దోస, బీర, బెండ, అరటి, గుమ్మడి, కాబేజి, బచ్చలి, పచ్చిమెరప, నిమ్మ, చిలగడ దుంపలు సమస్తమూ దొరకుతాయి. అంతెందుకూ! ఫ్లారిడా నుంచి మామిడికాయలు వస్తే మేము ఆవకాయ కూడా వేసుకున్నాము. ఇవికాక మన పప్పులు, పోపు గింజలూ, శనగపిండీ, బియ్యపుపిండీ, అప్పడాలూ, వక్కపొడి, నెయ్యి, సాంబారుపొడీ యిలాంటివన్నీ న్యూయార్కులోదొరుకుతాయి. రైల్వే పార్శెలుఎక్కువ ఖరీదుకూడా కాదు.

అందువలన మీ రెప్పుడైనా యిక్కడికి రావాలంటే నాలాగ బెంగపెట్టుకోకండి. మీరేది తినటానికి అలవాటుపడితేఅది యిక్కడ దొరుకుతుంది.

[శ్రీమతి మతుకుమల్లి సుశీల వ్రాసిన 'స్త్రీధర్మం—

సర్వేలోకా మహీయన్తే సూర్యునిచేత, ఆదిత్యునిచేత, సర్వలోకములు వృద్ధిపొందుచున్నవి గనుక మరియు బ్రహ్మము మహిష్ఠమైనది అందువలన వ్యాహృతి మహః అయినది మరియు నది ఏమి? అది ఆత్మ ఆత్మ అనగా సర్వమును వ్యాపించియుండునది అని మహః అనునది ఆత్మఅయినప్పుడు అది సర్వ లోకములు అగుచున్నది. సర్వమునందును వ్యాపించియున్నది భూరాది వ్యాహృతులు, సర్వ ప్రాణములు అన్ని అన్నమలు అందులో నున్నవి ఆ అన్నిటియందును అది యున్నది వేదములు గూడ అందులో నున్నవి ఆత్మవలన అంగములు వృద్ధిచెందుచున్నట్లు, ఆదిత్యునివలన లోకములు వృద్ధిచెందుచున్నవి అందవలననే మాహాచమసుడు ఆదిత్యుని 'మహః వ్యాహృతిచేత వివక్ష చేసినాడు

ఎట్లు సర్వమును భూరాదివ్యాహృతులచేత చెప్పబడుచున్నదో వేదము తెల్పుచున్నది. భూరి తివా అగ్నిః భువ ఇతి వాయుః సువరి త్యాదిత్యః మహ ఇతి చంద్రమాః చంద్రమసావావసర్వాణిజ్యోతీగ్ంషిమహీయన్తే అగ్ని భూః అని ప్రసిద్ధిని పొందినది భువః అని వాయువు ప్రశస్తికెక్కినది సూర్యుడే సువః అని ప్రసిద్ధుడైనాడు. చంద్రుని ఋషులు

(15-వ పేజీ తరువాయి)

మహఃవ్యాహృతిచే వ్యాకరించినారు. ఎందుచేత? సర్వమైన తేజస్సులను చంద్రునిచేత వృద్ధిపొందుచున్నవి గనుక

మరియు ఈ వ్యాహృతులు సర్వ వేదములను, ఆవేదముల అర్థములందు నిహితమైవున్న బ్రహ్మ పదార్థమునుగూర్చి చెప్పుచున్నవి భూరితి వా ఋచః సువ ఇతి సామాని సువ రితి యజూగ్ంషి మహ ఇతి బ్రహ్మ బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయన్తే ఋగ్వేదము 'భూః అని ప్రసిద్ధము భువః సామమని ప్రసిద్ధము యజుర్వేదము సువఃఅని ప్రసిద్ధము మహః బ్రహ్మము బ్రహ్మము చేతనే వేదములు వృద్ధిపొందుచున్నవి

మరియు ఈ వ్యాహృతులు ప్రాణములను, అన్నములను గురించి చెప్పుచున్నవి అవియే అవియైనవి భూఃఅనునది, ప్రాణము భువః అనునది అపానము సువః వ్యానము మహః అనునదియే అన్నము. ఎందువలన? సమస్త ప్రాణములును, జీవరాసులును, అన్నమువలననే వృద్ధిపొందుచున్నవి

ఇచ్చట ప్రథమ వ్యాహృతి వరుసగా అయం లోకము, అగ్ని, ఋషులు, ప్రాణము అయినది. అనగా నాల్గు అయినది అట్లులనే తక్కిన వ్యాహృతులును భువః అనునది వరుసగా అంతరిక్షము, వాయువు, సామము, అపానము నాలుగుగా నయినది సువః అనునది అసౌలోకము, ఆదిత్యుడు, యజుర్వేదము, వ్యానము అయినది మహః అనునది ఆదిత్యుడు, చంద్రుడు, బ్రహ్మము, అన్నము అయినది ఈ రహస్యమునే వేద మిట్లు చెప్పుచున్నది తావా ఏతాశ్చతస్రశ్చతుర్ధా. చతస్ర శ్చతస్రో వ్యాహృతయః తాయో వేద సవేద బ్రహ్మ సర్వేఽస్మై దేవా బలిమావహన్తి భూర్భువ సువఃమహః అను ఈ నాల్గు వ్యాహృతులును మరల నాల్గు విధములుగా విభజింపబడినవి ఇట్లు నాల్గు నాల్గుగా విభజింపబడిన వ్యాహృతులను ఎవడు తెలిసికొనుచున్నాడో వాడు బ్రహ్మమును తెలిసికొనుచున్నాడు. మరి ఆబ్రహ్మమునకు సర్వ దేవతలును అంగభూతులు గనుక, మహః అను వ్యాహృతిచేత చెప్పబడుచున్న బ్రహ్మమునకు, భూరాదివ్యాహృతులే అంగములుగాగల బ్రహ్మమునకు గౌరవమును చేయుచున్నారు 

(11-వ పేజీ తరువాయి)

ఇవిగాక లోహజాలిక, పట్టా, సూత్రకం, కవచము, అని నాలుగు విధముల కవచములను కౌటిల్యుడు పేర్కొన్నాడు

ఈ ఆయుధములన్నియు మన ప్రాచీన చిత్ర శిల్పములందు కానరావు. విల్లంబులు, ఖడ్గములు, బరిసెలు, భల్లములు, గదలు, గండ్రగొడ్డళ్ళు, డాలులు, కవచముల అనేక రకములయినవి మన అజంతా, అమరావతీ చిత్రములందు కానుపించును కాని, చిత్రమయిన విశేషమేమన కౌటిల్యుడు వర్ణించిన కొన్ని యంత్రాయుధములు ప్రాచీన అసీరియా శిల్పములందు కానుపించును బహుశా ప్రాచీనమందు ఈ యంత్రములన్నియు మధ్య ఆసియాయందును, భారతావనియందును యుద్ధములందు వాడుచుండెడివారని మనమూహింపవచ్చును.

అయినప్పటికీ యుద్ధ యంత్రములు ప్రాచీన భారతీయ చిత్రకళయందు కనుపించకపోవుటకు కారణము కూడ కొంత యోచింపతగినదే. మన ప్రాచీన కళాకారుడు యుద్ధములను సూచనాపరముగనే చిత్రించెడివాడు అసీరియా చిత్రకారుడు యుద్ధములను పూర్తిగ వర్ణించెడివాడు ఇందు ప్రాచీన భారతీయకళాకారుని ఔన్నత్యము ప్రకటితము. సందేహములేదు

మధ్యయుగమున కూడ భారతదేశము ఉత్తమ ఆయుధములకు ప్రసిద్ధికెక్కినది కత్తులు, కవచములు సయితము ఉత్తమమైన ఉక్కుతో ఇక్కడ తయారయ్యెడివి అపైన ఆ ఆయుధములకు సువర్ణము, రత్నములను కూడ పొదిగి, చాల అందముగ చేసెడివారు ఇటువంటివి కొన్ని నేడు మన మ్యూజియములందు చూడవచ్చు

ఆ రోజులలో చాల గొప్ప గొప్ప ఫిరంగులను కూడ మనదేశమందు తయారు చేసెడివారు. ఈ నాడు కూడా ఆ ఫిరంగులు కొన్ని యున్నవి. లాహోరులో "జంజమా" బిజాపురం కోట మీదఉన్న "మాలిక్—ఏ—మైదాన్", కొన్ని మహారాష్ట్ర కోటలపైనున్న గొప్ప ఫిరంగులను చూచి పాశ్చాత్యులు కూడ, ప్రాచీనమందు భారతీయులు ఇంతటి ఫిరంగులు చేయు చుండిరా అని ఆశ్చర్య పడుచుందురు

ఇంతేకాదు ఔరంగజేబు తన యుద్ధములలో రాకెట్టులను వినియోగించెను అటుతర్వాత టిప్పు సుల్తాను యుద్ధములందు రాకెట్టులను ప్రయోగించుట చూచి, యిరోపియనులు తమ దేశములందు కూడ రాకెట్టులను చేయసాగిరి

ఇంతలో మనదేశము పరతంత్రమయినది ఇతర అనేక పరిశ్రమలతోపాటు, ఆయుధముల పరిశ్రమలు కూడ నశించినవి మన ఆయుధ పరిశ్రమ చరిత్రను తలచికొన్నపుడెల్ల, ఈనాటివరకు ఆ పరిశ్రమ ప్రగతి నిర్విఘ్నముగా సాగియున్న, ఈ నాడు రష్యా, అమెరికాలవారిని మించి ఆయుధ సామగ్రులను మనము కూడ తయారు చేయుచుండెడివారమేమోయని అనిపించును. ★

# అ వహా ల్యా

(9-వ పేజీ లిగావాయి)

వచ్చి పేడుక్కుర్చీలో పడుకున్నాడు తనకు తెలుసు అతను వెళ్ళితీరాలి, చాలా ముఖ్యం అని డాక్టర్ సుశీల రాగానే పిలిపించుకుంటానని, లేకపోతే నే నేవెడ్డనని యెన్నో చెప్పి ఒప్పిస్తేగాని అతను లేచి మళ్ళీ టై కట్టుకోలేదు 'లేదు. నేను సరీగ్గా చూడనే లేదు నీ మొహం చాలా పీక్కుపోయివుంది తెలుసా' అత మొహంలో బాధకి తనకు నవ్వు వచ్చింది. కాని లదెంత హాయి ఒకళ్ళు మనకోసం ఆదుర్దాపడటం అనేది యెంత గొప్ప విషయం మరో అరగంటలో వెళ్ళిపోయాడు వెళ్ళిన తర్వాత తనకెంత దిగులో మళ్ళీ అతన్ని కళ్ళతో చూస్తానా అన్పిస్తుంది అమర్నాడు సుశీల వచ్చింది వస్తూనే ఆవిడ వేసిన మొదటి ప్రశ్నకి తనిచ్చిన జవాబులోనే చెప్పేసింది ఆ తర్వాత పరీక్ష గూడ చేసి నవ్వుతూ 'ఆడపిల్లా—మగ పిల్లవాడా' అని అడిగింది యెక్కడో యేదో ఆలోచిస్తున్న తన ఆవిడ ప్రశ్నకి తన సమాధానాన్ని అంత గుర్తించకుండానే 'యెవరికి' అంది. యెవరన్నా ప్రసవించాలో—ప్రసవిస్తారో అనుకుంటు—యెవరవ్వా ప్రసవిస్తారు అన్నప్పుడే చేతివేళ్ళలో రెండు చూపించి పట్టుకోమనటమో లేక ఆడపిల్లా, మగపిల్లవాడు కావాలో అని అడగటమో చెప్తారు డాక్టర్ సుశీల విరగపడి నవ్వుతున్నప్పుడుగాని తనకి గుర్తు రాలేదు ఆవిడ ప్రశ్న, తన జవాబు, ఆవిడ పరీక్ష—అన్నీ క్షణంసేపు గుండె కొట్టుకొనటం మానేసింది ఇహ అసలు కొట్టుకోదేమో అన్పించింది కానీ వెంటనే 'మీకే—శ్రీమతి వాసంతీధర్'కి అంటూ అంటుండగానే ఆగిపోయిన గుండె రెట్టింపువేగంతో కొట్టుకోవటం మొదలుపెట్టింది కూర్చున్న కుర్చీకి తన శరీరం అంటుకుపోయినట్లయింది యేమిటీ— తనకా? పాపా ప్రపంచం అకస్మాత్తుగా మారిపోదేం వస్తువులన్నీ యిలాగే వుంటాయేం? కిటికీ తలుపులన్నా కదలవేం? గాలయినా గట్టిగా వీచదేం? ఆకాశంలో మేఘాలయినా పరుగెత్తవేం? గుమ్మం అవతల వరండా దిగువగా పచ్చటి చెట్లమీదపడి మెరుస్తున్న సూర్యకాంతి పకపకా నవ్వదేం? యేం జరగదేం. యిదేమిటి యిలా ఆలోచిస్తుందేం తను "నిజంగానా?' జీరపోయిన గొంతుతో డాక్టర్ సుశీలవంక చూస్తూ అంది తను మీరు బలే తమాషాగా చూస్తారండీ! కళ్ళల్లో లన్ని భావాలు కదులుతా యేమిటి? నిజంగానే చెప్తున్నాను వారు క్యాంప్‌నుంచి రాగానే మొదట నాకు బహుమతి యిప్పించాలి కావ్సు అదీ నేనే చూస్తాను' నల్లగా పొడుగ్గావున్న సుశీల తెల్లటి పళ్ళన్నీ తళుక్‌మనేట్లు నవ్వి లంది ఆవిడవైపే తదేకంగా చూస్తున్న వాసంతికి ఆవిడ చేతిలో వో పసికందుని తెల్లటి తువాల్తో తుడుస్తూ "మీ పోలికండీ—ముక్కుమటుకు తండ్రిడిది పుణికి పుచ్చుకున్నాడు పాప చాలా ఆరోగ్యంగా వున్నాడు చూసారా, మీరు నాకు మంచి బహుమతి యివ్వాలి" అంటున్నట్లు తను యేదో మంచంమీద పడుకుని చెవుల్లో దూదితో నీరసంగా పడుకుని ఆసక్తిగా, భయంగా ఆ పసి పాపవైపు చూస్తున్నట్లు అన్పించింది. తనసలు యెప్పుడూ అంతే — వున్న విషయానికి, జరుగుతున్న క్షణానికి పదింతలు ముందుకు దూసుకుపోయి ఆలోచిస్తుంది ఈ క్షణంలో ఇప్పుడు జరుగుతున్నదాన్నిగురించి యెప్పుడూ ఆలోచించదు జరిగిపోయిన వాటినీ గురించైనా ఆలోచిస్తుంది లేకపోతే జరగబోయే వాటిని గురించయినా ఆలోచిస్తుంది. వర్తమానాన్ని గురించి ప్రసక్తే వుండదు, అది గతంగా మారేవరకు యేమిటో ఒక్కొక్కళ్ళ స్వభావం సీతయితే—జరిగిపోయింది, జరగబోయేది నాకు అక్కర్లేదు, జరుగుతున్నవే నాకు కావాలి జరిగిందాంతో మనకు ప్రసక్తిలేదు అది తిరిగిరాదు యెంత గొప్ప అనుభవంఅయినాసరే—జరగబోతుందంటావా అయోమయం, అర్థంగాదు మనతోపాటు ముందుకు పరుగెత్తే పెద్ద గోడ భవిష్యత్తు యెప్పటికప్పుడు దానివెనక యేంవుందీ మనకి తెలియనే తెలియదు అది తెలుసుకోవాలనే ప్రయత్నంతోనే మనం పరుగెత్తుతుంటాం చివరకు తెలుసుకోకుండానే పోతుంటాం అంటుంది దానిది మరీ వేదాంతం బ్రతుకంటే క్షణంలో సగంట ఆ క్షణంలో సగంలోనే చాతనైతే ఇంద్రధనస్సులో వున్న రంగులన్నీ చూసినట్లు అన్నీ అనుభవించగలంట నాని మొహం మరీ అంత చిన్న వయసులో అంత వేదాంతం వుండకూడదు బాబూ అలాటి వాళ్ళకి యిల్లూ, సంసారాలుగూడ పట్టవు సీత అదే అంటుంది భర్తగాని, పిల్లలుగాని యివన్నీ వో బాధ్యతకింద మనం చెయ్యవలసిన పనులక్రింద తీసుకోవాలి అంటుంది తనకి శేఖరం యెప్పుడూ లోకంగా కన్పిస్తాడుగాని బాధ్యతగా అన్పించదు తనకి పిల్లలు కావాలి భర్త కావాలి అన్నీ కావాలి రేపు తనకి గూడ ఓ పాపపుడ్తే యిలాగే పుట్టిన రోజు చేసుకోదూ— తనప్పుడు యెలా వుంటుంది శేఖరం చెప్పినట్లు లావయి, నిండుగా జడమానేసి మెడమీదకు చుట్టతో వుంటుంది కాబోలు అమ్మో, యిలా చిన్నగా వుంటేనే బాగుంటుంది చిన్నతనం మననుంచి వెళ్ళిపోతుంటే యెంత బాధేస్తుందీ—అందుకే కాబోలు మనకు తెలియకుండానే మనం పెద్దవాళ్ళం అయిపోతూవుంటాం

చాలా సేపట్నుంచి తదేకంగా ఆలోచిస్తున్న వాసంతి యెవరోవచ్చి పల్కరించటంతో యీ లోకంలో పడింది. ఆ వచ్చిన అమ్మాయి సుకన్యాదేవి అక్క కూతురు కాబోలు 'పిన్ని మిమ్మల్ని లోపలకు పిలుస్తోంది' అంటూ వచ్చింది. యిదేమిటి— చాలా సేపయింది వాసంతి కంగారుగా లేచి నిలబడింది హాలులో చాలాభాగం ఖాళీ అయిపోయింది గోడవారగా కూర్చున్న ఆంగ్లోయిండియన్స్ వెళ్ళిపోయారు హాలులో చాల కొద్దిమంది మిగిలారు స్టేజీ గూడ ఖాళీ అయింది. వాసంతి దిక్కులు చూడటం మానేసి తనని పిలవటానికి వచ్చిన అమ్మాయిని 'యెక్కడికి రావాలి' అంది 'లోపలికి అక్కడ ఫలహారంచేసి మళ్ళీ వచ్చి కూర్చుందురుగాని' దూరంగా కూర్చుని అంతకుముందు వాసంతినిచూసి నవ్వుతూ ఖబుర్లు చెప్పుకున్న అమ్మాయిలవంక మెడ తిప్పిచూసి నవ్వుతూ అంది ఆ అమ్మాయి. వాళ్ళని చూసేసరికి వాసంతికి మళ్ళా

# అమూల్య

దిగులు ముంచుకువచ్చింది. వాళ్ళింకా అలానే చూస్తూ వున్నారు 'రండి' లని పిలుస్తున్న అమ్మాయితో యెలాగో లోపలకు వెళ్ళబోయింది వాసంతి గుమ్మానికి కొంచం యివతల వుండగానే ఆ ముగ్గురు అమ్మాయిలు వాసంతి వైపు వచ్చారు 'పరిచయం చెయ్యాలా — ఇదుగో వీళ్ళు నా స్నేహితురాళ్ళండీ—యీమె వాసంతి అని శేఖరంగారి భార్య వారు, మాబావగారు మంచి ఫ్రెండ్స్' అంది, సుకన్యాదేవి పిన్నికూతురు వాళ్ళ ముగ్గురికీ నమస్కారాలు చేసింది వాసంతి అందులో మధ్య అమ్మాయి అంది. 'మిమ్మల్ని చూసింతర్వాత మీతో తప్పకుండా పరిచయం చేసుకోవాలనిపించిందండి. మీ కళ్ళు చాలా బాగున్నాయి యిందాకట్నుంచీ మీవంకే చూస్తున్నాను

వాసంతి కళ్ళు క్రిందికి వాలిపోయినాయి. అంత ధైర్యంగా నిర్మొహమాటంగా మొహంమీద చెప్పే

స్తున్న ఆ అమ్మాయివంక కళ్లెత్తిచూడటం గూడ భయమనిపించింది

'ఆ అమ్మాయి కథలు రాస్తుందిలే అందుకు' అంది మరో అమ్మాయి 'అది అనవసరప్రసంగం మొదటమ్మాయి కసిరింది. పేరడిగింది వాసంతి జవాబు చెప్పింది ఆ అమ్మాయి ఆపేరు వాసంతికి పరిచయమే. కథలు గూడ బాగానే వుంటాయి కానీ అమ్మాయి వయసు తక్కువగావుందే అంతమంచి కథలు రాయడం యెలావస్తుందీ అనుకుంటున్న వాసంతికి 'పదండి—లోపల పిన్ని వెయిట్‌చేస్తోంది' అంది సుకన్యాదేవి అక్కకూతురు మరోసారి వాళ్ళ ముగ్గురికి నమస్కారంచేసి వాసంతి యువతలకు వచ్చింది అప్పటికే సుకన్యాదేవి బైటకు వచ్చేసింది 'మీరు లోపలకు వెళ్లండి చూడు గిరిజా వాసంతిని లోపలకు తీసుకువెళ్ళు. ఇక్కడ అహల్యాదేవి వెడ్తున్నానంటున్నారు పంపిస్తాను వెళ్ళు లోపలికి వాసంతి సిగ్గుపడకు—మాటలు చెప్తూనే ఆవిడ హడావుడిగా వెళ్ళిపోయారు గిరిజ లోపలికి వెడ్తుండగా వాసంతి చటుక్కున చెయిపట్టి ఆపి, 'మీ అక్కయ్యకూతురెక్కడ' అంది చేతిలో వుండిపోయిన సోప్‌బాక్సు గుర్తుకు రావటంతో 'యెవరూ—జయంతా? అక్కడ ఆగదిలో వుందే' అంది గిరిజ ఆగిపోతూ వాసంతి తలతిప్పి చూసింది. గిరిజ చూపించిన గదిలో జయంతి, ఆవిడ ప్రక్కన ఆ లావుపాటి ఆవిడ, ఖద్దరుచీర ఆవిడ వున్నారు 'నువ్వొక్క పనిచేసిపెట్టు. నేను వెడ్తూవుంటాను. నువ్విది మీ జయంతికిచ్చేసి రా' అంది

'అదేమిటి—మీ రివ్వండి' గిరిజ అనుమానంగా చూస్తూ అంది

'కాదే వారిపేరుచెప్పి నువ్విచ్చేసి రా' బ్రతిమాలుతున్నట్లుగా అంది వాసంతి క్షణంసేపు వాసంతి మొహంలోకి చూసిన గిరిజ సోప్‌బాక్సు తీసుకొని వెళ్లింది యెంత త్వరగా ముగించుకుని బైటపడ్తే అంత బాగుండు—యేరీ యిక్కడ యిందాక రక్షకభటుల్లా నిలబడ్డ అమ్మాయిలు లేరే, పోయారే అనుకుంటూ తలవంచుకుని లోపలకి వస్తున్న వాసంతికి అలాగే తలవంచుకుని గబగబా లోపల్నుంచి వస్తున్న మరోవ్యక్తి రకీమని తలకొట్టింది ఇద్దరూ ఒక్కసారి అబ్బా అనుకుని దెబ్బతగిలిన చోటు పట్టుకుని తలెత్తి చూశారు. "సారీ చూడలేదు" అంది అవతల వ్యక్తి వసంతయెత్తే వుంది కానీ నాలుగైదు సంవత్సరాలు పెద్దదిలావుంది పొడుక్కితగ్గ లావుతో మనిషి హుందాగావుంది చాలా అందంగావుంది శరీర సౌష్టవానికి చక్కగా అతికినట్లున్న చీర—జాకెట్. కానీ జాకెట్ చేతులు భుజాల దిగువుగా పొట్టిగా చాలా బిగుతుగా వున్నాయి చెవలకి చీరరంగుతోకలిసే ద్రాక్షగుత్తుల్లా వున్న ప్లాస్టిక్‌వి వున్నాయి పెదవులకి రంగుంది కానీ రంగు వేసుకున్నట్లులేదు చాలా సహజంగా వుంది

"సారీ దెబ్బతగిలిందా?' అంది ఆవిడ నవ్వుతూ.

'లేదు ఫర్వాలేదు' వసంత గూడ నవ్వింది

'వెరీ వెరీ సారీ' వసంతని తప్పించుకుని వెళ్లిపోయింది ఆవిడ ఆవిడని యింకా సాంతం చూడటం పూర్తిగాని వసంత తలతిప్పి ఆవిడ వచ్చినవైపే చూస్తుండిపోయింది. వెనక నడినెత్తిమీదకి జుట్టు మెలితిప్పి చుట్టిన చుట్ట, వెనక జాకెట్‌కి వీపుమీద డైమండ్ ఆకారంలో బట్టలేదు ఆ బట్టలేనంత మేర బిగువుగా అందంగా శరీరం కన్పిస్తోంది. మెడలో గొలుసుండే భాగంనుంచి ఆ కత్తిరించిన డైమండ్ ఆకారంమీదుగా పట్టుకుచ్చులు చిన్న చిన్నవి నడుందాక వేళ్లాడుతున్నాయి. నడక గూడ బాగానేవుంది. వెడూ వెడ్తూ ఆవిడ ఒకసారి వెనక్కి తిరిగిచూసి యింకా అలాగే నిలబడిపోయి తనవంక చూస్తున్న వాసంతిని చూసి మళ్ళీ నవ్వి వెళ్లిపోయింది ఆవిడ చూడగానే వాసంతి చప్పున మొహం తిప్పుకుంది ఇంతలో గిరిజ వచ్చింది 'ఆవిడెవరు' దూరంగావెళ్ళిపోయి సుకన్యాదేవితో మాట్లాడ్తున్న ఆవిడని చెయిచాచి వేలుపెట్టి చూపిస్తూ అంది 'యెవరూ—ఆవిడా మా అక్కయ్య ఫ్రెండ్ బొంబాయిలో వుంటారు ఆవిడ మొగుడు అమెరికా వెళ్ళివచ్చారు. ఆమెగూడ వెళ్ళివచ్చింది. 'లోపలకు దారితీస్తూ అంది గిరిజ

ఫలహారం అదీ ముగించుకుని గిరిజతోపాటు యివతలకు వచ్చింది వాసంతి హాలు పూర్తిగా ఖాళీ అయిపోయింది పెద్ద వర్షం గబగబాపడి ఒక్కసారి తెరిపి వచ్చినట్లుగావుంది హాలులో దీపాల గుత్తి క్రిందుగా నిలబడి ఆవిడ, సుకన్యాదేవి యింకా యేదో మాట్లాడుకుంటూనేవున్నారు "ఆగండి మీకు కిళ్లీ తీసుకొస్తాను" అంటూ గిరిజ మధ్యలో వెనక్కి వెళ్ళిపోయింది "ఇక్కడ రా వాసంతి" దూరంగా నిలబడిన సుకన్యాదేవి పిలవటంతో గిరిజకోసం చూస్తున్నట్లు నిలబడిన వాసంతి కదిలి ముందుకు వెళ్ళింది "ఈవిడ నా స్నేహితురాలు అమూల్య"యీవిడపేరు అమూల్యా! మనిషిలానే పేరు గూడ చక్కగా అమూల్యంగానేవుంది అనుకుంది వసంత చేతులు జోడించి నమస్కరిస్తూ. 'నీ పేరేమిటి వాసంతా?" అంది ఆవిడ బాగా దగ్గరగావచ్చి ఆవిడ చూపుల్లో యిందాకటి మార్దవం లాలిత్యం రెండూ లేవు అవేవో చురకలు వేసినట్లు అవి తగిలినచోటల్లా గుచ్చుకుంటున్నట్లూ వున్నాయి ఆవిడలో ఆమార్పు యెందుకు వచ్చిందో అర్థంగాని వాసంతి అచేతనంగా అలాగే నిలబడిపోయింది పైనవున్న దీపాల గుత్తిలోంచి వస్తున్న రంగు రంగు కాంతులు ఆవిడ మొహంమీద నీలంగా, సుకన్యాదేవి మొహంమీద యెర్రగా తన మొహంమీద తెల్లగా పడ్తున్నాయి

"శేఖరం నీకు పెళ్ళికిముందే తెలుసా?" హఠాత్తుగా ఆవిడ చెయిచాచి వాసంతి గడ్డాన్ని మునివేళ్ళతో పట్టుకుని యెత్తుతూ అంది. ఆ యెత్తడం ప్రేమగాకాక, అదేదో ఆసక్తిగావుంది అసలు సుకన్యాదేవి ఆవిడని తనకు పరిచయం చేసిందిగాని, తనకు ఆవిడకు పరిచయంలేదు కాని తనపేరు ఆవిడకి తెలిసింది పోనీ అది ఆవిడకి యీవిడ చెప్పివుండచ్చు కానీ శేఖరం సంగతి అడుగుతుందేమిటి? గడ్డాన్ని ఆవిడ చేతిలోంచి తప్పించుకోవటానికి ప్రయత్నిస్తూ ఆవిడ చూపులతో కలసిన తన చూపుల్ని క్రిందికి తిప్పుకుంది వాసంతి 'కొంచం సిగ్గులావుందే లేకపోతే కొత్తా?' ఆవిడ గడ్డం వదలకుండానే అంది పైనుంచి వస్తున్న రంగు రంగుల

కాంతులు, యెదురుగుండా యీవిడ వింత ప్రవర్తన, నిశబ్దంగావున్న హాలు చాలాసేపట్నుంచి కూర్చుని కూర్చుని అలిసిపోయినట్లుగా అదోమాదిరిగా వున్న వాసంతికి అదేదో కలలో యెక్కడో వంటరిగా కూర్చుని ఆలోచిస్తున్న వో దృశ్యంలా అన్పిస్తోంది ఆవిడ ప్రశ్నకేదో సమాధానం చెప్దామని అనుకుంటుండగానే హఠాత్తుగా వెనకనుంచి 'వసూ' అనే పిలుపు విన్పించటంతో ముగ్గురూ వులిక్కిపడి వెనక్కు తిరిగారు 'అరె! మీరా? యెప్పుడొచ్చారు. రేపుగదూ రావాల్సింది గిరుక్కున వెనక్కు తిరిగిన వాసంతి శేఖరాన్ని చూడటంతోనే ఒక్క పరుగులో దగ్గరకు వచ్చింది. 'మీరు రేపు సాయంత్రంగాని రారనుకున్నాను. యెలా వచ్చారు సంతోషంతో వికసించిన మోహంతో వాసంతి భర్త చెయ్యి తన చేతిలోకి లీసుకోబోయింది. కానీ శేఖరం వాసంతిని గమనించటంలేదు. అతని

కాళ్ళులు దూరంగా నిలబడ్డ వస్తువుమీద రెప్ప వాల్చకుండా చూస్తున్నాయి. తన చేయి పట్టుకో బోతూ అడ్డంగా వచ్చిన వాసంతిని పట్టి ప్రక్కకు లాగాడు ఆశించని యీ ప్రవర్తనతో తెల్లబోయిన వాసంతి శేఖరం చూస్తున్నవైపు చూసింది దూరంగా రంగు రంగు దీపాలగుత్తి క్రింద నిలబడ్డ అమూల్య తలకొంచంగా ప్రక్కకు ఒరగపెట్టి అదోరకమైన చిరునవ్వుతో ఠీవిగా నవ్వుతూ శేఖరంవైపు చూస్తోంది శేఖరం గూడ చూస్తున్నాడు కానీ బాధగా, అసహ్యంగా, కోపంగా వున్నాయి ఆ చూపులు వాసంతికి అవి పరిచయంలేవు ఒకటికి రెండుసార్లు మూడుసార్లు ఆవిడ వంక శేఖరంవంక కొయ్యబొమ్మలా నిలబడిపోయిన సుకన్యాదేవివంక తల తిప్పి చూసింది వాసంతి

'పద పోదాం' హఠాత్తుగా భార్య భుజంచుట్టూ చేయివేసి తిప్పేస్తూ అన్నాడు శేఖరం.

'అదేమిటి. రండి లోపలికి వెడ్దురుగాని'— చలనం తెచ్చుకున్న సుకన్యాదేవి ముందుకువస్తూ గబగబా అంది

'అక్కర్లేదు ముందు మీరు నాకు చెప్పినట్లయితే వాసంతిని యిక్కడికి రానిచ్చేవాడినికాదు' కఠినంగా జవాబిచ్చిన శేఖరం మరుక్షణంలో వాసంతి చేయిపట్టి ముందుకు గుంజుకుపోయాడు 'యెవరావిడ—యెందుకిలాచేస్తారు' శేఖరం లాక్కొస్తుంటే వచ్చేస్తున్న వాసంతి వెనక్కు తిరిగి చూస్తూ అంది ఆవిడ యింకా అలాగే నిలబడి వుంది కానీ యీసారి మొహంలో ఠీవిగావున్న ఆ చిరునవ్వు లేదు

ఐదు నిమిషాల్లో చేరవలసిన దోవ వదిలి చుట్టు తిప్పి అరగంటకిగాని యింటికి తీసుకురాలేదు శేఖరం దోవలో మళ్ళీ తనే అడిగింది వాసంతి— 'యెవరావిడ—మీకు తెలుసా' అని కానీ శేఖరం జవాబు చెప్పలేదు. పెదవులు బిగించి రోడ్డుని తదేకంగా చూస్తున్నాడు మరోసారి యేదో అడగబోయింది వాసంతి 'నన్ను మాట్లాడించకు ఆవిడ నాకు తెలుసు అంతే' కోపంగా, పెళ్ళయిన తర్వాత మొట్టమొదటిసారిగా గట్టిగా కసురుతూ అన్నాడు శేఖరం వాసంతి కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి మధ్య తనేం చేసిందని అసలు యిలా మధ్యలో క్యాంప్ నుంచి రావటం యేమిటి—పోనీ వచ్చారు. కానీ వచ్చారన్న సంతోషం లేకుండా యిదేమిటి కళ్ళనుంచి వుబికి బుగ్గలమీదకు జారుతున్న నీళ్ళని తుడుచుకోవటానికి ప్రయత్నించలేదు. తుడుచుకుంటే అతనికి యేడుస్తున్నట్లు తెలుస్తుంది అతను రాగానే తను యెన్ని చెప్పాలనుకుంటోంది! అన్నీ పోయినాయి నిటారుగా కూర్చుండిపోయింది వాసంతి

ఇంటికి వస్తూనే అలవాటు ప్రకారం కారుని గారేజులో పెట్టకుండానే వరండా మెట్లముందు వదిలేసి శేఖరం లోపలికొచ్చి గదిలో కుర్చీలో కూలబడ్డాడు మాట పలుకూ లేకుండా, తనకు సంబంధించనట్లున్న శేఖరాన్ని అలా మొదటిసారిగా చూస్తున్న వాసంతికి అతని దగ్గరకు వెళ్ళే సాహసంలేక హాలులో కిటికీ దగ్గర అలాగే నిలబడిపోయింది. యెవరసలావిడ? శేఖరం యెందుకలా అయాడు? వాసంతికి తలపగలగొట్టుకున్నా అర్థం గావటం లేదు

గదిలోకి వచ్చేసిన శేఖరం లైటుఠీసేసి బూట్లు గూడ విప్పుకోకుండా పడకకుర్చీలో వాలిపోయాడు హఠాత్తుగా అతనిలో శక్తి అంతా పోయినట్లుంది మళ్ళీ అమూల్య యెందుకు కన్పించినట్లు! నాలుగు సంవత్సరాలక్రితం రెండు సంవత్సరాల దాంపత్య జీవితంలో నరకం చూపించి తననికాదని, అసమర్థుడని తీసిపారేసి మరొకరితో కలకత్తా వెళ్ళిపోయిన అమూల్య మళ్ళీ యెందుకొచ్చింది తన జీవితంలోకి ? అమూల్యతో జీవితం కలకత్తానుంచి రాసిన ఆఖరి ఉత్తరం అన్నీ కలిపి తనని, మనశ్శాంతికి దూరం చేసి పిచ్చివాడిలాగ చేసి దేశాలవెంట తరిమినాయి యెలాగో కోలుకున్నాడు పగిలిన హృదయపు ముక్కలు యేరి యిచ్చింది వాసంతి వాటిని వాసంతి అమాయకపు హృదయం సాయంతో అతుకుపెట్టుకుంటున్నాడు. మళ్ళీ వచ్చింది అమూల్య అమూల్యని యెదిరించే సాహసం తన కెప్పటికీరాదా? యిప్పుడు మరోసారి పిచ్చివాడ్ని చెయ్యటానికే పని గట్టుకుని వచ్చిందా అమూల్య వాసంతి! పిచ్చి వాసంతి ఇదంతా చూసి యేమనుకుంటుందో! తన మొదటిభార్య బ్రతికివుందని వాసంతికి తెలియదు శేఖరం కుర్చీలో లేచి కూర్చుని 'వసూ' అని పిల్చాడు పిచ్చిపిల్ల అసలే కాస్తంతవాటిని గంపంతగా వూహించుకుని కళ్ళు పెద్దపెద్దవి చేసుకుని చూస్తుంటుంది ఒకవేళ అమూల్య భర్త యిక్కడకు వుద్యోగ రీత్యా వస్తే తను యీ వుద్యోగాన్ని, యీ వూరుని వదిలేసి వాసంతిని తీసుకుని యే పల్లెటూరుకైనా పారిపోతాడు 'ఇక్కడ రా! లైటు వెయ్యి' నెమ్మదిగా వస్తున్న అడుగులుచప్పుడు విని మళ్ళీ వెనక్కువాలి పడుకున్నాడు శేఖరం వాసంతి లైటు వేసి యింకా చేతిని అలా స్విచ్‌మీదనేవుంచి శేఖరాన్ని గమనిస్తోంది

'అలా నిలబడ్డావేం—దగ్గరకు రా' చేయిచాపి యిస్తూ అన్నాడు

'మీరలా యెందుకున్నారు' ఆవిడ యెవరు అనే ప్రశ్న మళ్ళీ నాలిక చివరిదాక వచ్చి ఆగిపోయింది

'యెలావున్నాను నాకు ఒంట్లో బాగలేదు అందుకే తిరిగి వచ్చేశాను. నిజం భోంచేద్దాం పద' లేచి సరిగ్గా కూర్చుని వంగి కాలిబూటు విప్పుకుంటూ అన్నాడు

ఆరాత్రి అతను నిద్రపోలేదు వాసంతి గూడ నిద్ర పోలేదు చాలా రాత్రయింతర్వాత మంచం మీద నిద్రలేకుండా అటు యిటూ దొర్లుతున్న అతన్ని చాలాసేపట్నుంచి గమనిస్తున్న వాసంతి లేచికూర్చుని 'వున్న విషయం యేమిటో పైకి చెప్తే కొంతయినా మనశ్శాంతి లభిస్తుంది యే విషయం అయినా భార్యతో చెప్పటానికి జంకెందుకు చెప్పండి మీ ఆనందంలోనే కాదు—మీ బాధలో గూడ నాకు భాగం యివ్వాలి' శేఖరం వాసంతి మాటలకు జవాబివ్వలేదు కాని బోర్లగా పడుకుని దిండులో తలదాచుకుని బాధగా అటు యిటు కదులుతున్నాడు.

"పోనీండి మీకంత చెప్పటానికిష్టంలేకపోతే చెప్పద్దు. మీరు నిజంగా ఒంట్లో బాగాలేకనే తిరిగి

వచ్చినట్లయితే నిద్రపోవటానికి ప్రయత్నించండి" శేఖరం జుట్టులోకి వేళ్ళుపోనిస్తూ అప్యాయంగా అంది

ఆడవాళ్లని అనుభవాలు చిత్రంగా యెదిగి పోయేటట్లు చేస్తాయి యెందుకో రెండుగంటల క్రితం తనకి—యిప్పటికీ చాలా తేడా కన్పిస్తోంది వాసంతికి. యేదో పెద్దరికం వచ్చేసింది హఠాత్తుగా. వున్నట్లుండి వాసంతి చేయి తీసుకుని గట్టిగా పట్టుకుని 'నువ్వు నా కీ ప్రశ్నకు జవాబు చెప్పు. నేను యీ వుద్యోగం, యీ డబ్బు లేకుండా యెక్కడికిరమ్మంటే అక్కడకు వస్తావా?' అతనేం మాట్లాడుతున్నాడో వాసంతికి అర్థంగావటంలేదు శేఖరం' తిరిగి సరీగ్గా పడుకుని భార్య చెయ్యి కళ్లకి అన్చుకుంటూ 'చెప్పు వసూ యేదీ మనిద్దర్నీ విడదియ్యలేదని చెప్పు నువ్వు నన్ను పెళ్లిచేసుకున్నావని, యెప్పుడూ నా ప్రక్కవదలనని చెప్పు నా మనశ్శాంతి దూరంకాదని చెప్పు. చెప్పవూ ?' కళ్లు



మూసుకుని అంటున్న అతను హఠాత్తుగా కళ్లు తెరిచి రెండుచేతులు చాచి దగ్గరకు లాక్కుంటూ 'చెప్పు—చెప్పు. యెలాటి పరిస్థితులలోనూ నన్ను వదిలిపెట్టివెళ్లనని చెప్పు. అబద్ధం అయినా సరి. యిప్పటికిలా చెప్పు. మనసారా చెప్పు' తమ భుజాలు విరిగిపోతాయోమోనన్నంత గట్టిగా పట్టుకుని పిచ్చిగా చూస్తున్న భర్త కళ్ళలోకి లోతుగా పరీక్షగా చూసింది వాసంతి. అతని కళ్లు దేన్నో ఒకసారి పోగొట్టుకుని మరోసారి పోగొట్టుకుంటానేమో ననే భయంతో వున్నాయి 'ఆవిడెవరో ముందు చెప్పండి' శేఖరం చప్పున వాసంతిని వదిలేసి మొహం ప్రక్కకు తిప్పుకున్నాడు.

'పోనీ నన్నేం చెయ్యమంటారో చెప్పండి.' మరోసారి కళ్లలో తిరగబోతున్న నీళ్లని బల వంతాన ఆపుకోవటానికి ప్రయత్నిస్తూ అంది.

'ఆవిడ అమూల్య'—యెలాగో అన్నాడు శేఖరం.

'అవును అది ఆవిడపేరు అయితే—ఆవిడేమ యినా మీ మొదటిభార్యకు బంధువా ?'

'కాదు. అమూల్యే నీకు తెలియదు నా మొదటి భార్య బ్రతికివుందని. నన్ను వదిలేసిపారిపోయిందని' వాసంతికి నోట మాటరాలేదు. 'ఏమిటిది ఏమిటిది' మనసులో యెవరో దిగులుగా యేడవబోతున్నారు. 'ఆవిడ చచ్చిపోలేదూ?' శేఖరం మొహంలోకి చూస్తూ అంది వాసంతికి హఠాత్తుగా నీరసం వచ్చేసింది. 'కాదు యేం చెప్పాలో తెలియక మీ మామయ్యా వాళ్లకి చచ్చిపోయిందని చెప్పాను అబద్ధంఆడాను. అందులో నాతప్పులేదు వాసంతీ! వింటానంటే, ఓపిక వుందంటే నీకు వో కథ చెప్తాను' దగ్గరగా లాక్కుని గుండెలకి నొక్కుకుంటూ అడిగాడు శేఖరం

'చెప్పండి—' సరసంగాలంది వాసంతి 'అమ్మాయి వాసంతీ—అయింది నీపని. అదృష్టం అదృష్టం అని తెగమురిసిపోతున్నావే? అది కాస్త ఆరిపోయింది. ఇహ నీ యిష్టం—' వాసంతి మనసులో గట్టిగా అరుస్తున్నారెవరో. 'అబద్ధం—అబద్ధం—యేం కాదు. యిదో కల—కాసేపటిలో కరిగిపోతుంది. అప్పుడు తను లేచి కూర్చుని శేఖరానికి యిదంతా వర్ణించి చెప్తుంది. యింకోళ్ళ పోట్లాడుతున్నారు. శేఖరం చెప్పటం మొదలుపెట్టాడు.

అమూల్యని అతను యెప్పుడు యెక్కడ చూశాడో సరిగ్గా జ్ఞాపకంలేదు. అప్పటికింకా ఆంధ్రప్రదేశ్ రాలేదు శేఖరం తండ్రి మద్రాసులో హైకోర్టు వకీల్‌గా పనిచేస్తూండేవాడు. అవి అతను చదువుకునే రోజులు అమూల్య యే కాలేజీలోనూ చదువుకోవటంలేదు ఇంటరు మూడుసార్లు తప్పి యింట్లోనే కూర్చుంది అమూల్య తండ్రి ఎలక్ట్రిక్‌పార్ట్సు అవీ అమ్మే వ్యాపారం చేస్తూండేవాడు కారు, పెద్ద బంగళా, నౌకర్లు చాలా అట్టహాసంగానే వుండేవారు. వస్తుతః వుత్సాహవంతుడు, పదిమందిని కలుపుకుని యేపని అయినా యిట్టే నెరవేర్చే బుద్ధికుశలతగల శేఖరం కాలేజీలోనేగాక యువతల సాంఘికంగా గూడ మంచిపేరు తెచ్చుకున్నాడు. అమూల్య యేదో పెళ్లిలో దూరంనుంచి చూసింది శేఖర్‌ని. ఆతర్వాత అనుకోకుండా వెంట వెంట ఒకసారి పుట్టినరోజు పార్టీకి, మరోసారి యేదో పార్టీకి అలా కలుసుకున్నారు ఆఖరికి బాగా పరిచయం యేర్పడింది. అనుకుని చెప్పుకోవాల్సింది మహాబలిపురం ఎక్స్‌కర్షన్ దాని తర్వాత శేఖరం కోరికమీద పక్షితీర్థం చూడటానికి వంటరిగానే శేఖరంతో వచ్చింది అమూల్య ఆపైన సినిమాలకి, బీచ్‌కి తరుచుగా కలిసి వెళ్లేవాళ్లు. అమూల్యకి తనంటే యిష్టం. తనకి అమూల్యంటే యిష్టం యిష్టం—కాదా మరి. యెంత ఇష్టంలేకపోతే ఇంత ద్వేషం పుట్టుతుంది పెళ్లి చేసుకోమని అడిగాడు ఒప్పుకుంది చాలా సహజంగా జరిగిపోయింది. అంతా చాలా అద్భుతమైన జంట—యిలాటివి చాలా అరుదు అని మెచ్చుకున్నారు. తండ్రికి అంత యిష్టం లేకపోయినా గట్టిగా కాదనలేదు అసలే ఆయన గుండెజబ్బుతో బాధపడుతున్నారు యెక్కువ రోజులు బ్రతకబోవటంలేదని విస్పష్టంగా తెలుసుకున్న ఆయన యీ కాస్తలో కొడుకుని బాధ పెట్టటం యిష్టంలేక సరేనన్నారు. ఆర్నెల్లు బాగానే గడిచిపోయినాయి పెళ్లికాకముందు తనకు కన్పించిన అమూల్యలో తను చూసినవి చాలా తాత్కాలికమైనవని శేఖరానికి అర్థంకాసాగింది. కొంతమంది అంతే నలుగురిలో వున్నప్పుడు వోరకంగా ఒంటరిగా వున్నప్పుడు ఓరకంగా వుంటారు. డబ్బుమీద అమూల్యకిగల విపరీతమైన కాంక్షకి కొన్ని కొన్ని విలువైన విషయాలని అతి నిర్లక్ష్యంగా తోసిపారేసే మనస్తత్వానికి శేఖరానికి చిరాకు రాసాగింది. దానికి తోడు తండ్రి అనారోగ్యం. ఒకే ఒక్కడైన శేఖరం మీద పంచప్రాణాలు పెట్టుకునివున్న ఆయన కొడుకుని క్షణం అవతలకి యివతలకీ కదలనిచ్చేవాడు కాదు. అది అర్థం చేసుకోలేని అమూల్య—శేఖరం తనని కావాలని నిర్లక్ష్యం చేస్తున్నాడని బాధపడి యిష్టంవచ్చినట్లు మాట్లాడేది లెక్కలేనట్లు ప్రవర్తించేది. యెంతో వున్నతంగా—ఆదర్శవంతంగా వుంటుంది అనుకున్న అమూల్య యిలా మారటం చూసి శేఖరాని కేంచెయ్యాలో తోచలేదు. అక్కడికీ వోపికపట్టి అమూల్యకి అసలు విషయం అర్థంఅయేలా చెయ్యటానికి ప్రయత్నించేవాడు. దాన్ని చాతకానితనంగా తీసుకున్న అమూల్య వాళ్ళతో వీళ్ళతో శేఖరం పైకి కన్పించేటటువంటి వ్యక్తిగాదని, అతనిలో రెండు రకాలున్నాయని అతన్ని పెళ్ళిచేసుకోవటంలో తను చాలా బుద్ధితక్కువపనిచేసి ఫలితం అనుభవిస్తున్నానని అనేది అది ఒక్క శేఖరంతోనే గాదు, స్నేహితులతో, అన్నగార్లతో, తండ్రితో అందరితో చెప్పేది. ఆపైన వాళ్ళ వీళ్ళ రావటం, శేఖరానికి యేదో చెప్పబోవటం, దానితో గొడవలు జరగటం—వదిలేసి పుట్టింటికి వెళ్తానని అమూల్య బెదిరించటం, ఈలోపల తండ్రిపోవటం—శేఖరానికి మతిచెడినంత పనైంది ఓప్రక్క తండ్రిపోయాడనే దిగులు, మరోప్రక్క దాంపత్యజీవితం భగ్నమైందన్న దిగులు, అందరికంటే అతీతంగా ఆదర్శంగా వుండాలన్న ప్రయత్నంపోయి అందరికంటే అసహ్యంగా అయిపోయింది అనే ఆవేదన – శేఖరం ఆరోగ్యం పాడయిపోయింది. ఈమధ్యలో మామగారు, బావమరుదులు వుద్యోగంకోసం ప్రయత్నం చెయ్యమనే వేధింపు. శేఖరం ప్రతిదానికి చిరాకుపడసాగాడు. ఒకరోజు యేదో డబ్బు విషయంలో పెద్ద గొడవ జరిగి అమూల్య తండ్రి దగ్గరికి వెళ్ళిపోయింది. వెళ్ళిపోతూ పోతూ మెళ్లో మంగళసూత్రాన్ని తీసి 'నువ్వింత చాతకానివాడివని తెలుస్తే చచ్చినా పెళ్ళిచేసుకునేదాన్ని కాను' అంటూ మొహాన విసిరికొట్టింది ఆ వెళ్ళిపోవటం ఆఖరని అప్పటికే అమూల్య మరొకరితో సంబంధం పెట్టుకుని అతన్ని పెళ్ళి చేసుకోవటానికి సిద్ధంగావుందనీ శేఖరానికి తెలియదు ప్రతిసారిలా అతను అమూల్యను తీసుకురావటానికి మామగారి దగ్గరకు వెళ్లలేదు. గాయపడ్డ అతని హృదయం కోలుకోవటానికి టైమ్ కావాలంది శేఖరం తనని తను తమాయించుకుని, నిగ్రహం తెచ్చుకుని, అమూల్యని యెలాదారికి తీసుకురావాలో నిర్ణయించుకుని మామగారి దగ్గరికి వెళ్లేసరికి అప్పటికి నాలుగురోజుల క్రితమే అమూల్య ప్రసాద్‌తో కలకత్తా వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ పెళ్లి చేసుకునే ప్రయత్నంలో వున్నారని, అతను కొద్ది రోజుల్లో అమెరికా వెడుతున్నాడని—అమూల్య గూడ వెడుతుందని, అనవసరంగా అమూల్యకోసం వెర్రి ప్రయత్నాలు చెయ్యొద్దని—మంచిగా డైవోర్సు యిచ్చెయ్యటం ఉభయకుటుంబాల పరువు ప్రతిష్టలకి మంచిదని ఆయన గట్టిగా అరగంట సేపు లెక్చరిచ్చాడు. కొయ్యబారిపోయిన శేఖరం ఇంటికి తిరిగి వచ్చాడు. 'యెలా చేసుకుంటుంది ప్రసాద్‌ని—తనకి ప్రసాద్ తెలుసు. తనలో లేనివి ప్రసాద్‌లో యేంవున్నాయని అతన్ని చేసుకుంటుంది.

(సశేషం)

మా కొత్తదారులకు, అభిమానులకు
దసరా శుభాకాంక్షలు
నేటి ఫ్యాషన్‌లలో ప్రకాష్ దుస్తులు సరికొత్తవి
అవి ధరించినపుడు మీ మిత్రులకు రీవిగా కనపడతారు

# PRAKASH
TRADE MARK
## DRESSES

స్టాకిస్టు P. శంకరరావు & సన్సు,
(ఆంధ్రప్రభ ఆఫీసువద్ద),
గాంధీనగరం — విజయవాడ-3.

---

# ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన
## దేవి పిల్సు వాడండి

దేవి పిల్సు ముఖ్యంగా
ఆలస్యమైన క్రమంగాకాక
పోయిన, బాధతోగూడిన
లేక ఆగిపోయినబహిష్టు
దేవి పిల్సు బాగుగ
గుణంఇచ్చును

పూర్తికోర్సు ప్యాకెట్టు
28 మాత్రలు వెల రు 11/-
సగంకోర్సు ప్యాకెట్టు
14 మాత్రలు వెల రు 6/8
వి పి అదనము
ప్రతిచోట దొరుకును

DEVI Pills INDICATED IN DELAYED SCANTY PAINFUL & ARRESTED MENSES SEENU & Co.

1 అన్నిసందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును
2 స్త్రీలలోను ఆరోగ్యముతకు ఎట్టిహానికలిగింపదు

**SEENU & CO.,** GRAMS ORCAS (ESTD 1946) PHONE 55357
28, THANDAVARAYA GRAMANI STREET, MADRAS 21.
(ADVT PERMITTED UNDER G O MS NO 1121 HEALTH)

డిస్ట్రిబ్యూటర్లు : మెసర్సు దేవి ఏజన్సీస్, మద్రాసు-21

---

## ఉత్తమ గ్రంథాలు

| | | |
|---|---|---|
| పథేర్ పాంచాలి—విభూతిభూషణబెనర్జీ | | 7-50 |
| జీవనలీల—మానిక్‌లాల్ బంధ్యోపాధ్యాయ | | 6-00 |
| పల్లెజీవులు — | ,, | 2-50 |
| అంతర్ద్వేషాలు — | వనఫూల్ | 2-75 |
| నిశాగీతి — | 'మేఘ' | 3-50 |
| దేవతలయుద్ధం—విశ్వనాథ సత్యనారాయణ | | 1-50 |
| సంసార సుఖం — | టాల్‌స్టాయ్ | 2-50 |
| నవకథామంజరి — ప్రసిద్ధ రచయితలు | | 1-25 |

20 రూ.లు పంపితే అన్నీ పంపబడును.

**విశ్వవాణి పబ్లిషర్సు, విజయవాడ-2.**

---



## పూవు మీ అదృష్టం చెప్పగలదు

మీ భవిష్యత్తులో ఏమి జరుగబోవుచున్నదీ, మీ సరియైన దర్శనగురించిన్నీ మీరు తెలుసుకొనగోరినట్లయితే ఒక పోస్టు కార్డుపైన మీకు యిష్టమగు ఒక పుష్పము పేరున్నూ, మీరు వ్రాయు తేదీ, వేళ వివరములున్నూ, మీ సరియైన చిరునామా యున్న వెంటనే వ్రాసి పంపండి.

జ్యోతిష శాస్త్రములోని రహస్య గణితము మూలముగా మేము గుణించి, మీరు కార్డు వ్రాసిన తేదీల గాయతు 12 మాసములలోను మీయొక్క అదృష్టము, లాభనష్టములు, జీవితమార్గము, ఏ వ్యవహారములో మీకు జయముకలుగునో, మీ ఉద్యోగం విషయంలో మంచిచెడ్డలు, మార్పులు, ఆరోగ్యవిషయము, పరదేశగమనము, తీర్థయాత్రలు, వివాహము, స్త్రీసుఖము, సంతానము, నిధినిక్షేపములు, లాటరీ, అకస్మాద్ద్రవ్యలాభము మొదలగు వానినిగురించి స్పష్టముగా మాసవారీగా వ్రాసి రు. 1-4-0 లకు మాత్రమే వి. పి. గా పంపగలము. (వి. పి. చార్జీలు ప్రత్యేకం) దుష్టగ్రహము లేవయినా వున్న యెడల శాంతిచేయు విధానంకూడా తెలుపగలము. వివరములు మా పూచీపైనపంపబడును. మేము పంపిన భోగట్టా మీకు తృప్తిగా నుండనియెడల పైకము వాపసు చేయబడును. ఒకసారి పరీక్షించి చూడుడు మీ అడ్రసు ఇంగ్లీషులో వ్రాయండి.

Pt DevDutt Shastri, Raj Jyotishi (WP 13) Jullundur City.

---



**పళని శ్రీ కుమారస్వామి లక్ష, కోటిఅర్చనప్రత్యేకవిశేషపూజలు**

3-2-62 నుండి 5-2-62 తేదులలో 8 గ్రహములు ఒక రాశిలో చేరుటచే ప్రపంచమునకుగలుగు ప్రమాదములనుండి భక్తులను రక్షించు నిమిత్తంలోక ప్రసిద్ధి కలియు ప్రత్యక్ష దేవత పళనిబాలకుమారస్వామివారికి వారి పేరు, నక్షత్రములలో విశేష పూజలు జరుపబడును.

| | |
|---|---|
| లక్షార్చన ఒకపూర్తిదినపూజ | రు 25/- |
| పంచామృత అభిషేకం | రు 20/- |
| నెలసరి కృత్తిక అర్చనకట్టలై 1 సం॥ నకు .. | రు 10/- |

ఈసొమ్మునియార్డరుద్వారాపంపవలెను ఉత్తరములుఇంగ్లీషులో వ్రాయవలెను.

**P. NATARAJA PANDARATHIAH,**
Malaikoil Atheena Parambarai
Ayan Miras, PALNI.

---

అశోకా ఆమ్లా
రత్నత్రయము

* అశోకా ఆమ్లా హేరాయిల్
* అశోకా ఆమ్లా పొమేడ్ డీలక్సు
* అశోకా ఆమ్లా బ్రిలియంటైను

నల్లని కురులకు చల్లని గుణమునకు
సాటిలేనివని ప్రఖ్యాతిగాంచినవి

ASOKA AMLA Vegetable HAIR OIL VIJAYA CHEMICALS MADRAS-7
ASOKA BRILLIANTINE
AMLA POMADE

**VIJAYA CHEMICALS**
**MADRAS-7.**

# కేశ శృంగారమునకు
# తగిన హేర్ ఆయిల్

వొత్తుగా పెరిగిన, నిగనిగలాడే నల్లని కురులుగల భారతీయనారి నిత్యం తన జుత్తును
పరిపోషించు కొంటుంది వెంట్రుకల కుదుళ్లకు తగినంత నూనె అందటం మూలంగానే
ఆమె జుత్తు అంత మనోహరంగా వుంటుంది అంచేతనే ఆమె తలయందుగల
సహజ నూనెలను హెచ్చించే తలనూనెను జాగ్రత్తగా ఎంచుకొంటుంది

టాటావారి హెయిర్ ఆయిల్స్‌లో ఆరోగ్యవంతమైన శిరోజాలను వొత్తుగా పెంచేశుద్ధమైన, సులభంగా
యింకిపోయే పోషక పదార్థాలు వున్నాయి, జుత్తును జిడ్డు చేయకుండా నిగనిగలాడిస్తాయి

టాటావారి కోకనట్ మరియు కేష్టర్ హెయిర్ అయిల్సు మనోహరమైన
పరిమళం గలవి మూడు సైజులలో దొరుకుతాయి.






## టాటావారి
## హేర్ ఆయిల్స్

THOY 12-TEL

# స్త్రీజనోద్ధరణఉద్యమం

(7-వ పేజీ తరువాయి)

అనల్పమైనది. "స్త్రీల బుద్ధిబలం మగవారికి ఏమాత్రం తీసిపోదు. అందుచేత మగవారుచేసే ప్రతి పనిలోను పాల్గొనే హక్కు వారికీ ఉన్నది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ఆవశ్యకత ఇద్దరికీ ఉన్నది. ఈ నాడు మన ఉద్యమాలు సగంలో నిలిచిపోతున్నా యంటే మన స్త్రీల దుస్థితే అందుకు కారణం" అని గాంధిజీ వివరించారు.



త్రివర్ణపతాకంరూపొందించిన మహిళ శ్రీమతి కామా

మహాత్ముని పిలుపువిని వేలాది స్త్రీలు స్వాతంత్ర్యోద్యమాగ్నిలో దూకారు. బ్రిటిష్‌వారి తుపాకి గుళ్ళకు ఎదురువెళ్ళారు. ఇళ్ళు, సంసారాలు వదలి, కారాగారవాసం చేశారు. సరోజినీనాయుడు, దుర్గాబాయ్ మొదలైన వారు ప్రదర్శించిన ధైర్యసాహసాలు మగవారికే మార్గదర్శకము లయ్యాయి.

స్త్రీలు తమకూ వోటు హక్కు కావాలని 1919 లో మొట్టమొదటిసారిగా ఆందోళన ప్రారంభించారు. ఈ ఆందోళనమూలంగానే 1925 నాటికి మద్రాసు, బొంబాయి, మధ్య పరగణాలలో స్త్రీలకు వోట్లు లభించాయి. 1926 లో స్త్రీలకు శాసనసభలలో ప్రవేశం కల్పిస్తూ ప్రభుత్వం ఉత్తరువులు జారీ చేసింది. 1927 లో ప్రప్రథమంగా డా. ముత్తులక్ష్మిరెడ్డి మద్రాసు శాసనసభ సభ్యురాలుగా నియుక్తులై, అటు తరువాత ఆ సభకు ఉపాధ్యక్షురాలుగా ఎన్నికయ్యారు. 1935 భారత ప్రభుత్వ చట్టాన్ని అనుసరించి, ఇతర రాష్ట్రాల లోని శాసన సభలలో కూడా స్త్రీలకు ప్రవేశం లభించింది. సంయుక్త పరగణాలలో (నేటి ఉత్తర ప్రదేశ్) శ్రీమతి విజయలక్ష్మీపండిట్ స్థానిక స్వపరిపాలన, ఆరోగ్యశాఖల మంత్రి అయ్యారు. శ్రీమతి రుక్మిణి లక్ష్మీపతి, అటు తరువాత శ్రీమతి జ్యోతి వెంకటాచలం మద్రాసురాష్ట్రంలో మంత్రి పదవులు అలంకరించారు.

స్వతంత్ర భారత రాజ్యాంగం స్త్రీ పురుషులనే వివక్షత లేకుండా వయోజనులందరికీ వోటింగ్ హక్కు ప్రసాదించింది. ఉద్యోగాల విషయంలో నైతేనేమి, చట్టం దృష్టిలోనైతేనేమి స్త్రీలకు పురుషులతో సమానమైన ప్రతిపత్తి సమకూర్చింది.

సమాజంలో స్త్రీలకు చిరకాలంగా జరుగుతున్న అన్యాయాలను అరికట్టడానికి జాతీయ ప్రభుత్వం 1955 లో హిందూ వివాహ, విడాకుల చట్టం రూపొందించింది. ఈ చట్టం బహుపత్నీత్వమును నిషేధించింది. ఉన్మాదం, కుష్ఠు, సుఖరోగాలు కారణాలుగాచూపి విడాకులు పొందటానికి భార్యా భర్తలకు సమానమైన హక్కు లభింపజేసింది వరకట్నాలను నిషేధిస్తూ ఈ మధ్యనే ఒక చట్టం చేసింది బాల్య వివాహాలు, పడుపువృత్తి చట్ట రీత్యా ఏనాడో నిషేధింపబడ్డాయి

ఆస్తి విషయంలో కూడా స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కు కల్పిస్తూ, ప్రభుత్వం 1956 లో హిందూ వారసత్వ చట్టం రూపొందించింది ఈ చట్టంక్రింద తల్లి, భార్య, కూతురు, కొడుకుతోపాటు ఆస్తికి సమాన వాటాదారుల అవుతున్నారు

భారత స్త్రీజాతి వెనుకబడి ఉండటానికి ప్రధాన కారణం విద్యావిహీనతేనని అంతా గుర్తించిన విషయమే ఈ లోపాన్ని సవరించడానికి రాజా రామమోహనరాయ్ కాలంనుంచి కూడా కృషి జరుగుతునే ఉన్నది. కారణాలు ఏవైనా ఈనాటికి కూడా ఆ కృషి తగినంతగా ఫలప్రదం కాలేదని అనుకోవలసివస్తోంది బాలురతో పోల్చిచూస్తే బాలికలకు ఉన్నత విద్యావసతులు అత్యల్పమని తేలుతుంది గత ఎనిమిది సంవత్సరాలలో పాఠశాలలు రెట్టింపు అయ్యాయికాని, ఈ వ్యత్యాసం దాదాపు అట్లాగే ఉన్నది 1949—50 లో పాఠశాలలలో చేరిన ప్రతి 100 మంది బాలురకు 33 మంది బాలికలు చొప్పున ఉంటే, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అంతానికి ఈ సంఖ్య 36 కు పెరిగింది తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలోకూడా బాలికల విద్యా సదుపాయాలు చెప్పుకోతగినంతగా అభివృద్ధిచెందే అవకాశం కనిపించటంలేదు

సాంఘిక సంక్షేమరంగంలోసైతం స్త్రీలు ముందంజవేశారు కేంద్ర సాంఘిక సంక్షేమమండలి అధ్యక్షురాలు శ్రీమతి దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్, ఆమె సహచరులు, రాష్ట్రాలస్థాయిలో ఈ మండలి అనుబంధ సంస్థలు ప్రశస్తమైన సేవ చేస్తున్నారు మారుమూల గ్రామాలలోఉన్న స్త్రీలకు, పిల్లలకు, శాస్త్ర విజ్ఞానంవల్ల కలిగిన సదుపాయాలు లభింపచేయటమే వీరి లక్ష్యం గత ఐదేళ్ళలో 40,500 గ్రామాలకు చెందిన 7 లక్షల మందికి పైగా స్త్రీలు, 22 లక్షల మంది పిల్లలు వీరి కార్యక్రమాలవల్ల ప్రయోజనం పొందారు. చేతి పనుల పునరుద్ధరణకు శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ విశేషమైన కృషిచేసి వాటుమల్ బహుమతి పొందారు. కుటుంబ నియంత్రణ కార్యక్రమ ప్రాముఖ్యాన్ని భారత ప్రభుత్వానికి, ప్రణాళికా సంఘానికి నచ్చ చెప్పిన ఖ్యాతి శ్రీమతి ధనవతీ రామారావుకు దక్కింది.

ఆంధ్రదేశంలో స్త్రీల ఉద్యమం బహుముఖంగా సాగింది. శ్రీమతులు కాంచనపల్లి కనకాంబ, పులవర్తి కమలావతీదేవి, కనపర్తి వరలక్ష్మమ్మ, బాలాంత్రపు శేషమ్మ, జ్వాలారి కలశమ్మ, దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ కుముదంభోగగిరి, బి. కామేశ్వరమ్మ, మొదలైనవారు సాహిత్యంలోను, సంఘసేవలోను విశేషమైన కీర్తిగడించారు. జాతీయోద్యమాలలో పాల్గొని కారాగానికివెళ్ళిన ప్రముఖులలో దువ్వూరి సుబ్బమ్మ, జయంతి సూరమ్మ, వేదాంతం కమలాదేవి, మూల్పూరి చుక్కమ్మ, గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, పెద్దాడ కామేశ్వరమ్మ, చుండూరి రత్నమ్మ, వల్లభనేని సీతామహలక్ష్మమ్మ, దరిశి సుభద్రమ్మ, వాసిరెడ్డి హనుమాయమ్మ, పొణకా కనకమ్మ, బెజవాడ లక్ష్మీకాంతమ్మ మొదలైనవారు ఉన్నారు.

బాల్య వివాహాలు తగ్గిపోయాయి వృద్ధులకు బాలికలనంటగట్టే దురాచారం కూడా చాలావరకు తగ్గిపోయినట్లే కాని వేలాది వితంతువుల స్థితిమాత్రం దుర్భరంగానే మిగిలిపోయింది వీరిని ఉద్ధరించడానికి నిర్విరామంగా కృషి జరిపిన మహనీయుడు కందుకూరి వీరేశలింగంపంతులుగారు వితంతు వివాహ శాసనకారుడైన విద్యాసాగరుని ఉద్యమం వంగదేశంలోకంటే ఆంధ్రలోనే ఎక్కువగా కొనసాగిందంటే వీరేశలింగంగారికృషే కారణం వీర రాజమండ్రిలో వితంతు శరణాలయం స్థాపించారు. ఈ ఉద్యమం క్రమంగా ఇతర జిల్లాలలో కూడా వ్యాపించింది ఉన్నవ లక్ష్మీనారాయణగారు, వెల్లంకి కృష్ణమూర్తిగారు, బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు వితంతు వివాహోద్యమంలో పాల్గొన్న ఇతర ప్రముఖులు వృద్ధులకు బాలికలనిచ్చే దురాచారాన్ని హేళన చేస్తూ గురజాడ అప్పారావుగారు రచించిన 'కన్యాశుల్కం' నాటకం అశేష ప్రజాదరణ పొందింది.

జాతీయోద్యమంలోను, అంతకుమునుపు, ఆ తరువాత కూడా వివిధ రంగాలలో స్త్రీలు నిర్వహించిన పాత్ర పురుషులకు ఏమాత్రం తీసిపోదని ఋజువైనప్పటికి కొందరు నాయకులు ఈ నాటికి కూడా బూజుపట్టిన తమ భావాలను విడనాడ లేకుండాఉన్నారంటే ఆశ్చర్యంగానే ఉంటుంది స్టేట్స్‌మన్ పత్రికలో శ్రీ పి సి చౌధురి ఇటీవల వ్రాసిన వ్యాసం ఈ సందర్భంలో పరిశీలనార్హం కాగలదు ఒక్కవిషయం మాత్రం నిజం పరిస్థితులు ఎంత క్లిష్టమైనవి అయినా, సమస్యలు ఎంత తీవ్ర రూపం ధరించినా, వాటిని ఎదుర్కొని పరిష్కరించగల కార్యదీక్ష, చాకచక్యం, సౌశీల్యం భారతీయమహిళలకున్నాయని చరిత్ర ధ్రువపరుస్తోంది వారి ఉద్యమాలు సఫలం కావడానికి ఆ సద్గుణసంపత్తే దోహదకారికాగలదు ★



దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

# గళ్లనుడికట్టు-74

[ఈ నుడికట్టులో కొన్ని మాటలకు ఆధారాలు ఉండవు కాని ఈ మాటలన్నీ 'స్త్రీ'ని సూచిస్తాయి—ఇది వనితాలోకం ప్రత్యేక సంచిక కనుక!]



## అడ్డం

7. ఆయాసము కొంచెం తగ్గితే ఇనుము!
9 ఇంకానయము! నత్తిలో అక్షరముచేరిస్తే కన్ను రావాలి.
12 దేశీయమని అర్థమా? లేక మొక్క 'గుచ్చు' అని అర్థమా ?
13 రోజా ఇదే!
15 పాతిక నాణేములు కలది.
17 వెల
19 క్రీడ
21 కళ్లుమూసుకుంటే రావచ్చు!
23 '—,భయాన' అంటారు
24 —నిద్ర అంటారు, సరిగ్గా లేకపోతే! [అటు నుంచి వ్రాయాలి]
28 మిమ్మల్ని నిన్న చూస్తే రత్నం కనిపించింది.
30 మగడు
31 గంగ
34 కరలా? డాగులా? గురుతులా?

## నిలువు

1 నమిలే వస్తువు, గొంతుకలోకి పోక ఏమి చేస్తుంది?
2. విదియవంటిదే, మూడవది
3 నేసేందుకు పనికి వస్తుంది.
4 అయిదవ ప్రత్యయాలలో ఒకటి!
5 మన అన్నగారిలోనే సన్మానమా ?
6 తలక్రిందులయిన కాల విశేషమా ?
7 పోటు కానిది
8. బలము, నత్తుపాత్రవల్ల గ్రహించవచ్చు.
10. మాయ వలువలు కావు ధాన్యములు.
11. వార్థకము. ముదితకు కూడా తప్పదా ?
14 13 అడ్డం తిప్పితే దేవుడి వాహనం!
15 పాటనడుమ, అలంకారం వెదకండి.
16 బుజ్జగము (వాడుకలో)
17 గరుత్మంతుడి తల్లి.
18 అడవి, తోపు, యవనిక చివర.
22 చక్రాల గాడి
24 అవస్థ! [యమ—]
26 తలక్రిందులయిన మామిడిపండు ["బాల—సాలసవపల్లవ కోమల . . ."]
29. క్రిందనుంచిచూస్తే ఏమీ ఉండదు! శూన్యమే!
30 ఎన్నో
32. క్రిందకి జారయినా కప్పుకునేది తేవాలి.
33. ధైర్యము.
34. మడుపు
35 కళావరు ఆను ఆడితే పడవ నడిపేవాడు వస్తాడు!
36 పైకి నిప్పు!
37. సమితిలో కొలది ఉన్నదా ?

### 73-వ గళ్ళనుడికట్టుకు జవాబు



ఋతువులు, వాటి మార్పును గూర్చి పిల్లలమనస్సుకి పట్టేటట్టు ఆవిడ పాఠం చెప్పుకుపోతోంది. మధ్యలో ఒక అమ్మాయి పాఠం శ్రద్ధగా వినక పోవడం చూచి హఠాత్తుగా "పులిలాగా వచ్చి పిల్లి లాగా పోయేదేది?" అని ప్రశ్నించింది.

ఆ అమ్మాయి గాభరాగా లేచి, కాసేపు ఆలోచించి 'నాన్న గారు' అంది.

* * * *

మేష్టారు:- దేశం అంతటా రైళ్ల సౌకర్యం ఉన్నా వినోబాజీ పాదయాత్ర ఎందుకు చేస్తారురా?

కుర్రాడు:- వారికి తొందరగా వెళ్లాల్సిన అర్జంటు పను లెన్నో ఉంటాయండి.

## ఆల్విదా! ఆల్విదా!

[శ్రీ శ్రీరంగం నారాయణబాబుగారు ఈనెల రెండవ తేదీన దివంగతులయ్యారు. వారి చివరి రచన "అచ్చిరాని చదువులు" 5-7-61 ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురించాము]

మరణం మనభాష నేర్చుకొంది
మనస్సులో చీకటి ఆవరించింది
కవిత్వం జలదరించి
కన్నీళ్లు జల్లుగా
చప్పుడులేని వాన
నొప్పిగా కురిసింది.

అయిన వాళ్ళు ముగ్గురు
ఆత్మలోనే ఏడ్చారు.
ఏడవ సర్గస్తున్నాడు
యవనాశ్వాన్ని ఎక్కి వెళ్లినట్లు
అశ్వారూఢుడై
అంతిమయాత్ర.

ఇన్నాళ్ళ స్మృతులు
ఇంకుగా మారింది.
ఇదుగో రాస్తున్నాను
అశ్రు నైవేద్యం చేయడానికి
ఆత్మీయత కాగితంగా ఆఖరిపద్యం
హృదయాల ప్రమిదలో
రుధిరజ్యోతి.

చిత్తం ఒత్తిగా
చిన్మయజ్యోతి
సాహిత్య బంధువు చిహ్నంగా
సంతతం వెలిగేందుకు
సామిధేని పాడుకున్నాను.

ఒంటరిగా జీవించావు
ఒంటరిగా మరణించావు.

అయినా అందరిలో నిలుస్తావు
అప్పుడప్పుడు పిలుస్తావు
ఏకాకి ఎప్పుడూ
బహుకుటుంబి.
నీకోసం విలపించారు
నిజంగా ఎంతోమంది.
ఆకాశంలో ఎగురుతున్న
హంసా!
ఆల్విదా!

—ఆరుద్ర

ఇది గసరా ప్రత్యేక సంచిక కావటంచేత కొన్ని మామూలు శీర్షికలకు అవకాశం లేకపోయింది




Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.